శ్రీ.

# కమలా.

## ప్రథమ ప్రకరణము.

కమలా యను నొక కన్యక గోవిందరాజ నగరము (దిగువతిరుపతి) రథోత్సవమును జూచుటకు బోయియుండెను. ఈచిన్నదానికి పదునొకండుసంవత్సరములు పూర్తి కాలేదు. దానిస్థితి మొదట చక్కఁగానుండెను; ఐశ్వర్యవంతుని కూఁతురు. అయితే తండ్రి కాలధర్మమునొందెను; దాని తల్లిపై దాయాదియొకఁడు కోర్టులో దావా చేసి సకలసొత్తులను అపహరించెను; అందుకై హైకోర్టులో అప్పీల్ చేసినది. అచ్చటను విధవరాలికి విరోధముగా తీర్పు అయినది. తీర్పు అయినమీఁద డిక్రీదారుఁడైన దాయాది ఇల్లు మొదలగు సమస్తమును స్వాధీనము చేసికొని తల్లిని కుమార్తెను ఇల్లువిడిచి వెడలఁగొట్టెను. ఆ స్థియంతయు సుమారు పదిలక్షుల రూపాయలుండును; డిక్రీదారుఁడు సర్వస్వమును వశము చేసికొనెను. చేతిలోనున్న రొక్కము కోర్టుఖర్చులు మొదలగువానికి యిచ్చియైనది, చేతిలో నొకదమ్మిడి కూడ లేదు. కమలా తల్లి తానుధరించియున్న ఒకటి రెండు నగలను విక్రయించి, ప్రివికౌన్సిలుకు అప్పీలుచేసెను. చేతనున్నదంతయు వ్యయమై కూటికి మార్గము లేక పోయెను. మగఁడు లేనిది ; మఱేమిచేయును ? కొంచెము దూరములోనేయొక చిన్నగుడిసె వేసికొని కాయకష్టముచేసి వచ్చి

న చేస్తూ కాలహరణము చేయుచుండెను. కమలకు పెండ్లి చేయుటకు సాగదు. బీదవారింటి పడుచు, ఎవరికి కావలయును? ఎవరు తీసికొందురు?

ఈ దౌర్భాగ్యమునకు తోడుగా పైన చెప్పిన ఉత్సవమునకు కొన్నాళ్ళకు ముందుగ కమలా తల్లికి మిక్కిలి ఆయాసము కలిగెను. అందుచేత కూలిచేసి కాలము గడపుట కూడ నిలిచిపోయెను. ఇంక అన్నమునకు మార్గము లేదు. తల్లి రోగపీడితురాలైనందున ఉపవాసమే గతి! కమలా చేత కానేరదు. రథోత్సవమునాడు తల్లికి కొంచెము దిగుముఖము కనుపించెను. పథ్యమున కేమైనను కావలయును. అయితే పథ్యమున కెక్కడనుండి తెచ్చేది? ఎవరిత్తురు?

కమలా కన్నీరు కార్చుచు అచ్చటచ్చట నేలకు రాలి పడియుండు అడవిపూవులు నేరుకొనివచ్చి యొక హారము కట్టి, తనమనస్సులో ఈ హారమును జాతరయందు అమ్మితే రెండు మూడు దుగ్గానులు దొరుకును, తల్లి పథ్యమున కేమైనను తెచ్చిపెట్టవచ్చు నని ఆలోచించెను.

అయితే జాతర అగునప్పుడు మధ్యకాలమునందు గొప్ప వాన ప్రారంభమైనది. వాననుజూచి జాతరకు వచ్చిన జనులందఱు పరుగెత్తి పోయిరి. పూలహారమును ఎవ్వరును తీసికొనలేదు. కమలా తన మనస్సునందు, నేనిప్పుడే పోగూడదు, వాననిలిచితే జాతరగుంపు మఱల చేరును. అప్పుడు ఎవరైనను పుష్పహారమును తీసికొందురని యోచించెను. అయితే వర్షము నిలువలేదు. మఱల జాతర కాలేదు. సాయంకాలమైనది, రాత్రి యైనది,

గాఢాంధకార మైనది; అప్పుడు కమలా, యత్నములేక ఏడ్చుచు ఇంటివైపు తిరిగెను.

అంధకారము, మార్గమంతయుబురదను, జాఱుచున్నది. ఏమియును కంటికి కగపడదు. ఇట్టి స్థితిలో ముసలధారగా ఉఱుముతోడ వర్షము కురియు చుండెను తల్లి యొక్క ఉపవాసము జ్ఞాపకమునకువచ్చి కమలా కన్నులయందుండి వర్షధారలకంటె అధికముగ ప్రవింప నారంభించెను. అది యేడ్చుచు అక్కడక్కడ జాఱిపడి లేచుచు వచ్చుచుండెను. దాని యత్యంతనీలమైన అలకావలి రెండు ప్రక్కలలోను విలంబమై వానలో తడిసి నీరుకారు చుండెను. అయితే కమలా ఆదుర్గని పూలహారమును డియం దుంచుకొని యుండెను, పారవేయలేదు.

ఇట్టి అంధకారమునందు అకస్మాత్తుగా నెవరో ఒకరు వచ్చి కమలమీఁదపడిరి. కమల యిదివఱకును హోయని యేడ్చినట్లుగనే అప్పుడును ఏడ్చెను.

పైనపడిన వ్యక్తి— ఎవరమ్మా! ఎందు కేడ్చెదవు? అని ప్రశ్నచేసెను.

అది పురుషుని గొంతుగ నుండెను. కంఠస్వరమును విని కమల రోదనమును నిల్పెను. వాఁడు కమలకు పరిచితుఁడు కాఁడు. చిన్నపిల్లగానుండినను ఆవయస్సులోఁగూడ వాని మాటవలన వాఁడు మిగుల దయాళువని తెలిసికొనెను. కమల యేడ్పునంతయు నణఁచుకొని నేను బీదవారింటి పిల్లను, నాకెవ్వరును దిక్కులేదు, తల్లిమాత్రమే ఇంటిలో యున్న దనెను.

అన్యుక్తి:— నీ వెచ్చటికి పోయియుంటివి?

కమలా:— నేను రథోత్సవమును జూచుటకుఁ బోయి యుంటిని; ఇంటికి పోయెదను. ఈ వాన చీఁకటియందు దారియే తెలియ లేదు.

పురుషుఁడు:— నీ యిల్లెక్కడ?

కమలా:— అలమేలు మంగాపురమునందు.

పురుషుఁడు; నాతోఁగూడ రమ్ము, నేను అచ్చటికిఁ బోయెదను, నడువుము, నీ యిల్లెక్కడ చెప్పుము, నిన్ను ఇంటిలో విడిచిపోయెదను, మిగుల జాఱుచున్నది, నా చేతిని పట్టుకొని రమ్ము, లేకుంటే పడుదువు అనిచెప్పెను.

ఇట్లు చెప్పి ఆపురుషుఁడు కమలనుపిలుచుకొనిపోయెను. అంధకారమైనందువలన కమల వయస్సు తెలియలేదు. అయితే దాని కంఠస్వరమునలన అది పెద్ద పిల్లయని తెలిసెను. అది వానిచేయిపట్టుకొనెను, హస్తస్పర్శముచేతను కమల పెద్దపిల్లయని తెలిసి, నీకెన్ని సంవత్సరములనియడిగెను.

కమలా:—పది పదునొకండు సంవత్సరములు.

పురుషుఁడు:—నీ పేరేమి?

కమల:—కమలా.

కమలా? నీవు చిన్నదానవు, ఒంటిరిగా జాతరకుపోయినదెందుకు?

ఇట్లుమాటలాడుచు మంచిమాటలచే అడిగి దానివలన వనపుష్పమాలికవిచారమును బయటతీసెను. తర్వాతతాను తల్లికి పథ్యములకు ఆమాలను అమ్ముటకు జాతరకుపోయి వానచేత జాతరలో హారమును అమ్ముటకుగాక దానిని తీసికొనివచ్చిన సంగతులనంతయు చెప్పెను. దీనిని విని

ఆపురుషుఁడు నేను మాయింటి దేవునికి యొకహారమునిమి త్తము పోయిచూచితిని, జాతర మధ్యకాలమున నిల్చిపో యెను, నాకు పుష్పము దొరకలేదు. నీవు హారము విక్ర యించేయెడల నేను వెలయిచ్చి తీసికొనెదను.

కమలకుమిక్కిలి సంతోషమైనది. అయితేమనన్నునందు నన్ను ఇంతటి ప్రయత్నపురస్సరముగా చీఁకటియందుచేయి పట్టుకొని యింటికి పిలుచుకొని పోవు వానియొద్దక్రయము తీసికొనవచ్చునా యని యోచించి, తోడనే యిపుడుక్రయ మును నేను తీసికొనక పోతినేనితల్లికి అన్నము లేకపోవుచు న్నది, కాఁబట్టి తీసికొనవలయునని నిశ్చయముచేసికొని, మా లను తనతోఁగూడవచ్చుఆపురుషుని చేతికిచ్చెను. అతఁడు దీనిక్రయము నాలుగుదుగ్గానులు తీసికొనుమని క్రయము నిచ్చెను. కమలా. తీసికొని యదేమి దుగ్గాని ? పట్టిచూచితే పెద్దపెద్దదిగాఁ గనబడుచున్నదే యనెను.

అది పెద్దదుగ్గాని, రెండేయిచ్చియున్నాను, ఎక్కువయి య్యలేదు, చూడుము.

కమలా:—ఇదేమి? ఈచీకటియందుగూడ ప్రకాశిం చునట్లు కనఁబడుచున్నది, మఱచి యేమైనను రూపాయల ను ఇచ్చియుండవచ్చునని తోఁచుచున్నది.

లేదు, క్రొత్తదుగ్గాని, అది ప్రకాశించేదికలదు.

కమలా:—మంచిది, ఇంటికిపోయి దీపమును వెలిగించి చూచెదను, దుగ్గానికాకుంటే మీకిచ్చెదను. అంతవఱకు తమరచ్చట నిలిచియుండవలయును.

కొంతసేపటికి కమల తల్లియుండే కుటీరము యొద్దకు వారిద్దఱునువచ్చిరి, అచ్చట కమల మీరు లోపలికివచ్చిన

లువవలయును, నేను దీపము వెలిగించి రూపాయిరేయో,దు
గ్గానిరేయో చూచెద ననెను.

కూడవచ్చినపురుషుఁడు: —నేను బయటనిలచెదను,నీ
వు మొదట కట్టుకొనియుండే చీరెను విడిచి వేఱేచీరెనుకట్టు
కొని తర్వాత దీపము వెలిగించుమనెను.

కమల — నాకు వేఱే చీరె లేదు, ఒకటి యున్నదానిని
ఉతుకుటకు చాకలిచేతి కిచ్చియున్నాను, నే నెప్పుడును తడి
బట్టతోనే యున్నాను, నాకు వ్యాధి వచ్చుటలేదు, ఒక
ప్రక్కకొంగు పిండికట్టుకొనెదను, మీరు లోపలికి వచ్చి
యుండుడు, దీపమును వెలిగించెద.

పురుషుఁడు;— "మంచిది"

ఇంటియందు నూనెలేనందున నారులోనుండి పిడి
కెడుకసవు పెటికి అగ్గిపుల్లరాచి వెలిగించ వలసివచ్చెను,
అందునిమిత్తము కొంత ప్రొద్దయినది, ఆ వెలుతురులో
చూడఁగా దుగ్గానికాదు, రూపాయలుగా నుండెను.

కమల బయటవచ్చిచూచినది, రూపాయలను ఇచ్చిన
నవాఁడు లేడు. వాఁడు బయలుదేరిపోయెను.

కమల విషణ్ణవదనురాలై ఈసమాచారమునంతయుత
ల్లికిఁ జెప్పి, తల్లిముఖమును జూచుచు పశ్చాత్తాపముతో అ
మ్మా! ఇప్పుడేమిచేయవచ్చును? అని యడిగినది

తల్లి, యేమిచేయవచ్చునమ్మా! వాఁడేమో తెలియక
యిచ్చినవాఁడుకాదు; వాఁడుదాత, మనదుఃఖమునువిని
దానముచేసినాఁడు; మనమో భిక్షుకులమైతిమి, దానగ్ర
హణముచేసి వెచ్చముచేసి కొనుదమనినది.

వారిద్దరును ఈలాగు మాటలాడుచుండఁగా, ఎవరో కడపకు ఆవలనుండి గడునుపట్టి ఆడించిరి. కమల తలుపు తెఱ చెను. వాఁడే మరలవచ్చినాఁడని యోచించెను, అయ్యో! గ్రహచారమా! వాఁడు కాదు; వాఁడెందుకు వచ్చును? వీఁడు మొల్ల కంటి జవిళియంగడివాఁడు.

కమలయుండే గుడిసెకును అంగడివీధికిని చాలాదూ రము లేదు ఆగుడిసెకు సమీపమునందే జవిళీ వ్యాపార ముచేయు మొల్లకంటి గోవిందు సెట్టియంగడి. ఆ మొల్ల కంటి గోవిందుఁడే ఒకజత కాంచీపురము చీరెలను దీసికొనివచ్చి గడునుపట్టి ఆడించినాఁడు. తలుపు తియ్యగానే ఆ చీరెలను కమలా, నీవుతీసికొనుమని చెప్పియిచ్చెను.

కమల, ఇదేమి? నాకు చీరెలిచ్చినవారెవ్వరని యడి గెను.

గోవిందుసెట్టి, కమలచెప్పినదానిని విని, కొంచెము విస్మితుఁడై, అతఁడు ఎవఁడో యేమో తెలియదు, ఇప్పుడే యొక పెద్దమనిషి నాకు రొక్కమిచ్చి యీచీరెలను కమ లకిచ్చి రమ్మని చెప్పెను.

కమల, వాఁడేయౌను, ఇంకెవరు? ఏమిగోవిందుసెట్టీ! వాఁడేవచ్చి యీ చీరెలను బేరమాడినాఁడా? అని యడిగెను.

కమలకు తనతండ్రి కాలమునుండి గోవిందుసెట్టి చక్కఁగాఁ దెలిసిన వాఁడుగ నుండెను. అతఁడు జీవించి యున్న కాలమందు నాలుగురూపాయల చీరెకు ప్రమా ణముచేసి యెనిమిదిన్నరరూపాయ అసలు క్రయమని

చెప్పి, అందుమీఁద రూపాయకు రెండణాలు లాభమని తీసికొనుచుండెను.

కమల — గోవిందుసెట్టీ! ఆపెద్దమనిషిని నీవెఱుఁగుదువా?

గోవిందుసెట్టి — మీకు తెలియదా యేమి?

కమల — తెలియదు.

గోవిందుసెట్టి — మీకుటుంబముతోఁ జేరినవాఁడని యెంచితిని, నాకును తెలియదు.

అనిపలికి గోవిందుసెట్టి, తనలో ఆఱు రూపాయల చీరెలకు పదిన్నర రూపాయియు, లాభము వేఱుగను తీసికొంటిని, ఇంక హెచ్చుమాటలవలన ప్రయోజనము లేదని యోచించికొని ప్రసన్న చిత్తుఁడై తనయంగడికి పోయెను.

అనంతరము కమల, హారమునకు వాఁడిచ్చిన రూపాయలను తల్లిపథ్యమునకు భోజనపదార్థములు తీసికొని వచ్చుటకు అంగడివీథికి పోయెను. అంగడికిపోయి కావలసిన పదార్థములను సామానును తీసికొనివచ్చి దీపము వెలిగించెను. తల్లినిమిత్తమై వంటచేసెను. తర్వాత తల్లికి పథ్యము ఈయవలయునని యోచించి యింటిని ఊడ్చెను. ఊడ్చునప్పుడు ఒకకాగితము దొరకెను దానిని తల్లికి చూపించి యిదేమమ్మా! అని యడిగెను

తల్లిచూచి యిది నోటు అనిచెప్పెను. కమల వాఁడే వేసిపోయినాఁడేమో? అనినది.

తల్లి, నీకిచ్చిపోయినాఁడు, అందులోచూడుము, కమలకు యీనోటు అని వ్రాసియున్నాఁడనెను.

# ప్రథమ ప్రకరణము.

కమల:—అట్టివాఁడు వాఁడెవఁడమ్మా!

తల్లి:—వానిపేరుకూడ నోటులో వ్రాసియున్నది. ఎందుకనఁగా, దీనిని యెవరైనను దొంగనోటని చెప్పుదురని తనపేరు వ్రాసియున్నాఁడు. వానిపేరు లక్ష్మీకాంతరావు.

మరుదినము తల్లికూఁతులిద్దరును లక్ష్మీకాంతరావును వెదకిరి. అలమేలుమంగాపురమునందును ఆసమీపము లోని యితరస్థలముల యందును వాని సమాచారమే దొరకలేదు; నోటును వారు మార్చలేదు. అట్లే పెట్టుకొనియుండిరి వారు దరిద్రులుగానున్నను అత్యాశగలవారుగా నుండలేదు.

---

## ద్వి తీ య ప్ర క ర ణ ము.

---

కమలాతల్లి, పథ్యమును మాత్రము తీసికొనెను; అయితే రోగమునుండి విముక్తురాలగుట దాని యదృష్టమునందులేదు. అది బహు ధనికురాలుగ నుండెను. ప్రస్తుతమున మాత్రము కేవలము దరిద్రురాలైనది; యీ శారీరక మానసిక కష్టమును దుఃఖమును సహింపక పోయెను. రోగము వృద్ధియగుచు దానికి అవసానకాలమువచ్చెను.

ఇట్టి సమయమునందు సీమలోనుండిప్రివికౌన్సిలులో దానిప్రక్క తీర్పు అయినట్లు సమాచారము వచ్చెను. ఆస్తియంతయు దానికి యిచ్చేదిగాక, సెలవయిన రూపాయలును, జామీనురూపాయలను కూడా యీయవలయు

వని డిక్రీ నిష్కర్షయైనది. హైకోర్టులో దీనిప్రక్కవకీలు గానున్న సుబ్రహ్మణ్యం పంతులుగారే ఆమె గుడిసెకు వచ్చి యీవర్తమానమును జెప్పెను. ఆమాటవిని రోగి యొక్క కన్నులయందుండి అవిరళముగా నీటిధారస్ర వింప నారంభించెను.

అది కొంతసేపటికి కన్నీరుతుడిచికొని సుబ్రహ్మణ్యంపం తులనుజూచి ఆరిపోయిన దీపమునకు నూనెపోసి ప్రయో జనమేమి ? నీవుచెప్పిన యీవర్తమానమువలన నాప్రా ణము నిలువఁబోదు. నా ఆయుస్సు తీరిపోవుకాలము వచ్చినది. అయితే ఇఁకమీఁద కమలను అనాహారినై ప్రాణత్యాగముచేయుదు, అనెడు నమ్మకముపుట్టి సుఖి నైతిని ; అయినను ఆసొత్తునుగూడ ఎవరు తెలిసికొను టకగును? అది యింకను పసిపిల్ల ; ఈ సకలసంపత్తును దాని నిమిత్తమై యెవరు కాపాడియియ్యగలరు ? నీవే ఆధారము, నిన్నునమ్మినాను ; ఈ నా అంత్యకాలమున నిన్నొక భిక్షను అడుగుచున్నాను, దయచేసియిమ్ము, నిన్నుగాక మఱెవరిని వేడుదును ? అనిచెప్పినది.

సుబ్రహ్మణ్యం పంతులు మిక్కిలి పెద్దమనిషి, మఱి యును కమలా తండ్రికి బంధువు. కమలా తల్లి దుర్దశా గ్రస్తురాలయినది మొదలు ఆమెను ప్రివికౌన్సిలులో అపీలు పైసలగువఱకు తనయింటియందు వచ్చియున్న యెడల తనతల్లివలె నుంచుకొనియుండెదనని ప్రార్థించు చుండెను. కమలతల్లి దానికి సమ్మతించలేదు. సుబ్రహ్మ ణ్యంపంతులు నెల కేదైన వెచ్చమునకిచ్చెదను, దానిని తీసికొనఁమనిచెప్పెను. అందుకామె, ''నాయొద్ద కొంచెము

మిగిలియున్నది. ఆవశ్యకమైనప్పుడు తీసికొనెద" నని సాకు చెప్పి వానిసహాయమును బొందుటకు సమ్మతించలేదు. లక్ష్మీకాంతరావు చేసినదానమును గ్రహించుటయే ప్రథమము, మఱియు అదే కడపటి దానగ్రహణము. కమల తల్లి, యింతటి కష్టదశలో నుండుసంగతి సుబ్రహ్మణ్యం పంతులకు తెలియదు. వీరి దశనుగూర్చి సుబ్రహ్మణ్యం పంతులు మిగుల దుఃఖించెను. కమలతల్లి గాని అంత్య కాలమున వేడుకొన్నదానిని విని వానికిమఱింత దుఃఖము హెచ్చెనది. అమీఁద వాఁడు కమల తల్లినిజూచి"తాము అనుజ్ఞ యియ్యండి, నేనేమిచేయఁదగినది' తమ యిష్టాను సారము నెఱవేర్చెద" ననెను.

కమలతల్లి "నేను పోవుచున్నాను, కమల యున్నది ; కోర్టులో మనమామగారి విల్ స్థిరమైనది. ఆయాస్తికంతయు కమల యొక్కతెయే అధికారియగును నీవు దానిని నీకుమార్తెవలె జూచుకొనవలయును, ఇదే నేను ప్రార్థించునది, నీవు దీనికి సమ్మతించి ఒప్పుకొనినయెడల సుఖముగ ప్రాణమును విడువగల" ననెను. సుబ్రహ్మణ్యం పంతులు "నేను ప్రమాణముగ కమలను నాకుమార్తెకంటెను ఎక్కువగా జూచుకొనెదను, నేనీమాటను త్రికరణశుద్ధిగాఁజెప్పెదను, తాముదీనిని నమ్మవలయు" ననిచెప్పెను.

ప్రాణావసానస్థితియందున్న కమలతల్లి సుబ్రహ్మణ్యం పంతులయొక్క కన్నులయందు నీరుస్రవించుటను జూచి ఆతనిమాటలయందు విశ్వాసముంచినది. దానియొక్క పిడచకట్టిన అధరమునందు ఆహ్లాదసూచకమైన నవ్వు కనుపించెను. సుబ్రహ్మణ్యంపంతులు ఆ నవ్వును జూచి, ఇది ఇంక బ్రతుకదని తెలిసికొనెను. సుబ్రహ్మణ్యంపంతులు

ఆమెను జూచి ఇప్పుడైనను తాము నాయింటికివచ్చి కొన్నాళ్లుండి, తమయిల్లు కోర్టునూలముగా స్వాధీన మైనమీఁద అక్కడికిపోవచ్చునని చాల వేఁడుకొనెను. కమలతల్లి దారిద్ర్యావస్థయందు పరులయింటికి బోవు టకు సమ్మతించలేదు. ఇప్పుడు దారిద్ర్యముపోయెను. కనుక వానియింట నుండుటకు ఒప్పుకొనెను. సుబ్రహ్మణ్యంపం తులు కమలను దానితల్లిని గోవిందరాజనగరమునకు తన యింటికిఁ బిలుచుకొని పోయెను.

వాఁడు ఆమెను తల్లివలె భావించి చికిత్సచేసెను. రోగమునివర్తికాలేదు ; కొన్నాళ్లలోపల ఆమె దైవాధీ నురాలైనది. కాలక్రమమున సుబ్రహ్మణ్యంపంతులు కమ లయొక్క ఆస్తి నంతయు స్వాధీనముచేసి యిచ్చెను. అయితే కమల యింకను పసిపిల్లయైనందున సుబ్రహ్మణ్యం పంతులు దానిని సొంతయింటియందు ఒంటరిగానుంచు టకు మనసొప్పక తనయింటియందే యుంచుకొనియుం డెను. కలెక్టరుగారే దానిఆస్తిని కోర్టాప్ వార్డ్సువారియొ క్కస్వాధీనము చేసికొనుటకుప్రయత్నపడిరి. సుబ్రహ్మణ్యం పంతులు తాను కమల నిమిత్తము దాని ఆస్తినికాపాడున ట్లుగ సర్కారు నౌకరులు కాపాడరని యోచించి, ఆవిష యమునుగూర్చి వాదించిన మీఁద కలెక్టరుగారు ఊరకుం డిరి. తానేకమలఆస్తియొక్క విచారణచేసి కొనుచుండెను.

ఇంకను కావలసి యుండునది కమల వివాహము. అయితే సుబ్రహ్మణ్యంపంతులు క్రొత్తసంప్రదాయస్థుఁడు (నవనాగరికుఁడు) అయినందువలన బాల్యవివాహముచే యుటకు వాఁడు ఇష్టపడలేదు. శీఘ్రముగ పెండ్లి చేయక పోయినయెడల జాతిలో వెలివేయుదురనే భయమును

లేదు. తనయొక్క కుమార్తెయును కాదు. కమలకు ఇష్ట మునచ్చినప్పుడు తానే పెండ్లి చేసికొనునని, అంతవఱకుచదు వుచుండునని, అని వివాహవిచారముగా ఏయొక్క ప్రయత్నమును చేయక దానికి చక్కఁగా చదువను వ్రాయను నేర్పించెను.

---

## తృతీయ ప్రకరణము.

ఏడుసంవత్సరములైనది, కమల పదునారేండ్లవయస్సు గలిగిన పరమసుందరియాయెను. అది అంతఃపురమునందే యున్నందుచే దాని రూప సౌందర్యాదులను ఎవ్వరును చూచుటకు అవకాశములేదు. దానియొక్క వివాహ కాలము సంప్రాప్తమైనది సుబ్రహ్మణ్యంపంతులు అది యెవరినివరించునో అట్టివానికిచ్చి పెండ్లిచేయవలయునని యోచించి దానియిష్టమును తెలిసికొనుటను తనకుమా ర్తెయైన కృష్ణవేణిని బిలిచి తనయొక్క మనోగతమును దానికి చెప్పెను. కృష్ణవేణి కమలకు ముఖ్యస్నేహితురా లుగ నుండెను. తండ్రిచెప్పగానే, లజ్జచే కొంచెము హాస న్ముఖురాలై తండ్రినిజూచి లక్ష్మీకాంతరావను వాఁడెవఁ డైన నున్నాఁడా యని యడిగెను.

సుబ్రహ్మణ్యంపంతులు విస్మితుఁడై, ఆపేరుగల వానిని నేను చూడలేదు, ఎందుకు? అని యడిగెను.

కృష్ణవేణి—కమల లక్ష్మీకాంతరావును తక్క మఱె వ్వరిని పెండ్లిచేసికొనుట లేదని చెప్పియున్నది.

సుబ్రహ్మణ్యంపంతులు—అదెట్లు? ఆ అన్యపురుషు నకును కమలకును పరిచయమగుటకు కారణమేమి?

కృష్ణవేణి, తలవంచుకొని కొంచెము నవ్వి, కమలవలన తానువినిన రథోత్సవమునాఁడురాత్రి జరిగినదానినంతయు సవిస్తరముగ తండ్రికి తెలియపఱచెను.

సుబ్రహ్మణ్యం పంతులు, లక్ష్మీకాంతరావని మిగుల శ్లాఘించి కమల యేమో భ్రమజెందియున్నట్లు తోఁచుచున్నది. వివాహము కృతజ్ఞతానుసారముగా జరిగించతగినది కాదు. లక్ష్మీకాంతరావునకు కృతజ్ఞతగా నుండవలసినది కమలకు కర్తవ్యమేయగును. సమయము వచ్చినప్పుడు వానికి అవశ్యముగా ప్రత్యుపకారము చేసియేతీరవలయును. లక్ష్మీకాంతరావు దీనిని పెండ్లి చేసికొనునంతటి బాధ్యత యేమియాగనఁబడ లేదు, ఇంతకును అతఁడుఏజాతివాఁడో, ఎన్నియేండ్లవాఁడో, అది యెవరికి తెలియును? వానికి కే తే పెండ్లాము బిడ్డలున్నారేమో, వాఁడు దీనిని పెండ్లి చేసికొనుటయెట్లు? దీనినంతయును యోచించునట్లు కమల తో చెప్పవలసినదని చెప్పెను.

కృష్ణవేణి —అట్టి సంభవమేమియును కనబడ లేదని కమలకే చక్కఁగా దెలిసియున్నది, అయితే ఆరాత్రినుండి వానిప్రతిమను కల్పనచేసి మనస్సునందుంచుకొనియున్నది, జనులు దేవుని పూజించునట్లు ఆప్రతిమను ప్రతిదినమును మనస్సునందు పూజించుచున్నది, అది మనయింటికివచ్చి అయిదేండ్లయినది, ఇంతవఱకు నొకనాఁడైనను లక్ష్మీకాంతరావుమాట యెత్తని దినము లేదు. మఱెవ్వరిని పెండ్లి చేసికొనినను తనకు ఎంతమాత్రమును సుఖము కలుగదని చెప్పెను.

సుబ్రహ్మణ్యంపంతులు మనస్సునందు, ఇది యొకవిధ మోహారోగము, దీనికి చికిత్స ఆవశ్యకమైనది. అయి

తే వానిని కనిపెట్టుటయే మొదటి చికిత్సగానున్నదని యెంచుకొని తానే వానిని వెదకుటకు ప్రయత్నపడి మద్రాసు మొదలగు ప్రాంతములలో వెదకినదేగాక, తన స్నేహితులను గూడ వెదకునట్లు చెప్పెను. ఇంతేగాక తన కక్షిదారుల తోఁజెప్పి గ్రామాంతరములలోకూడ వెదకునట్లు చేసెను. తుదకు ప్రతి వృత్తాంతపత్త్రిక(న్యూస్ పేపరు) లోను ప్రకటన (నోటీసు) ప్రసిద్ధముచేసెను, ఎట్లనఁగా —

మ-రా-రా-శ్రీ, లక్ష్మీకాంతరావుగారికి తెలియచేయునది యేమనఁగా, ఈక్రింద సంతకము చేసినవారియొద్దకు అవశ్యముగవచ్చి మాట్లాడవలయును, అట్లు మాట్లాడుటవలన మిగుల సంతోషము కలుగును ఇట్లు

శ్రీ - సుబ్రహ్మణ్యంపంతులు,
హైకోర్టువకీలు, తిరుపతి.

ఏ ప్రయత్నము చేసినను లక్ష్మీకాంతరావు జాడదొరకలేదు. దినములుకడచెను, నెలలుకడచెను, ఆసంవత్సరము పోయెను, వాఁడు రానేలేదు.

కొన్నాళ్లలోపల కమలకు మరియొక ఘోరతరమైన విపత్తు సంభవించెను. అనఁగా సుబ్రహ్మణ్యంపంతులకు లోకాంతరప్రాప్తి సంప్రాప్తంచుటయే ఇందువలన కమల అత్యంత శోకాక్రాంతురాలై రెండవతూరి పితృవిహీనయైనట్లు తలంచుకొనెను. సుబ్రహ్మణ్యంపంతుల శ్రాద్ధాదులైన యనంతరము తన ప్రితార్జితమైన యింటికిబోయి అచ్చట వాసముచేయుచు తన ఆస్తియొక్క విచారణ మొదలగునవి తానేచూచుకొనుటకారంభించినది సుబ్రహ్మణ్యంపంతులవి చక్షణవలన దానిఆస్తిఅతిశయమై అభివృద్ధి యగుచుండెను.

కమల ఆస్తినంతయు వశముచేసికొని అప్పుడే రెండు

లక్షల రూపాయలను గౌర్నమెంటు వారికిచ్చి, యీద్రవ్యముతో గోవిందరాజపురమునందొక అనాథ నివాసమందిరమును స్థాపనముచేసి అన్నదానము చేయవలయుననియు న్ను, ఆసత్రమునకు "లక్ష్మీకాంతరావు ప్రాసాదము" అని పేరు పెట్టవలయుననియును విన్నవించుకొనెను.

సర్కారువారు ఈమె దాతృత్వమునకు ఆశ్చర్యపడిరి. అయితే దానిని గురించి కమలతో చర్చించు వారెవరు? అనాథనివాసమందిరము స్థాపించినదిగానది కమలతల్లి . తన దారిద్ర్యావస్థకాలమున స్వగ్రామమును విడిచి అలమేలుమంగాపురమున గుడిసెవేసికొని యుండెను. ఎందుకనగా. ఒకగ్రామమునందు ధనికులుగనుండుచు ఉన్నట్లుండి దరిద్రులైతే ఆగ్రామమునందు వాసముచేయుట యెవరికైనను కష్టముగ నుండును గదా. అలమేలుమంగాపురము దాని స్వగ్రామమునకు కొంచెము దూరముగానుండెను దాని స్వగ్రామము గోవిందరాజపురము. ఇప్పుడుకమల గోవిందరాజపురమందున్నది. అనాథనివాసమందిరము గోవిందరాజపురమందు కమలయొక్క యింటికెదురుగ స్థాపితమై యుండెను. నానాదేశములనుండి దీనులైన అనాథలువచ్చిఅచ్చట వాసముచేయుచుండిరి.

ఒకటి రెండేండ్లకుమీఁద నొకపెద్దమనిషి ఆ యనాథ నివాసమునకు వచ్చెను. అతనికి ముప్పదియైదు ముప్పదియారేండ్లుండును. అతని వదనశికలను జూచితే ధీరుఁడుగను, గంభీరుఁడుగను, మిక్కిలి ధనవంతుఁడుగను గనంబడెను. అతఁడు "లక్ష్మీకాంతరాయ ప్రాసాదము" అని వ్రాసియున్నకడపదగ్గరకువచ్చి నిలుచుకొని ద్వారరక్షకులను జూచి, ఇది యెవరియిల్లు అనియడిగెను.

రక్షకులు:—ఇది యెవరియిల్లును కాదు ఇచ్చట దీనులైన అనాథలుండు స్థలము ? దీనిని లక్ష్మీకాంతరాయ ప్రాసాద మని చెప్పుదురు.

దర్శకుఁడు:—దీనిలోపలికి పోయి చూడవచ్చునా ?

రక్షకులు:—కేవలము అనాథలగువారే పోయి వాసము చేయఁగా తమరుపోవుటకు ఆతంకముకలదా ?

దర్శకుఁడు:—లోపలికిపోయి చూచుకొని వెలుపలికి వచ్చి, యిచ్చటి యేర్పాటులను చూచితే మిగులసంతోషమగుచున్నది. ఈ అన్న సత్రమును ఉంచిన వారెవరు ?

రక్షకుల:—శ్రీమతి కమలాంబ.

దర్శకుఁడు;—అట్లయితే దీనికి లక్ష్మీకాంతరాయప్రాసాదమని చెప్పుటయెందుకు ?

రక్షకులు:—మాకు ఆసంగతి యేమియుఁ దెలియదు.

దర్శకుఁడు: —లక్ష్మీకాంతరాయఁడనుట యెవరిపేరు?

రక్షకులు: —ఎవరిపేరును కాదు.

దర్శకుఁడు:-మీరుచెప్పెడుకమలాంబయిల్లుఎక్కడనున్నది?

రక్షకుఁడు:—ఎదురుగనుండు పెద్దమేడయిల్లు.

దర్శకుఁడు:—ఆమె సధవనా ? విధవనా ?

రక్షకులు:—ఆమె ఇంకను వివాహమే చేసికొనలేదు, గొప్ప సాహుకారియొక్క కుమార్తె, ఆమెకు ఎవరును లేరు, కన్యాదానము చేయువారుకూడ లేరు.

దర్శకుఁడు:—ఆమె మగవారియెదుట వచ్చుటకలదా? ఇట్లడిగెదనని కోపింపకుఁడు. ఈకాలమునందుఅనేకపెద్దమనుష్యుల యింటి ఆఁడువాండ్రు యూరోపుస్త్రీలవలె మగవాండ్రతోఁ గూడవచ్చి విశ్రాంతి నిమిత్తము తిరుగుటకలదు, కావున అడుగవలసివచ్చినది.

రక్షకులు:—మా శ్రీమతి కమలాంబ అట్టి చెడ్డ నడువడిక కలది కాదు. పురుషుల యెదుటికి గాని బయటికిగాని వచ్చుటలేదు.

ఈ మాటలు విని దర్శకుఁడు అచ్చటనుండి కమలయొక్క ప్రాసాదాభిముఖముగాఁ బోయి ఆయంతఃపురములోఁ బ్రవేశించెను.

## చతుర్థ ప్రకరణము.

ఆదర్శకుఁడగు ఆగంతుకుని (వచ్చినవానిని) వస్త్రములు చెన్నపురి పెద్దమనుష్యుల వస్త్రములవలెనుండెను; మిక్కిలి డంభముగాను నుండలేదు; అతిసామాన్యముగను నుండలేదు; అయితే వాఁడు చేతిలో నొకమేలైన రత్నాలుచెక్కిన ఉంగరమును వేసికొనియుండెను. దానిని జూచి కమల సేవకులు ఒకరితో నొకరు మనము ఎప్పుడును ఇంతటిశ్రేష్ఠమైన యుంగరమును చూచియుండలేదని మాట్లాడుకొనిరి. ఆగంతుకునితోఁగూడ ఎవ్వరునురాలేదు, కనుక నీ పెద్దమనిషి యెవరిని విచారించి తెలిసికొనుటకు సరిపడలేదు. వాఁడు తానుగానే తనపరిచయమును చెప్పునో యేమో యని నిరీక్షించుచుండిరి. అయితే అతఁడు తనపరిచయమునుచెప్పలేదు. వాఁడు కమలయొక్క గుమస్తాయొద్దకుఁబోయి అతనిచేతిలో నొకకాగితము నిచ్చి దీనిని మీ యజమానురాలిచేతికిచ్చి జవాబు తేవలయు ననెను.

గుమస్తా:—మా యజమాని ఆఁడుమనిషి, అవివాహితురాలు, ఇంకను అల్పవయస్కురాలుగ నున్నారు. కాఁబట్టి ఎవ్వరైనను అపరిచితులు వారికి కాగితమును ఇచ్చిన

యెడల నేను మొదట చదివి చూడనిదే ఆమెకు పంపఁ గూడ దని ఆజ్ఞయై యున్నది.

ఆగంతుకుఁడు:—మీరు చదువవచ్చును.

గుమస్తా కాగితమును జదివెను.

"ప్రియభగినీ!

ఈ వ్యక్తి పురుషుఁడైనను ఏకాంతముగా నీతనితోఁ మాటలాడ వచ్చును. భయమేమియును లేదు, జరిగిన సమాచారమును నాకు జెప్పుము."

ఇట్లు,
కృష్ణవేణి.

సుబ్రహ్మణ్యంపంతుల కుమార్తె చేవ్రాలును జూచి యెవరేమియును ఆక్షేపించలేదు; కాగితము అంతఃపురమునకుఁ బోయెను.

అంతఃపురములోనుండి పరిచారిక యొక్కతె కాగితము తెచ్చినవానిని పిలుచుకొని పోవుటకు వచ్చి, పెద్దమనిషిని వెంటబెట్టుకొని పోయెను. మఱెవ్వరును అతనితోఁగూడ పోలేదు; ఉత్తరవు లేదు.

పరిచారిక ఆపెద్దమనిషిని పిలుచుకొనిపోయి అనేకవిధములయిన అపరూపవస్తువులచే అలంకృతమైన యొక మహాలులో గూర్చుండఁబెట్టెను. కమల అంతఃపురమునకు పురుషుఁడు ప్రవేశించినది యిదే మొదటిసారి. ఈతనిని జూచినదే యొకపరిచారిక కమలను పిలుచుటకుపోయినది; ఇంకొక్కతె మఱుఁగున నిలుచుకొని ఆగంతుకుని తెప్ప వేయక చూచుచు నిలుచుండెను.

అతని దేహావర్ణము గౌరవర్ణముగను వికసించిన మల్లికారాశివలెను నుండెను. అతని శరీరము దీర్ఘముగను కొం

ఖము స్థూలముగను నుండెను. కపాలము దీర్ఘముగను అతి సూక్ష్మముగను పరిష్కృతఘన కృష్ణవర్ణముగలిగిన సురంజిత కేశజాలముతో నలంకృత మైనదిగను నుండెను. కన్నులువిశాలమై స్థిర కటాక్షములోఁగూడి యుండెను. భ్రూయుగ్మము సూక్ష్మముగను, సాంద్రముగను, దూరాయితముగను, నిబిడ కృష్ణవర్ణము గలదిగను నుండెను. నాసికము దీర్ఘముగను ఉన్నతముగను నుండెను. అధరము రక్తవర్ణము గలిగి సన్నముగను కోమలముగను నుండెను. కంఠము దీర్ఘమై మాంసలముగ నుండెను. తక్కిన అంగములు వస్త్రముతో నాచ్ఛాదితమై యుండెను. వస్త్రముతోఁ గప్పబడక కనఁబడుచున్న చేతి వ్రేళ్లు శుభ్రముగను సుఘటితముగను నుండిన దేగాక చిటికెన వ్రేలియందు అత్యంతశ్లాఘనీయమై గొప్పదైన యొక రత్నాల యుంగరము శోభించుచుండెను.

కమల, అచ్చటికి వచ్చినిలిచి పరిచారికను బయటికిపొమ్మని చెప్పినది. కమల వచ్చినతోడనే ఆ మహాలునందొక అపూర్వసూర్యోదయ మైనట్లయినది. ఆ రూపరాశి యొక్క కాంతి దాని మస్తకము యొక్క కేశపర్యంతమును ప్రదీప్తమై లేచెనో యనునట్లు ప్రకాశించు చుండెను.

కమల ఆగంతకునకు ప్రథమ సమాగమోచితమైన అభివాదనము చేయఁదగినది. ఎందుకనగా, ఆతఁడు పురుషుఁడును మరియు వయోజ్యేష్ఠుఁడుగను నుండెను. అయితే అప్పుడు వాఁడు ఆ అసదృశమైన సౌందర్యము వలన విముగ్ధుఁడును నిస్తబ్ధుఁడును నై యుండెను. కమల కొంచెము అసంతుష్టురాలై, తాము ఇట్లు గోపనముగ నన్ను జూచుటకిచ్ఛయించుటకు గారణంబేమి? నేనైననే అఁడుది; శ్రీమతి

కృష్ణవేణి యొక్క మాట మీఁద తమ్మును చూచుటకు సమ్మతించితిని అనినది.

ఆగంతుకుఁడు:— నేను నిన్ను ఇట్లు చూచుటకు మాత్రమే యిష్టముగలవాఁడై వచ్చినవాఁడను కాను.

కమల కొంచెము ఖిన్నురాలై అట్లు కాకుండవచ్చును. అయితే కృష్ణవేణి యెందుకు ఇట్లు నేను తమ్మును చూడవలయునని అపేక్షించినదో దానినిగుఱించి అది వ్రాయలేదు, తమకు అది తెలిసి యుండవచ్చునని తోఁచుచున్నది. ఆగంతుకుఁడు, ఒకప్రాత వృత్తాంత పత్రికను దీసి కమలకు చూపించెను. దానిని చదివిచూడఁగా, సుబ్రహ్మణ్యం పంతులు ప్రకటించిన ఇస్తిహారుగానుండెను. కమల అంతనఁకును నిలిచియుండెను. నిలిచియున్నట్లే నారికేళపత్త్రమువలె కంపితురాలైనది, ఆగంతుకునియొక్క దేవతుల్యమైన దేహ ఘటనను జూచి, యితఁడే నాయొక్క లక్ష్మీకాంతరాయఁడని భావించుకొనెను. ఇకఁ దాఁపుటకుగాక తాము లక్ష్మీకాంత రాయల వారా? అది తమ పేరా? అని యడిగినది.

ఆగంతుకుఁడు.—కాదు.

'కాదు' అనుమాటను విని కమల మెల్లఁగ ఆసనగ్రహణము చేసినది. ఇఁక నిలుచుటకు కాలేదు—తొమ్ము చీలిపోయినట్లయినది.

ఆగంతుకుఁడు, కాదు, నేను లక్ష్మీకాంత రాయఁడై యున్నయెడల సుబ్రహ్మణ్యం పంతులు ఈ యిస్తిహారును ప్రకటించియుండఁడు,. ఎందుకనగా, అతనికిని నాకును మిక్కిలి పరిచయముకలదు, అయినను ఇస్తిహారును ప్రకటమైనతోడనే నేనుచూచి తీసి యుంచుకొంటినని చెప్పెను,

కమల:—తమకును ఈయి_స్త్రిహారుకును సంబంధము లేక యుండఁగా దీనిని యెందుకు తీసిదాఁచియుంచుకొనియుంటిరి?

ఆగంతుకుఁడు:— ఒక కౌతుకము నిమిత్తము తీసియుంచుకొనియుంటిని. ఈ యెనిమి దేండ్లుగ అచ్చటచ్చట తిరుగుచుంటిని — అయితే జనులు చెప్పుకొందు రనుభయము వలన నాయొక్క నిజమైన పేరును బయలుపఱచక కాల్పనికమైన 'లక్ష్మీకాంతరాయఁడు' అను పేరును పెట్టుకొంటిని. నీవు ఇంతటి విమనస్కురాలగుటకుఁ గారణ మేమి?

కమల, కొంచెము స్థిరమనస్కురాలై నది.

ఆగంతుకుఁడు:— లక్ష్మీకాంతరాయఁడను పేరుగలవానిని నేను చూచియుండ లేదు; ఒక వేళ నన్నుగుఱించియే ఇ స్త్రిహారు పుట్టియుండునో? అంతటి సంభవ మేమియును లేదు. అయినను ఎవ్వరును నిష్కర్షగా చెప్పుటకు సాధ్యముకాదు. పుట్టియుండవచ్చునో యేమో, ఉండని, చూతమని ఇ స్త్రిహారును తీసియుంచుకొంటిని. అయితే సుబ్రహ్మణ్యం పంతులజూచుటకు నాకు అనుకూల పడ లేదు.

" ... ..

సుబ్రహ్మణ్యం పంతుల శ్రాద్ధమునకు రావలయునని వాని పుత్త్రులు నాకు జాబు వ్రాసియుండిరి, అయితే వేఱే పనులున్నందున నేను వచ్చుటకు కాకపోయెను. ఈ నా లోపమునకు క్షమాప్రార్థన చేసికొని పోవుదమని అతని పుత్త్రులయొద్దకు వచ్చితిని; వచ్చునప్పుడు, ఏమో కౌతుక విశిష్టుఁడై ఇ స్త్రిహారును చేతపట్టుకొని వచ్చినాను. ఏదో మాట్లాడుచుండఁగా ప్రస్తావముమీఁద ఈ యి స్త్రిహారును ఎందుకు సుబ్రహ్మణ్యంపంతులు ప్రకటించినాడని ఆతని పెద్ద కుమారుని అడిగితిని ఆతఁడు కమల కొఱకు ప్రకటించిన

దనెను. నేను కమల యనుదానిని చూచి[illegible]
ను. అది పసిది; నేను ఒకదినమే [illegible]
దానిని మఱచిపోను, అది తన తల్లి పథ్యమునకై తాను
ఉపవాసమై యుండి వనపుష్పహారమును తీసికొని ఆ చీఁకటి
రాత్రిలో వానయం[illegible] — ఆగంతునకు ముందుమాటరాక
వానికన్నులయందు నీరు స్రవించినది. కమల కన్నులయం
దును నీరుస్రవింప నారంభించెను. కమలకన్నీళ్లు తుడుచు
కొని. ఆ దరిద్రపుపిల్ల సమాచారమును కట్టుకొని యేమిప్ర
యోజనము? తమ విచారమును చెప్పికానిండు అనినది.

ఆగంతుకుఁడు — అయ్యో! దానిని తిట్టగూడదు; ఈ
ప్రపంచమునందు కమలముఖి యెవ తెయైన నుంటే అదియే
కమల; ఎవతెయైనను పవిత్రమైన సరళహృదయురాలుగ
నుండెనేని అదియే కమల, అమృతమయమైన మాటలాడు
నదిగనుంటే యదియే కమల; అదియదార్థముగ సద్గుణశీల.
అది మాటలాడు ప్రతి యక్షరమునందును వీణాధ్వని వినఁ
బడుచుండును; మితభాషిణి, మరియు మాటలన్నియును
పరిష్కృతముగను సుమధురముగను నుండుటయే గాక
అత్యంత సరళమైనది. నే నెన్నడును అట్టి కంఠస్వరమును
గాని మాటలనుగాని వినలేదనను. ప్రకృతమునవీనికి లక్ష్మీ
కాంతరాయఁడనియే పేరుండనిమ్ము; అనిచెప్పి, పైన వివ
రించిన రీతిగావర్ణనచేయుచున్నట్లే మనస్సులో, నేటిదినము
అట్టి కంఠస్వరమును వినునట్లున్నది, ఆ కంఠసస్వరమునువిని
యున్నిదినములైనప్పటికిని దానిని నిన్ననే విన్నట్లున్నది; ఈ
ప్రౌఢ ఈ కమలయొక్క కంఠస్వరమునువిని ఆకమలయే
జ్ఞాపకమునకు వచ్చుట యెందుకు? ఇదే కమలగా నుండు
నేమో? నేను శుద్ధఉన్మత్తుఁడను! దీనదుఃఖినియై కటీరవా

సినియైన ఆ భిక్షుకి యెక్కడ? ఈ ఉచ్చప్రాసాద విహారిణి యైనయింద్రాణి యెక్కడ? ఒకటికొకటి సంబంధమెక్కడ? నేను కమలను అందకారమునందు చక్కగా చూచుటకు కాలేదు కనుక అది సురూపియో కురూపియో సరిగా బోధ కాలేదు. అయితే శచీదేవినే నిరాకరించుచుండు ఈ సుం దరియైన స్త్రీయొక్క శతాంశమునందు ఒక అంశమైనను దానికి యుండినయెడల అది లోకమోహినియే యగును; దానికేమియు సందేహములేదని భావించుకొనెను.

ఇట్లుండఁగా, కమల అత్యుత్తమమైన శ్రవణేంద్రియము గలదియై లక్ష్మీకాంతరాయని మధురమైన వాక్యములను చెవియిచ్చివినుచుండి, నీవు, ఈ పాపిష్ఠియైన కమలనుగుఱిం చిచెప్పునది యంతయు నీమనస్సు మాత్రము తగినదిగాను న్నది; నీవు యెనిమిదేండ్లకు తర్వాత కమలను మరలను మోసగించిపోవుటకు నందననమునువిడిచిభూమికిదిగివచ్చి తివా యేమి? నా మానసికమైన పూజనీకుచేరుటకు ఇన్నా ళ్లు విలంబమైనదా యేమి? నీవు అంతర్యామివా యేమి? అట్లు కాకున్న యెడల మనస్సునందే చేయుచుండిన నా పూజ నీకు యెట్లుతెలియును? అని యీలాగు భావించు కొనెను. వీరిద్దరును వెలుతురులో పరస్పరము చక్కఁగా చూచినది యిదే మొదలు. ఇద్దరును పరస్పరమును ముఖ మును జూచుచు తమలోఁదాము తమకెదురుగనుండు వ్య క్తినిగుఱించి, ఇఁక నిట్టిది కలదా? ఈ ససాగరమైన నదు లనుండి చిత్రితమైన జీవసంకులమగు భూమియందు తేజో మయమైనట్టియు, మధురమైనట్టియు, సుఖమయమైనట్టి యు, చంచలమయ్యును స్థిరమైనట్టియు, ప్రఫుల్లమైనప్పు టికిని వ్రీడా మయమైనట్టియు వస్తువు ఇంకొక్కటి కలదా?

పరిచితమైనను అత్యంత అభినవమైనదియు, ప్రతి ముహూర్తమునందును అభినవ మధురమైనదియు, ఆత్మీయమైనను అత్యంత పరమైనదియు, చిరస్మృతమైనను అదృష్టపూర్వమైనట్టిదియు నగు ఇంతటి పదార్థమును నే నెప్పుడును చూడలేదు. ఇంకెన్నటికిని చూడనేరను. ఇఁకనిట్టిది కలదా? అని యీలాగు భావించుకొనిరి.

కమల, 'మనసులో నాకెంతకు కన్నీరు స్రవించుట నిలువలేదు. ఇప్పుడు ఎక్కడనుండియో పాడునవ్వు ఒకప్రక్క వచ్చుచున్నది'. మిగుల కష్టముతో—తాము ఇంతవఱకు కేవలము ఆబిచ్చపుదాని మాటలే చెప్పుచుంటిరి; తాము ఇక్కడికివచ్చి దర్శనమిచ్చుటకు కారణ మేమో దానిని గుఱించి యేమియుఁ జెప్పకపోతిరి? అనినది.

పాఠకులారా! మీరుచెప్పండి, ఈ పిచ్చిపిల్ల యెంత మాట అడిగినది! ఇల్లడుగులు కలదా? [illegible] నముచేసికొని ఆనందాశ్రువులుపొంగివచ్చి స్రవించుచుండు నప్పుడు ప్రాణేశ్వరా! దుఃఖినియొక్క సర్వస్వుఁడా! చిరవాంఛితుఁడా! అను నిట్టి సంబోధనము చేయుటకు నోటనుండి మాటలు తనంతటనే బయలుదేరబోవు చున్నవో; అట్టివానినిఁ జూచి, నీవు వచ్చియుండు సంగతినిచెప్పుమని పరిహాసము చేసినది కదా! ఇట్లుకలుదా, మీరే చెప్పబడిన [illegible]ము, కన్యకయైన కమల యీసందర్భమునందు ఏలాగుమ[illegible] డవలసి యుండెను? చెప్పుడు, చూతము.

కమ[illegible] నస్సు పరితపించెను. ఎందుకనఁగా, తాను అడిగినప్రశ్నన[illegible]క్షేపణము చేసినట్లయినదని పరితాపపడినది.

లక్ష్మీకాంతరాయుఁడు కొంచెము అప్రతిభుఁడై 'ఇదే చెప్పుచున్నాను; నేను ఆకమల నెఱిఁగిన వాఁడను, కనుక

జ్ఞాపకమునకువచ్చినది. అంధకారమయమైన రాత్రియందు చంద్రునిజూచినట్లు ఈకమలయే ఆయొక్క కమలగానుండునేమోయని కొంచెము ఆశపుట్టిన" దనెను.

అంతలో కమల, "కమలా! కమలా!!" అని పునరుక్తిగాఁజెప్పి హాస్యముచేసి నవ్వినది. ఏమి! నవ్వక యేమి చేయవలయును?

మీరు మన కమలను నిందించవద్దు; తిట్టుట మీ కందఱికిని సామాన్యమైనది, అది మీకు స్వభావము, అట్లయితే మీరు మన కమలను తిట్టుచునే యుండఁబోకుఁడమ్మా.

లక్ష్మీకాంతరాయఁడు తనమనసునందు "నీవే అదికాదా, నాదానవుకావా" అని యెంచుకొని, ప్రకాశముగా, ఔను కమలా! నేను దానిని ఒకనాటి రాత్రి మాత్రమే చూచి— చూచితినని యెట్లు చెప్పుదును. ఈ యేనిమిదేండ్లుగా మరువలేదు. నా కమలయే యగును." అనిచెప్పెను.

కమల— కానిండు, తమకమలయే యగును; అనెను.

లక్ష్మీకాంతరాయఁడు, మఱలఁ జెప్పఁదొడంగెను. ఆ యాశను ఉంచుకొని సుబ్రహ్మణ్యంపంతుల పెద్దకుమారుని జూచి, కమలయనునది యెవరని విచారించితిని. అతఁడు అన్ని సంగతులును సవిస్తరముగాఁ జెప్పుటకు ఇష్టములేని వానివలె సామాన్యముగా మాకుసంబంధపడినవారి కుమార్తె యని చెప్పెను. అతనికి పూర్తిగాఁ జెప్పుటకు ఇష్టము లేదని తెలిసి, ఆతనికి విశేషముగ తొందరయీయక కమల లక్ష్మీకాంత రాయని గుఱించి విచారించుటకుఁ గారణమేమని మాత్రము అడిగి, అట్లు అవశ్యక మున్న యెడల ఆతనిఁగూర్చి నేను కొన్నిసంగతులు చెప్పఁగలను అని చెప్పితిని.

అతఁడు, ఈ మాటవిని అదియెందుకు లక్ష్మీకాంతరా యనిగుఱించి వెదకుచున్నదో, ఆ సంగతి నాకు చక్కఁగాఁ దెలియదు; మాచెల్లెలికికూడ చక్కఁగాఁ దెలియదేమో? మీరు ఈవిచారమునుగుఱించిన సమాచారమును చెప్పఁ గలరని మాచెల్లెలికి చెప్పెద ననిచెప్పి, లేచిపోయి కొంత సేపులో వెనుకకుమరలివచ్చి, నాచెల్లెలుకూడ అన్నిసంగతు లను విప్పిచెప్పలేదు. ఈ కాగితము నిచ్చి దీనిని నేనే తీసి కొనిపోయి మీకు తెలియపఱచ వలయునని చెప్పినదని చెప్పి, యీకాగితమును ఇచ్చినాఁడు. నేను ఆ ప్రకార ముగ కాగితమును తెచ్చి నీ కిచ్చితిని. నేనేమి అపరాధము చేసితినో తెలియలేదని చెప్పెను

కమల:— అపరాధమేమో చేసితిరి, దానిని కడపట చెప్పెదను. ఇప్పుడింతమాత్రమే చెప్పఁగలను ఏమనఁగా, తాము ఏమో చాలా భ్రమపడి యిక్కడికి వచ్చియున్నా రు; తమకమల యెవరో అది నాకు తెలియలేదు; ఆ కమల యొక్క వృత్తాంతమంతయు వినఁగా, ఇట్టిదేయనిచెప్పినను చెప్పవచ్చును. అయితే ఖండితముగ చెప్పలేను అనినది.

లక్ష్మీకాంతరాయఁడు— ఆ రథోత్సవమునందు జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగఁ జెప్పితిని. అయితే తాను దానికి నిచ్చిన రూపాయలు మొదలగు సంగతులను చెప్పలేదు.

కమల:— దీనిచేతనే, తాము ఏమో అపరాధమును చేసితిరని తేర్పడెను. దానినే యోచించుచుంటిని; అయితే ప్రత్యక్షముగ చెప్పుట యెట్లు? ఇంతకు దానిని గుఱించి చెప్పుటకు మనస్సురాలేదు. ఎందుకనఁగా, తాము దయా ళువులనితోఁచలేదు, అంతటిదుర్దశలోనుండు ఆబీదబిచ్చపు

పిల్లకు ఏమైనను సహాయము చేసియుందురు. అట్టిసహాయము చేసినసంగతియే చెప్పలేదు. అదేమోనిశ్చయముకదా?

లక్ష్మీకాంతరాయఁడు.—అంతటి విశేషమైన సహాయముచేయుటకు వీలుపడలేదు. నేను ఆ దినము రథోత్సవమును జూచుటకు వచ్చియుంటిని. ఎవరికిని తెలియక యుండవలయునని మామూలు బట్టలు కొందుగక బట్టలు బదలాయించుకొని లక్ష్మీకాంతరాయఁడని మారుపేరు చెప్పుచు వచ్చియుంటిని; మంచిమధ్యాహ్నముమీఁద పెద్దవానవచ్చినందున రైలుస్టేషనుకుపోను సరిపడక యచ్చటనే నిలిచి యారాత్రి అమ్మవారి దర్శనమునకై అలమేలుమంగాపురమునకుఁ బోవుచుంటిని. నా దగ్గరనున్న పైకమును కమలకిచ్చితిని; అది మిక్కిలి కొంచెము, మరుదినము తెల్లవారిన మరలివచ్చి దానివృత్తాంతమంతయు విచారించుకొనవచ్చునని యోచించుకొని యుంటిని, అయితే ఆరాత్రియే మా తండ్రికి దేహము జబ్బుగానున్నదని జాతరకువచ్చిన వారివలన సమాచారము తెలిసినందున అప్పుడే నేను మద్రాసుకు ప్రయాణమై పోతిని, మాతండ్రి చాలాదినములు మంచమెక్కి యున్నందున మద్రాసు విడిచి బయలుదేరి వచ్చుటకు సంవత్సరమునకు మీఁద కడచిపోయినది. ఒక సంవత్సరమునకు తర్వాత వేఱె పనిపడివచ్చినపుడు నేను మరల ఆకుటీరము వద్దకు వచ్చి చూచితిని. అచ్చట అది కనఁబడలేదు.

కమల — చూడఁగా ఆ కమలమీఁద తమకు ప్రీతి విశ్వాసము చాలాయున్నట్లు తోఁచుచున్నది. అందులకు కారణమేమో వినుటకు ఆసగానున్నది. స్త్రీలకు ఇట్టిదానినంతయును అడిగి తెలిసికొనుటకు మిక్కిలి యాశ, అట్టి

యాశకువశురాలనై ఒకఅంశమునుఅడుగుచున్నాను, కోపింపఁగూడదు. ఆ జాతరనాఁడు వాన వచ్చినదికదా, నిలుచుటకు స్థలములేక ఆ గుడిసెకుపోయి యుండవచ్చునని తోఁచుచున్నది, ఆ కుటీరమునందు ఎంతసేపు ఉండడ మైనది?

లక్ష్మీకాంతరాయఁడు:— చాలాసేపు నిలచి యుండలేదు. నేను కమలయొక్క చేతియుం దిచ్చినదానిని చూచుకొనుటకు అదిదీపము వెలిగించుటకు పోయినది. ఆసమయమున్న దానికి ఒకజత చీరలను తీయుటకై బయలుదేరిపోతిని.

కమల:—మఱేమైనను ఇచ్చివచ్చితిరా యేమి?

లక్ష్మీకాంతరాయఁడు:— మఱేమి యియ్యఁగలను? ఒక చిన్ననోటు ఉండెను, దానిని ఆ గుడిసెయందే పడవేసి వచ్చితిని.

కమల:— కొంచెము పనియున్నది, ఇదిగో వచ్చితిని, ఒకక్షణము దయచేయుడనిచెప్పి, లేచి లోపలికి పోయెను. అది ఆ నోటును కాపాడి యుంచుకొని యుండెను. దానిని తీసికొనివచ్చి మఱల చెప్పనారంభించెను.

తాము ఆ ప్రకారము నోటును విడిచిపెట్టి బయలుదేరి పోయినది, సరియైన వివేచనగా తోఁచలేదు. ఆ కుటీరమునందుండు వారు నోటు చిక్కిన వెనుక ఎవరో పోఁగొట్టుకొనిరని యెంచుకొనరా?

లక్ష్మీకాంతరాయఁడు:—లేదు లేదు, దానికి అవకాశములేదు; పెన్సలుతో ఆ నోటుయొక్క వెనుక ప్రక్క కమల కొఱకు అనివ్రాసి దానిక్రింద లక్ష్మీకాంత రాయఁడని సంతకము చేసియున్నాను. దానిని బట్టియే కమల లక్ష్మీకాంత రాయని అన్వేషణము చేసియుండ వచ్చునని నమ్మి ఆయిస్త్రీహారును తీసి యుంచుకొంటిని.

కమల:—అందుకే, తాము గొప్పఅపరాధమును చేసి తిరని ముందుచెప్పితిని. తమ చరణదర్శనమునకై అది అంతట్టి ఆతురముతో నుండియు తాము ఇన్ని ఏండ్లయినప్పటికిని దర్శనమియ్యలేదు. కమల లక్ష్మీకాంతరాయని వెదకుచుండినదా లేదా దీనిని చూడుడు.

అనిచెప్పి కమల ఆ నోటును వాని చేతికిచ్చి సాష్టాంగ ప్రణామము చేసి, మహాప్రభూ! తాము ఆ దినము నాకు ప్రాణదానము చేయవలసినదైనది. ఈ భూమియందు తామే నాకు దేవుఁడని వినయముతో విన్నవించెను

పంచమ ప్రకరణము.

కమల చేతులు జోడించుకొని తాము లక్ష్మీకాంతరాయఁడనుట తమ నిజమైన పేరుకాదని సెలవిచ్చితిరి. నేను ఏ పురుషుని నా యొక్క ఆరాధనీయమైన దేవుఁడని ఎంచుకొని యుంటినో ఆ పురుషుని పేరును తెలిసికొనుటకు అత్యాతురురాలై యున్నానని నది.

లక్ష్మీకాంతరాయఁడు:— నా పేరు నారాయణరావు.

కమల:— జమీన్‌దార్ నారాయణ రాయలవారు అను పేరును నేను వినియున్నాను.

లక్ష్మీకాంతరాయఁడు:—ఈకాలమునందు ఇట్లే అనేకులను జమీన్‌దారులని చెప్పుచున్నారు, నన్ను నారాయణ రాయఁడని చెప్పినచో నాకు చాలా మర్యాద చేసినట్లగును.

కమల:— ఇప్పుడు నాకు ధైర్యము హెచ్చైనది, తాము నా యొక్క స్వజాతి వారుగ నుండుటచేత తమకు

ఈ దినము ఆతిథ్యము నియ్యవలయునని ఇష్టము గలదా నన్నై యున్నాను. దయచేసి ఆతిథ్యమును అంగీకరింపవల యునని కోరుచున్నాను.

నారాయణరాయఁడు.—నేను నీ ఇంటియందు భోజనమును చేయకపోవుట లేదని చెప్పెను.

కమలయొక్క ఆజ్ఞా ప్రకారము దాని గుమస్తా వచ్చి నారాయణ రావును పిలుచుకొనిపోయి యథారీతిగా ఆద రింపఁజేను నారాయణరావు భోజనమునకు వచ్చి కూర్చుం డగానే కమల తానేవచ్చి వడ్డించెను భోజనమైన మీఁద కమల చాలా కాలము నుండి, ఒక దినము కాకున్న నొక దినమైనను తమ దర్శనమును గైకొని తమ్మును పూజింప వలయు ననెడి యాస గలదై పూజా సామగ్రిని సేకరించు కొని యుంటిని. యీ హారమో అతి సామాన్యమైనది, అయితే నేనిచ్చితినని తమప్రియపత్నిధరించుకొనిన యెడల నేను కృతార్థురాల నగుదునని చెప్పి, ఆ యమూల్యమైనట్టి దియు, గొప్పవజ్రములచే నిర్మితమైనట్టిదియునగు నక్షత్ర జాలమో యనునట్లు ప్రభావిశిష్టమైన యొక హారమును చేతఁబట్టుకొని గనఁబఱిచినది

నారాయణరాయఁడు —నా ప్రియపత్ని యెవరు? నా భార్యపోయి యిప్పటికి పదియేండ్లు అయినది మఱల నేను వివాహము చేసికొన లేదనెను.

కమలకు తలతిఱిగినట్లయినది మిగుల కష్టముతో మన స్సును స్థిరపఱుచుకొని—మనస్సు స్థిరమైనదో లేదో గోచ రించలేదు—కమల తమనిమిత్తము చేసియుంచినది తామే అనుగ్రహముంచి గ్రహింపవలయును. ఆజ్ఞయైతే తమకు ఈహారమును నేనే అలంకరింతు ననినది. ఇట్లుచెప్పికమలన

వ్వుచునవ్వుచుఆనక్షత్రమాలాతుల్యమైనహారమునునారాయణరావున కలంకరింపఁజేసెను. నారాయణరా వలంకృతుఁడై హాసన్ముఖుఁడై యీహారమునా దేయైనదని చెప్పెను.

కమల:—తాము దయచేసి అంగీకరించితే

నారాయణరాయఁడు:—అంగీకరించితిని. ఇప్పుడిదినా సొంతపదార్థము ఎవ్వరు నాకు ఇష్టమైనవారో వారికిని య్యవచ్చునుకదా ?

కమల—తాము జమీన్దార్లు, తమ కేది యోగ్యము కాదో అట్టిదానిని ఇతరులకు దానముచేయుట వారిపద్ధతిగనున్నది.

నారాయణరాయఁడు:—ఈహారము నాకుయోగ్యమైనదికాదు. అంతయేల, నేనే ఈహారమునకు యోగ్యుఁడనుకాను. నీవే దీనికి యోగ్యురాలవు, నీకే ఈహారమును దానముచేసెదను.

అని చెప్పి హారమునుతీసి కమలయొక్క కంఠమునందు ధరింపఁజేసెను.

కమల అసంతుష్టురాలు కాలేదు.తలనువంచుకొనిముసిముసి నవ్వులునవ్వుచు ఒక్కొకతూరి మొగమెత్తినారాయణరావు మొగమును చూచుచుండినది. నారాయణరావు తెలిసికొని నేను ఆ హారమును తీసికొనుటలేదు దానినినీకే యిచ్చితిని, నాకు వేఱే హారమును ఇమ్మనిఅడిగెను.

కమల:—ఏహారమును ?

నారాయణ:—నీకంఠమునందు మొదటనున్నహారమును.

కమల:—పరిచారికనుగుఱించిజానకీ!ఇచ్చటికిరమ్మనినది

జానకి, మఱుఁగున నిలుచుండి చూచుచుండినది యిదిగోవచ్చితి ననినది.

కమలః—మంగళ వాద్యములను వాయించు వనిత లెక్కడనున్నారు ?

జానకి.—ఇక్కడనే యున్నారు.

కమల.—అట్లయితే వారిని వాయించుమని చెప్పుము.

ఇట్లు చెప్పి కమల తనకంఠమునందున్న హారమునుతీసి నారాయణరావు కంఠమునందు అలంకరింపఁజేసెను. వారు వీణె పిడీలు సారంగి స్వరబత్తు పియానా మొదలగువాద్యములను వాయించిరి.

ఇది ప్రథమ మంగళసూచకము. పిదప వివాహప్రయత్నములు చేయఁబడెను.

తుదకు యథావిధిగను మహావైభవముగను పెండ్లి కాదా, కాకయుండునా? కృష్ణవేణివచ్చినది దాని సహోదరులందఱునువచ్చిరి జమీన్‌దార్ నారాయణరావుపరివారమంతయు వచ్చెను.

అయితే పెండ్లికథనంతయు వినుటచే మన కేమియు ప్రయోజనము లేదు, మనకు బహుమాన మిచ్చుటయు లేదు, లేలెండు పోదము. ఈ కథను అందఱును దయయుంచి చదువుటయే మనకు గొప్ప బహుమానము.

సమాప్తము.



శ్రీరస్తు.

# * కోమలా *

## మొదటి ప్రకరణము

పానధారి సంసారము దినము గడచుట కష్టము. ఒక్కొక దినము ఉపవాసము. అఱకడుపాకనాటికి. నల్గురుపసిబిడ్డల ను పెట్టుకొని నిర్భాగ్యురాలైన కోమల మిగులకష్టపడుచుండెను. హతభాగ్యుండైన దానిమగఁడు సాయంకాలమునకు కూడ ఇంటికివచ్చి విచారించుటలేదు. భిక్షాన్నముచే ఎన్నిదినములుగడచును? ఒకదినమా రెండుదినములా, నిత్యము ఎట్లు జరుగును? ఈయాలోచనచేతదాని బంగారము వంటి శరీరము నీలవర్ణమైపోయెను. ఆనిర్భాగ్యురాలు బంగారుబొమ్మలవలె నుండు తనబిడ్డలముఖమును జూచును. మఱియు ఆబిడ్డలు ఆఁకలికి నల్లాడి మలమలమాడుటను జూచి తన తలపై చేతులనుంచుకొని విలపించును. దాని కన్నులయందుండి స్రవించు శతధారలచే వక్షము తడిసిపోవును. హతభాగ్యురాలు ఏడ్చుచు నేడ్చుచు దేవుఁడా! నీకు కండ్లులేవా, నీ దాసిని కటాక్షింప రాదా? యని ప్రార్థించును.

---

* కమల విశ్రాంతి సమయములయందు గోవిందరాజపట్టణమున తనయింటికి సమీపమునందున్న మాధవరావు ఇంట జరిగినదానిని వ్రాసియుంచెను.

## రెండవ ప్రకరణము.

కోమలయొక్క పెద్దకుమారునకు పదేండ్లు. వాని పేరు వేంకటప్ప. ఈ వేంకటప్ప బాల్యము నందే తల్లియొక్క దుఃఖమును దెలిసి కొనెను. దానికి దిక్కు లేదని వాఁడెఱింగెను. తన తమ్ములు చెల్లెండ్రు ఆఁకలి కేడ్చిన యెడల వారిని బుజ్జగించి సమాధానముచేయును. తనచేత నేమైన తినుబండ మున్నయెడల దానిని వారికిచ్చును. చిన్నబిడ్డను ఎత్తుకొని యిరుగు పొరుగు వారిండ్లకు పోయి యేదైన నడిగి తీసి వారికిచ్చును. దీనిని చూచి తల్లి కన్నులందుండి నీరు స్రవించును. అది మనస్సునందు బిడ్డా! దేవుఁడు నీకు సుఖము నిచ్చునుగాక యని యాశీర్వాదము చేయును.

---

## మూఁడవ ప్రకరణము.

ఈ దినము మధ్యాహ్నము, ప్రొద్దు తిరిగి పోయెను. కోమల చేతిబిడ్డకుకూడ ఒకసోలెడు పాలైన లేదు. ఆఁకలిచే బడలి నిట్టూర్పు విడుచు చుండెను. వేంకటప్ప తమ్ముఁడును చెల్లెలును ఆఁకలి తాళక సోలిపడి యుండిరి. ఈ దినము తల్లి నిరాశ కలదాయెను. నిరాశ కలదై కన్నీరు కార్చు చుండెను. దాని ప్రక్కన వేంకటప్ప కూర్చుండి యుండెను. వాఁడు తన కోమలమైన చేతితో తల్లియొక్క కన్నీరును తుడుచుచు మిగుల కష్టముతో గద్గదకంఠుఁడై, అమ్మా! ఏల యేడ్చెదవు? అని యడిగెను.

---

## నాల్గవ ప్రకరణము.

ఈసమయమునవాకిట నొకబిచ్చపుదివచ్చి, అమ్మా! పిడికెడుబియ్యం బిచ్చం పెట్టమ్మా, తల్లీ! అనిఎలుగెత్తివేఁడెను.

ఆ కరుణా స్వరము కోమల చెవినిఁ బడెను చింపిరిగుఱ్ఱకొంగును నేలపై పఱచుకొని పరుండియున్న కోమలలేచి కొంగు సరిచేసికొని కూర్చుండెను. కండ్లను తుడుచుకొని, గద్గద కంఠముతో, మిగుల దయాస్వరమున, అమ్మా! ఈ దినము పోయిరా, బియ్యము నిండియున్నది, అనెను.

ఈ మాటచెప్పి ముగించునంతిలో కండ్లలోనుండి బొటబొట నీళ్లు కారెను.

దీనింజూచిన భిక్షుకురాలి హృదయము కరిగిపోయెను. అదిమిగుల దీనస్వరముతో, ఏలనమ్మ ఏడ్చెదవు? అనెను.

కోమల, కష్టముతో ఆత్మసంవరణము చేసికొని, ఏమిలేదమ్మ! అనెను.

భిక్షుకురాలి కేదో సంశయముకల్గి, ఆమెదగ్గరకు వచ్చి, తల్లీ! దాఁచనేల, ఈ దిన మెవ్వరికిని అన్నపానములు జరిగినట్లు తోఁచలేదు, అనెను.

కోమల తలవంచికొనెను. మఱల దాని కన్నులందుండి నీరుకారెను భిక్షుకురాలి ప్రశ్నకు తనంతటనే ఉత్తరము వచ్చినది. అది ఈ దౌర్భాగ్య పరివారము యొక్క దుఃఖము లంతయుఁ దెలిసికొని, 'తనలో భగవంతుఁడు ప్రాణులకెల్ల నెత్తిమీఁదుగా అనాహారమును వ్రాసియుండునా?' అని యెంచుకొనెను.

భిక్షుకురాలు నిట్టూర్పువిడిచినది, అనంతరము కోమ లనుజూచి— అమ్మా! నా అపరాధమును మనస్సు నం దుంచుకొనక యీ బియ్యమును బిడ్డలకు అన్నము వండి పెట్టుము. నేను వైష్ణవురాలను—జాతిలేనిదానను కాను.

ఇట్లనిచెప్పి ఆ భిక్షుకురాలు తెచ్చిన బియ్యమును నేల మీఁద పోసెను కోమల నద్దుతల్లీ! నద్దు, మాకు దేవుఁ డేమిపెట్టియున్నాఁడో—

భిక్షుకురాలు ఆమాటను ముగింపనీయక, లేకపేమమ్మా! నిత్యమును మీ యన్నమునే తినుచున్నాను. ఒక పూట ఇంత బియ్యము నేను విడిచిపోరాదా! అట్లక్కఱ లేకున్న యెడల మఱొకనాటికి ఈ బియ్యమును నాకు మీరియ్య వచ్చును; దీనిని అప్పుగానైనను తీసికొనుడనిచెప్పి అతిత్వ రగా వెడలిపోయెను.

---

## అయిదవ ప్రకరణము.

వేంకటప్ప ఇంత వఱకును ఊరక కూర్చుండి యుండిన-వాఁడు ఇపుడు తాళజాలక పోయెను. తళతళ నీళ్లునిండిన కండ్లుగల వాఁడై, అమ్మా! బిచ్చపుది నాలుగిండ్లు తిరిగి తిరిపె మెత్తి తినుచున్నది. ఈ దినము అట్టిదాని భిక్షాన్న మును మనము తినవచ్చునా? అనిచెప్పి యేడ్చెను.

ఇట్లేడ్చుచు నేడ్చుచు, తండ్రి దగ్గరకు బోయి చూచె దను—అతఁడేమి చెప్పునో వినివచ్చెద నని చెప్పెను.

కోమలయు నేడ్చుచు, నాయనా! అని కుమారుని ముద్దు పెట్టుకొని భగ్నస్వరముతో, నీ వెక్కడికి పోదువు? అతఁడు నీపైని శాంతుఁడుగ నుండునా? అట్లున్న యెడల మనకీ యవస్థ యేల సంప్రాప్తించును? అనెను.

"అదిపో నీయమ్మా! ఒక్కమాఱు పోయి చూచివచ్చెదను"

"మధ్యాహ్న వేళ మించి పోయెను— ఇంతవఱకును ఒక పిడికెడన్నమైన నీకడుపులో పడలేదు, అంతదూరము ఎట్లు పోదువు? ఏదైనను వండెదను— రెండు ముద్దలు తిని పో, నాయనా!"

కోమల తన కోమల హస్తముతో బిడ్డను మై దడవి మిగుల సమాధాన వచనములను జెప్పెను. వేంకటప్పుడా దినంతయు విన లేదు తల్లిని మిగులవీడించి, పట్టుపట్టి తండ్రి యొద్దకు పోయివచ్చెదనని చెప్పి వెడలిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము.

మాధవుఁడు మహోత్కట ఘోరసురాపాయి. తండ్రి సంపద విశేషముగా నుండెను. త్రాగుబోతు తనముచేత సర్వమును పోయెను. తుదకు పరివారమంతయు బైటపడెను. సమీపపు జమీందార్ గోవిందదాస్ కచేరిచావడి ముందు పార్శ్వమున గూర్చుండియుండెను. ఇచ్చట బిడ్డలు ఆఁకలికి తాళలేక సోలిపోవుచుండిరి. సాయంకాలము వఱకును ఇంటికి వచ్చి పెండ్లము బిడ్డలను విచారించ లేదు. పతివ్రతయైన కోమల, నిష్ఠురహృదయుఁడైన భర్త యొక్కవద్ద

తకు ముఖము చిట్లించుకొనక ఆమ్లానవదనయై సహించు
కొని యుండెను. మఱియు దుఃఖముతో నొంటరిగాఁగూ
ర్చుండి యిష్టదైవమును ధ్యానించుచు రేయుంబవళ్లుకన్నీ
రునించుచుండెను. ఇందువలన మనోదుఃఖము కొంతవఱకు
శమనమగుచుండెను. అయినను అనాహారముచే కృశులైన
బిడ్డలయొక్క వాడినమోములం జూడఁజూడ నామెకు
దుఃఖ ముప్పొంగి వచ్చుచుండెను. అప్పు డామెకు దేహభార
మోర్వనంతటి భారముగాఁగన్పడెను.

సుకుమారుండైన వేంకటప్ప నిట్టూర్పువిడుచుచు అతి
ప్రయాసముతో పోయి తండ్రియుండుచోటును జేరెను.
నిర్భాగ్యుఁడైన తండ్రి జమీన్ దార్ గోవిందదాసుతోడ
మితిమీరి త్రాగి మైకము తలకెక్కిపోయి ప్రపంచమంత
యు తలక్రిందై మాయామయమై యుండుటను జూచు
చుండెను. మఱిఁగొందఱును అట్టిస్థితిలోనే చేతులుతట్టుచు
పాటలుపాడుచు రాగను లాలాపనము జేయుచుండిరి.కొం
దఱు తమంతట నృత్యము లాడుచుండిరి. ఈరసస్రోతప్ర
వాహవిలాస మందిరము మఱిఁగొంత సేపటికంతయునాట్య
మందిరముగాఁ బరిణమించెను.

"జమీన్ దార్, అందును ధనము విశేషమున్నది. చేరి
నవారు కుంభఘోణం, తంజావూరు, నాగపట్ణం, మధు
ర, మద్రాస్ మొదలగు ప్రసిద్ధపట్టణములలో నుండి వచ్చి
నవారు. వీరందఱును మద్రాసుకు అపుడపుడువచ్చి సొంత
బంగళాలలోగాని, లేక బాడుగ యిండ్లలోగానిదిగుచు

వచ్చి చేయువారుగ నుండిరి. విశేషముగా చెప్పనలయునా? పాఠకులకే తెలియదా ? ”

ఇట్టి సుఖమయసమయమునందు నీలవేణి,రత్నం, మొద లగు వారకాంతలు తాళమృదంగాదుల వికలమైనధ్వని మ్రోగుచుండ “తక్కువేమిమనకూ గోవిందదాసుఁడొ క్కఁడుండు వఱకూ ” అని పాడుచు నర్తనము లాడుచుం డిరి. అనేకులు గుంపులుగూడి “ ఇట్లుకలదా ? ”యనిము క్కుపై వ్రేలుంచి చూచుచుండిరి. ఇట్టి కాలమునందు వా డినమోముగల వేంకటప్ప ఉన్నట్లుండి యచ్చోటికివచ్చి సభను శాంతిభంగము చేసెను. పుత్త్రినియిట్టి దుర్నయ ము నోర్వక క్రోధతామ్రాక్షుఁడై కర్కశకంఠముతో,ని ర్భాగ్య ! ఇచటికేలవచ్చితివి ? అని పెద్దగొంతెత్తిచెప్పెను.

నిష్ఠురుఁడైన తండ్రియొక్క కఠోరవాక్యబాణము క్షు ధాతురుండైన బాలుని మనస్సున బలముగానాటెను.బా లుఁడు నిట్టూర్పువిడిచి,భయసంకుచిత భావముతో,నాయ నా! ఇంతవఱకును మేమెవ్వరును అన్నము తినలేదు. చేతిబి డ్డకుకూడ ఒకసోలెడుపాలు——

బాలుని నోటిమాట ముగియకుండునంతలోనే,పాపిష్ఠి తండ్రి మఱల కర్కశముతో, దానికై యిచటికి చచ్చుచు వచ్చితివా ? దూరముగాపో ! అని యెలుగెత్తిచెప్పెను.

వేంకటప్ప అతికష్టముతో, నాయనా ! మేము కూడు లేక చావవలసినదేనా ? అనెను.

పాపిష్ఠున కోర్వరానికోపమువచ్చెను. కొందఱు పెద్ద మనుష్యులు నిలిచి చూచుచుండు నపుడు తనసంసారవు గుట్టు బైటపడినది కదా యని తత్తరపాటుతో లేచివచ్చి ఆక్షుత్పిపాసా పీడితుఁడైన బాలుని ఱొమ్ముపై తన్నెను. మాధవుఁడును నేలపైఁ బడెను. మత్తుకదా ?

అమ్మా! యని యఱచి బాలుఁడును నేలపైఁబడెను. నోటియందుండి కొంచెము రక్తమును స్రవించెను.

అంత జమీాందార్ ఉద్యోగస్థులు భయపడి మాధవునియొద్దకుఁబోయి ఏమి! ఏమి!! అనుచు, మద్యపాయి మాధవరావును, లేవనెత్తిరి. మఱల నాపిశాచి ఆరక్తనేత్రుఁడై అనఁగాని నోటికిరాని మాటలతోఁ దిట్టెను. ఆ తిట్లనడుమను వానితల్లినిఁ దిట్టెను. అపు డచటనున్న వారు హా! హా!! హా!!! యనిరి. ఆమెను తిట్టుటను విని యూరకుందురా?

జమీాందార్ ఈ గడబిడలో మైకముదిగి భయాక్రాంతుఁడై తానొక మహోపకారివలె పిల్లవానిని లేపి వాని చేతికి ఒకరూపాయనిచ్చి పంపు మని సేవకు నొకనికిం జెప్పెను.

భూశయ్యాగతుఁడైన బాలునికడ కాసేవకుఁడు వచ్చి లేపెను. వాఁడు దిటవుతప్పియున్నందున లేచుటకుఁగాక చేసన్న చేసెను.

ఇంతలో జమీాందారుఁడు పిల్లవాని దగ్గఱకు వచ్చి చూచి, ఇఁక వీఁడు ఇటనుండిన అనర్థమువచ్చునని యెంచి,

ఆ సేవకునితో — వీనిని మోసికొని పోయి వీనియింటి యందు విడిచి రావలసినదని చెప్పెను.

సేవకుఁ డాబాలు నెత్తికొనిపోయి దీపముంచు వేళకు వానింట విడిచెను.

కోమల కుమారునింజూచి నిట్టూర్పు నిగుడించి కన్నీరు 'కార్చుచు పాపిష్టి మగడిట్లుచేసె కదా యని విలపించెను. ఇంతకుముందు బీదరా లొసంగిన బియ్యమును వండియుం చిన దానియందు పిడికెడన్నముఁతీసి నీళ్లుపోసి పిసికి జావచేసి కుమారునకు త్రాగించెను.

వేంకటప్పు కండ్లు తెఱిచెను. కోమలకు కొంచెము మన శ్శాంతియైనది. పది పదునైదు దినములకు వానికి ఆరో గ్యము కల్గెను.

ఆ దినము మొదలు మాధవుఁడు ఇంటికి వచ్చుటను మానుకొనెను. అంతకుముందు మూడు దినముల కొక మారైన తొంగి చూచుచుండెను. ఇపుడదియు లేదు, ఇఁక రాఁడు కదా?

ఇట్లుండ జమీందారునకును నానాట వ్యయ మధిక మైనది. జమీన్ మహంతువారి పరమై పోయినది.

ఎప్పుడుగాని మద్యపాయికిని, వేశ్యాలోలునకును సక లమైన ముప్పు లుప్పతిల్లుననుట కేమిసంశయము?

ఆహా! దైవగతి విచిత్రమైనదే కదా? జమీందారుని స్థితి ఏలాగైనది?

# కోమలా.

## ఏడవ ప్రకరణము.

"జమీందారుఁడు మద్యపాయిగా నుండినది మాత్రమేగాక వానితోఁగూడ నున్నవారి దుర్బోధనలవలన అప్పుడపుడు క్రొత్త క్రొత్త భోగముల ననుభవించు నిచ్ఛయు కలవాఁడై యుండెను. ఈ కారణముచేత జమీందారుఁడెక్కడికో పోవుసమయమునందు వీనినిరూపుమాపి కొండలసందున పాఱవైచిరి. తుదకు వీనితోడనున్న మాధవ రావు మొదలగు వారిని పోలీసువారు చిత్తూరికి పట్టుకొని పోయిరి; ఆ తర్వాత నెవ్వరును గ్రామ ముఖమును చూచి నట్లు తోఁచలేదు."

ఇట్లుండఁగా నొకనాఁడు వేంకటప్ప మహాంతువారిమఠమునకుం బోయెను. అపుడు వీని శుభలక్షణములనుజూచి, మహాంతు చేరంబిలిచి, నాకు చేతికేమైన నందిచ్చుట కొక పిల్లవాఁడు కావలయును. నీవుఉండగలవాయనెను.

వేంకటప్పకు ఈమాట చెవినింబడఁగానే వాడు మిగుల సంతోషమొంది, స్వామీ! నేనుండఁగలను, మాతల్లితోఁ జెప్పి వచ్చెదనని సెలవు పొంది తల్లికీసమాచారమును జెప్పెను.

కోమల తన కుమారునిం గౌఁగిలించికొని, నాయనా! నీవు పసివాఁడవు, పెద్దలు చెప్పినట్లు నడుచుకొనఁగలవా? అయినను మనకష్టమునకు దేవుఁడు ఈ రూపముగా దారి చూపియున్నాఁడు. బుద్ధికలిగి నడుచుకొనుమనెను.





వేంకటప్ప ఆదినము మొదలు మహాంతువారి మఠమున గోలు వమరెను. వీనికి వయస్సు పదేండ్లు. మహాంతువారు తమపాఠశాల ఉపాధ్యాయునిం బిలిచి వేంకటప్పకు ఉదయమును సాయంకాలమును రెండు ఘంటలసేపు చదువు చెప్పునట్లు త్తరవు చేసిరి. మఱునాఁడు మొదలు చదువుచుండెను. చదువు సమయము తప్ప తక్కిన సమయములందు మహాంతు సమీపమున నుండుచుండెను. వీని జీతముచేత కుటుంబ మొకతీరుగా గడచుచుండెను. వేంకటప్పకు మఠముననే భోజనము పెట్టుచుండిరి. మొదట జీతము నెలకై దురూపాయలు.



## ఎనిమిదవ ప్రకరణము.

మన వేంకటప్ప మిగుల బుద్ధిశాలి యైనందుచేత చదువుటయందును వ్రాయుటయందును శీఘ్రకాలముననే సమర్థుఁడాయెను. మహాంతువారి పనులను జాగ్రత్తగా చూడగల్గెను. అయిదాతేండ్లకు నెలకు జీతము ఇరువది రూపాయలాయెను

ఇపుడు కోమలకు కుటుంబ పోషణకష్టము ఎంతమాత్రము లేదు. వీరి కొకపూటకు అన్న మొసంగిన భిక్షుకురాలు కూడనే సుఖముగ కాలము గడపు చుండెను.

## కో మ లా.

ఇఁక వేంకటప్పకు వివాహ మగుట కేమి యాతంకము? అదియు స్థిరమైనది. వీనిసోదరికిని వివాహము సంఘటిల్ల చెను. తమ్ములు చదువుచుండిరి.

ఇట్లు వేంకటప్ప దినదినమును తన గుణ విశేషముచే నభివృద్ధి నొందుచుండెను. ఇపుడు మానేజరు పనిదైయొనది. మహాత్తు మతమునకు వీఁడు పోయినదిమొదలు వీనిపేరును వృద్ధినొందు చుండెను. ఎట్లన, మొదట వీనిని ఓరి వేంకా యని పిలుచుచుండిరి, తర్వాత వేంకటిగాయని పిల్చిరి, ఆ మీఁద వేంకటప్పయనిరి, పదపడి వేంకటేశం అని పిలిచిరి. ఆవల వేంకటేశయ్యయని పిలువం దొడంగిరి, అనంతరము వేంకటేశయ్యగారనుచుండిరి. తదనంతరము వేంకటేశరావు అనిరి. తదుపరి వేంకటేశరావుగారనిరి. ఇప్పుడన్న వేంకటేశ రావు పంతులుగా ననుచున్నారు.

పాఠకులారా! చూచితిరా, మన వేంకటప్పకు గుణ మెచ్చిన కొలఁది వానికి సంపదయును, అట్లే వాని నామ మును వృద్ధినొందెను....కీర్తియు నిట్లే వృద్ధినొందు నని వేఱుగఁ జెప్పవలయునా?

ఇఁక కోమలకు కొఱఁత యేమున్నది?

# కోమలా.

మాధవరావును గూర్చి మనము విచారించ లేదు. మన [illegible]ము లేదు; అయినను మగఁడెంతటి దుష్టుఁడైనను కోమల మాత్రము వాని ముఖదర్శన మొకనాఁటికైన తన జీవితకాలములోఁ గలుగవలయునని తలంచి భగవంతునిఁ బ్రార్థించు చుండెను. అట్లు జరిగెనో లేదో యది మనకు తెలియదు.




ఆష్టిన్ కో డైమెకోడు ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడియెను.

# ప్రకటన.

ఇందలి కనుపరచియుండు గ్రంధములు యావత్తున్ను యింకా యితర సంస్కృత ఆంధ్రగ్రంధములున్ను మావద్దముద్రించి ధరలు సరసముగా విక్రయించబడును, టోకుగాతీయువారికి సరసముగా అంపబడును, రిప్లై కార్డు వ్రాస్తే బదులు వ్రాయబడును.

| | | | |
|---|---|---|---|
| పెద్దబాలశిక్ష | 0-4-0 | హరిశ్చంద్రనాటకం | 0-2-0 |
| సుమతిశతకం | 0-0-6 | ప్రహ్లాదనాటకం | 0 2-0 |
| బాలరామాయణం | 0-0-6 | కామమ్మకథ | 0-2-0 |
| నృసింహ్మశతకం | 0-1-0 | మదనకామరాజుకథ | 0-4-0 |
| గజేంద్రమోక్షం | 0-1 0 | శుకసప్తతికథలు | 0 3-0 |
| రుక్మిణీకల్యాణం | 0-1 0 | బొబ్బిలిరాజుకథ | 0-4-0 |
| కాళహస్తిశతకం | 0-1-0 | బాలనాగమ్మకథ | 0-4-0 |
| దాశరథీశతకం | 0-1-0 | శశిరేఖాపరిణయం | 0-3-0 |
| నారాయణశతకం | 0-0-6 | గంగావివాహం | 0-2-[illegible] |
| కృష్ణశతకం | 0-0-6 | కాలజ్ఞానం | 0-3-0 |
| శ్రీభగవన్నామసంకీర్తనం | 0-1-0 | దేశింగురాజుకథ | 0-3-0 |
| శ్రీఆత్మబోధామృతతత్వం | 0-1-0 | గరుడపురాణం | 0-5-0 |
| పెద్దదాసుచరిత్రం | 0-1-0 | గులేబకావళికథలు | 0 5-0 |
| మహార్ణవమిపద్యములు | 0-1-0 | కుశలాయకం | 0-3-0 |
| సీతాకల్యాణం | 0 1-6 | యడ్లరామదాసుచరిత్రము | 0-4-0 |
| శ్రీశారదరామాయణం | 0-2-0 | బ్రహ్మజ్ఞానసుధాలహరి | 0-8-0 |
| వరహావతారం | 0-2-0 | భాగవతం దశసరి కలికో, | 3-8-0 |
| రామదాసుచరిత్రం | 0-2-0 | మహాపతివ్రతా మాహాత్మ్యం | |
| శ్రీకృష్ణవిలాసం | 0 4-0 | బను శ్రీభక్తవిజయము | |
| మోక్షకారణపద్య | 0-2-0 | 20 కథలు | 0-8-0 |

ఇట్లు,

వెస్టువార్డు అండు కో.,

రాయపురం మద్రాస్

గానీ విల్హెల్మ్ మీడ్లింగ్ మాత్రం ఆ కుటుంబాన్ని విడవలేదు. మార్గరెట్ పై అతనికి గాఢమైన ప్రేమ ఉందనటానికి అదే నిదర్శనం. ప్రతిసాయంత్రం అతడు తోటకంచెమీద కూర్చుని మార్గరెట్ కోసం ఎదురు చూసేవాడు. మార్గరెట్ ఇంటిపనులు త్వరత్వరగా ముగించుకుని వచ్చేది. ఇద్దరూ కలిసి ఊరిబైటికి షికారుగా చేయీచేయీ కలిపి వెళ్ళేవారు. మీడ్లింగ్ కొత్తగా లాయరువృత్తి ప్రారంభించాడు. నెమ్మది నెమ్మదిగా పేరులోకి వస్తున్నాడు. అంతపెద్ద తెలివి తేటలు గల మనిషి అనటానికి వీల్లేదుగాని సుందరమైన ఆకారం, దానికితగ్గ మంచిహృదయం గలవాడవటం చేత, అతనిపని బాగానే ఉంది.

మమ్మల్ని చూసి 'మార్గరెట్ పాఠం ఎంత వరకూ వచ్చిం'దని అడిగాడు. 'అయిపోవచ్చిం' దని సమాధానము ఇచ్చాము, మాకు తెలియకపోయినప్పటికీ. మాకు తెలుసు ఆ జవాబుతో మీడ్లింగ్ సంతోషపడతాడని. మా మాట వినగానే అతని ముఖం చేటంత అయింది.

నాలుగో రోజున ఎప్పుడూ ఇల్లు కదలని జోసెఫ్ తమ్ముడు ఊళ్ళోకి వచ్చాడు. ఎవరో అతని చెవిలో ఊదివుంటారు ఫాదర్ పీటర్ కు ధనం దొరికినట్టు. ముందు మమ్మల్ని వెదికి పట్టుకున్నాడు.

చాటుకు పిలిచి అంతా భోగట్టా చేశాడు. మేము చెప్ప గలిగినదంతా చెప్పాము. అతనంటే మాకు చచ్చే భయం. అందుచేత వీలైనంతవరకూ అంతా వివరంగా చెప్పాము. జ్యోతిష్కుడు కాసేపు కళ్లు మూసుకుని ఆలోచన చేశాడు. చివరికి కళ్లు తెరిచి అడిగాడు :

"ఎన్ని డకట్లు ఉన్నాయి ఆ సంచిలో ?"

"పదకొండువందల ఏడు డకట్లు ఉన్నాయండి."

జ్యోతిష్కుడు తనలో తను గొణుక్కుంటున్నట్టు అన్నాడు: "చిత్రంగా ఉందే! అవును, చాలా చిత్రంగా వుంది. ఎలా జరిగి ఉంటుంది?"

తరవాత మళ్ళీ మొదట్నుంచీ చెప్పమన్నాడు. జరిగినదంతా మళ్ళీ ఏకరువు పెట్టాము. అంతా విని "కాస్తాకూస్తా కాదు. పదకొండువందల ఆరు డకట్లు!" అన్నాడు.

"ఆరు కాదు, ఏడు" అన్నాడు సెప్పీ.

"ఏడా? ఆరు కాదూ? ఇందాక ఆరే అన్నావుగా ?"

'ఇందాక ఆరు అనలేదు, ఏడే అన్నాము' అంటే జ్యోతిష్కుడు 'అయితే నేను అబద్ధమాడానంటారా?' అని విరుచుకుపడతాడు. అతనితో జగడం పెట్టుకోవటం క్షేమం కాదు [redacted] నికోలాస్ వినయంగా,

"కాదు సార్! ఇందాక ఆరు అనబోయి ఏడు అన్నాము. మాదే పొరబాటు. నిజానికి పదకొండు వందల ఏడు డకట్లు దొరికాయి," అని అన్నాడు.

"ఫరవాలేదులే అబ్బాయ్! ఒకటి ఎక్కువైనా తక్కువైనా ఇబ్బంది లేదులే. పైగా ఇన్నిరోజులైన తరవాత మీాకు మాత్రం జ్ఞాపకం ఉంటుందా సరిగా ఎన్ని డకట్లు దొరికాయో?"

"కాదు సార్! మాకు బాగా జ్ఞాపకం ఉంది. జ్ఞాపకం ఉండటానికి కారణంకూడా వుంది," అన్నాడు సెప్పీ.

"ఏమి టది?"

"మొదట ఫాదర్ పీటర్, తరవాత థియొడోర్, తరవాత నికొలాస్ వరసగా మూడు సార్లు లెక్కపెట్టారు. వాళ్లు లెక్కపెట్టటానికి ముందే నేను తమాషా చేద్దామని ఒక డకట్ తీసి దాచాను. పదకొండు వందల ఆరు డకట్లు లెక్కకు వచ్చాయి. అప్పుడు నేను వాళ్లు చూడకుండా దాచిన డకట్ మళ్లీ కలిపాను. 'మీారు తప్పు లెక్కపెట్టారు. మళ్లీ ఈసారి లెక్కపెట్టండి,' అన్నాను. మళ్లీ లెక్కపెట్టే టప్పటికి పదకొండువందలఏడు డకట్లు లెక్క వచ్చింది. అందుచేత మాకు డబ్బు ఎంత దొరికిందో స్పష్టంగా జ్ఞాపకం వుంది."

"నిజమేనా?" అని జ్యోతిష్కుడు మమ్మల్ని అడిగాడు. అవునని మేము తలకాయ లూగించాము.

"ఇప్పుడు తెలిసిపోయింది దొంగ ఎవరో? అబ్బాయిలూ, అది దొంగసొమ్ము. దొంగ కూడా దొరికాడు," అని జ్యోతిష్కుడు వెళ్లిపోయాడు. దొంగసొమ్ము అనటంలో అతని ఉద్దేశ్య మేమిటో అర్థంకాక కొంతసేపు తికమకపడ్డాము. ఒక గంట గడిచిందో లేదో అంతా అర్థమైంది. జ్యోతిష్కుని డబ్బు ఫాదర్ పీటర్ తస్కరించాడనీ, పోలీసులు ఫాదర్‌ను అరెస్టుచేశారని ఊరుఊరంతా గుప్పుమంది. ఎవరికి తోచినట్టు వారు చెప్పుకోసాగారు. ఫాదర్ పీటర్ అలాంటి మనిషి కాదని చాలమంది అన్నారు. కొందరుమాత్రం, తిండికిలేని పరిస్థితిలో ఎంత మంచి మనిషైనా నైచ్యానికి పాల్పడక మానడని అన్నారు. ఒక విషయం మాత్రం అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు: ఫాదర్ పీటర్‌కు హఠాత్తుగా ధనం దొరికిన వైనం నమ్మటానికి వీల్లేకుండా ఉందని అంతా అన్నారు. జ్యోతిష్కుడికి దొరికితే దొరకచ్చు గాని ఫాదర్ పీటర్‌కు అంత డబ్బు ఆ విధంగా దొరకటం అసంభవమని అన్నారు.

ఫాదర్ పీటర్‌కు దొంగతనం అంటగట్టబడటంతో మా ముగ్గురికీ కూడా తలవంపులైంది. గ్రామస్థులు మమ్మల్ని బహిరంగంగా అవమానించ సాగారు. ఫాదర్ పీటర్‌కు ఆ డబ్బు దోవలో దొరికిందనటానికి మేము ముగ్గురం తప్ప ఇంకెవరూ సాక్షులు లేరు. అందుచేత మేము కూడా ఆయనతో లాలూచీ అయి,

బహుశా లంచం పుచ్చుకుని అబద్ధమాడినట్లు అంతా అనుమానించారు. ఇళ్లదగ్గిర మా తండ్రులు కూడా మమ్మల్ని అనుమానించారు. తమకు మాయనిమచ్చ తెచ్చిపెడుతున్నామని, ఇప్పటికైనా నిజం ఒప్పుకుని వంశగౌరవం తిరిగి నిలబెట్టవలసిందనీ మమ్మల్ని వేధించుకు తిన్నారు. మేము చెప్పింది నిజమేనని ప్రమాణాలు చేసినకొద్దీ వారి కోపం ఎక్కువకాసాగింది. చివరికి మాకు విసుగు పుట్టింది. జరిగినదంతా చెప్పేద్దామనుకున్నాము. సైతాను రావటం, మాయలు మంత్రాలు చెయ్యటంతో సహా యావత్తూ బయట పెట్టేద్దామనుకున్నాం. కాని ఎంత ప్రయత్నించినా ఆ రహస్యం బైటికి వస్తేగా. సైతాను పేరెత్తినప్పుడల్లా మా నోళ్లు తెరిచినవి తెరిచినట్టే ఉండిపోవటం పరిపాటి అయింది. సైతాను వస్తే బాగుండుననీ, ఈ విషమపరిస్థితినుండి బయట పడవెయ్యటానికి అతడొక్కడే సమర్థుడనీ తహతహలాడిపోయాము.

జ్యోతిష్కుడు మాతో మాట్లాడి వెళ్ళిపోయిన గంట సేపట్లో ఫాదర్ పీటర్‌ను చెరసాలలో పడవెయ్యటం, సాలమన్ ఐజాక్స్ దగ్గిర ఆయన దాచుకున్న డబ్బు తిరిగి లాక్కుని సంచీలో కుట్టి సీలు వెయ్యటం, అంతా జరిగిపోయింది. ఆ నాణాలు ఫాదర్ పీటర్ ఇచ్చిన నాణాలేననీ, వాటి మొత్తం పదకొండువందల ఏడు డకట్లనీ, వాటిని లెక్కపెట్టిన

తరవాత మళ్ళీ తను ముట్టుకోలేదనీ, సాలమన్ ఐజాక్స్ చేత అధికారులు ప్రమాణం చేయించారు.

ఫాదర్ పీటర్ తన్ను చర్చి న్యాయస్థానం * వారి చేతనే విచారణ చేయించాలని పిటీషను పెట్టుకున్నాడు. కాని మా రెండో మతగురువు ఫాదర్ అడాల్ఫ ఇందుకు ఒప్పుకోలేదు. మతగురువు ఉద్యోగంనుండి తొలగించబడిన ఫాదర్ పీటర్‌ను చర్చి న్యాయస్థానం చేత విచారణ చేయించటానికి వీల్లేదని ఆయన అన్నాడు. బిషప్ కూడా అమాటే అన్నాడు. అందుచేత ఫాదర్ పీటర్ కేసు సివిల్ కోర్టుకి పోయింది. సివిల్ కోర్టు మరికొన్నాళ్ళదాకా సమావేశంకాదు. విల్హెల్మ్ మీడ్లింగ్ ఫాదర్ పీటర్ తరఫున వకాల్తానామా పుచ్చుకున్నాడు. తన శక్తివంచన లేకుండా వాదిస్తానన్నాడు; కాని గెలవటం బహుకష్టమని చాటున ఒప్పుకున్నాడు.

మళ్ళీ మార్గరెట్‌కు కష్టాలు ప్రాప్తమైనాయి. నవమంత్రపు సిరి ఎలా వచ్చిందో అలాగే పోవటంతో, స్నేహితులు, బంధువులు మళ్ళీ మొహాలు చాటుచేశారు. మార్గరెట్‌ను ఊరడించటానికైనా ఎవరూ రాలేదు. విందుకు రమ్మని ఆహ్వానిస్తూ వచ్చిన ఉత్త

---

* చర్చి ఉద్యోగులు నేరంచేసినప్పుడు సివిల్ కోర్టు వారిని విచారణచెయ్యటానికి వీలుండేదికాదు; చర్చి న్యాయస్థానమే వారిని విచారణచేసేది.

రాన్ని రద్దుచేస్తూ సంతకంలేని మరో ఉత్తరం వచ్చింది. పియానో నేర్చుకోటానికి చేరిన ఇద్దరు ముగ్గురు విద్యార్థినులు మళ్లీ మానేశారు. పాపం మార్గెట్ కుంగిపోయింది. ఫాదర్ పీటర్ జైలులో పడటంతో, ఇంట్లో మగదిక్కు లేకుండా పోయింది. అదృష్టవశాత్తు ఇల్లు మాత్రం పోలేదు. ఫాదర్ పీటర్ సాలమన్ ఐజాక్స్ చెల్లించిన డబ్బు ప్రస్తుతం అధికార్ల వద్ద ఉన్నప్పటికీ ఇంటిపైగల తాకట్టు రద్దయినట్లే పరిగణించబడింది.

ఆ యింట్లో మార్గెట్‌కు తోడుగా ఉర్సులా అనే వృద్ధదాసి కూడా ఉండేది. మార్గెట్‌ను చిన్నప్పటినుంచీ పెంచి పెద్దచేసింది ఆమే. వంటచెయ్యటం, బట్టలు ఉతకటం, మొదలైన ఇంటిపనులన్నీ ఆమే చేస్తూంటుంది. ఫాదర్ పీటర్ కుటుంబానికి కష్టదినాలు ప్రాప్తమైనా ఆమె ఆ కుటుంబాన్ని విడవకుండా అంటిపెట్టుకుని వుంది. 'దిక్కులేనివారికి దేవుడే దిక్కు' అని ఆమె నిత్యమూ అంటూ ఉండేది.

ఫాదర్ పీటర్ జైల్లోపడిన నాలుగోరోజున వృద్ధదాసి ఉర్సులా మా యింటికి వచ్చింది. "బట్టలుంటే ఉతుకుతాను ఇ"మ్మన్నది. మా అమ్మ దయతలచి కొన్ని బట్టలు ఇచ్చింది. అవి పుచ్చుకుని ఉర్సులా అన్నది: "ఈ సంగతి మార్గెట్ గారితో చెప్పకండి. డబ్బుకోసం ఇంకొకళ్ళ ఇంట్లో నేను కష్టపడుతున్నానని తెలిస్తే ఆమె వొప్పుకోదు. పాపం ఆమెకి కడుపు

నీడా తింటానికైనా లేదు. రోజురోజుకీ చిక్కిపో తున్నది."

ఉర్సులా కూడా తిండిలేక బాగా క్షీణించి పోయింది. అసలే వృద్ధాప్యం; దానికితోడు తగిన పోషణ లేక నీరసించింది. మా అమ్మ ఆమెకు అన్నం పెట్టింది. అన్నానికి మొహంవాచినదానిలాగ గబగబ రెండు నిమిషాల్లో అంత అన్నమూ తిన్నది. మార్గరెట్ కి కూడా పట్టుకుపొమ్మని మా అమ్మ చెప్పింది. కాని "మార్గరెట్ దయాధర్మంగా పెట్టిన అన్నం తినదు," అని ఉర్సులా అన్నది. బట్టలమూట వీపున వేసుకుని ఉతకటానికి నదివైపు బయల్దేరింది. కాని ఆ ట్టే దూరం నడవ లేక పోయింది. బట్టలమూట కాదుగదా, ఈగ వాలినా మొయ్యలే నంత నీరసంగా ఉన్నది. ఆమెను చూస్తే జాలి వేసింది. మా అమ్మ ఉర్సులాను వెనక్కి పిలిచి మూట తీసుకుని "బట్టలు నువ్వేం ఉతుకుతావులే. ఇది తీసుకో" మని కొంత డబ్బు చేతిలో పెట్టింది. ఉర్సులా మొదట సందేహించింది మార్గరెట్ కోప్పడుతుందేమోనని. ఫరవాలేదు పుచ్చుకోమన్నాము. "మీరు ఊరికే ఇచ్చారని తెలిస్తే మార్గరెట్ ఎలానూ ఊరుకోదు. అందుకని ఈ డబ్బు దోవలో దొరికిందని చెబుతాను," అన్నది. అయితే అబద్ధమాడినట్టు కాగూడదు కనక ఆ డబ్బు తను చూస్తుండగా రోడ్డుమీద పడవెయ్యి మని నాతో చెప్పింది. అలాగే పడేశాను. అప్పుడు

మా అమ్మదగ్గర సెలవు తీసుకుని ఇంటికి బయల్దేరింది. దోవలో నేను పడేసిన డబ్బు తీసుకుని, నిజంగా దొరికి నట్టే ఆశ్చర్యం, సంతోషం ప్రకటించి తన దారిన తను పోయింది.

ఉద్యోగాలాకు అప్పటి కేదో డబ్బిచ్చి పంపించినా, రోజూ ఎవరిస్తారు? ఎవరివ్వగలరు? మరి మార్గరెట్ కి జీవనం ఎల్లా గడుస్తుంది? అన్న ఆలోచనలు నన్ను బాధించాయి. పోనీ ఆమెకు ధైర్యం చెప్పేందుకైనా అప్పుడప్పుడు వాళ్ళింటికి వెళ్ళివద్దామనుకున్నాను. కాని దా ని కి మా తలిదండ్రులు వొప్పుకోలేదు. ఊళ్లో అందరూ వెలివేసిన ఇంటికి రాకపోకలు సాగించటం మంచిదికాదని నన్ను చివాట్లు పెట్టారు. చేసేది లేక ఊరుకున్నాను.

ఆరోజున ఇ లా గే విచా రిస్తూ ఒంటరిగా నడుస్తూన్నాను. హఠాత్తుగా నాలో ఏదో మార్పు వచ్చింది. ఒక్కసారిగా సంతోషంతో ఉప్పొంగి పోయాను. వెంటనే సైతాను వచ్చినట్లు గ్రహించాను. సైతాను సమ్ముఖంలో ఉన్న వారి కెవరికైనా ఆ విధమైన అనుభూతి కలుగుతుంది. ఇదివరకు ఆ అనుభూతి ఎరిగివుండటంవల్ల వెంటనే తెలిసింది సైతాను దగ్గర్లో ఎక్కడో ఉన్నట్టు. చటుక్కున ఆగి నలు దిక్కులా చూశాను. మరి కొద్దిక్షణాల్లో సైతాను నా ప క్క న సాక్షాత్కరించి నా తో నడవసాగాడు. తక్షణం అతను కిందటిసారి వ చ్చి వెళ్ళినప్పటి

నుంచీ జరిగిన వృత్తాంతమంతా గబగబ ఏకరువు పెట్టాను. మార్గరెట్‌కూ, ఆమె పినతండ్రికీ ఒక్క-సారిగా కష్టాలొచ్చిపడ్డాయని చెప్పాను. అలా మాట్లాడుతూ రోడ్డుమలుపు తిరిగాము. ఉగ్నులా కనిపించింది.



ఒక చెట్టునీడలో కూర్చుని బక్కచిక్కిన పిల్లి నొక దాన్ని ఒళ్లో పెట్టుకుని నిముగుతోంది. ఆమెను సమీపించాము. "ఆ పిల్లి ఎక్కడిది" దని అడిగాను. "ఆ అడివిలోంచి వచ్చింది. పాపం తిండి దొరక లేదో ఏమో నీరసంగా తూలుకుంటూ వచ్చింది. తల్లితండ్రీ కూడా లేరుగావును. దీన్ని తీసుకుపోయి పెంచుదామని చేరదీశాను," అని చెప్పింది ఉర్సులా.

"నువ్వసలే బీదదానివి. నీ పొట్టకే లేనప్పుడు ఇంకో పొట్టను కూడా ఎక్కడ పోషించగలవు? ఈ పిల్లిమీద నీకంత జాలివుంటే ఏ ధనవంతుడికో అప్పగించరాదూ?" అన్నాడు సైతాను.

ఎవరో కొత్తవ్యక్తి తనతో అలా మాట్లాడటం చూసి ఉర్సులాకు కోపం వచ్చింది. "ధనవంతు డెవడికైనా ఇమ్మంటున్నావా? మంచిమంచి బట్టలు కట్టుకుని తక్కుతూ, తారుతూ వచ్చావు; నువ్వు ధనవంతుడివేగా? నువ్వే తీసుకోరాదూ?" అని వెక్కిరించింది. తరవాత కనుబొమ ఎగరేసి అన్నది: "హు. ధనవంతులకివ్వాలిట, ధనవంతులకి. వాళ్లకి కళ్ళు నెత్తినుంటాయి; ఈ పిల్లికూన వాళ్ళదృష్టి కెక్కడ అనుతుంది? దీన్ని పోషించటానికి వాళ్ళకే మవసరం? నాబోటి బీదలే ఇలాంటి నోరులేని జీవాల్ని కనికరించేది. దిక్కులేనివాడికి దేవుడే దిక్కు ఆయనే పోషిస్తాడు దీన్ని."

"దేవుడు పోషిస్తాడని నీ కెల్లా తెలుసు? అన్నాడు సైతాను

ఈ మాటతో ఉర్సులా కింకా కోపం వచ్చింది. "ఎల్లా తెలుసేమిటి, నాకు తెలుసు. దేవుడు గూడ కుండా ప్రపంచంలో ఏమీ జరగదు."

"దేవుడు చూస్తేనేం, చూడకపోతేనేం; జరిగే దెల్లాగూ జరుగుతుందిగా."

వృద్ధురాలి ఆగ్రహానికి పట్ట పగ్గాలు లేవు. కోపంలో మొదట మాట్లాడ లేకపోయింది. చివరికి "ఏయ్, అబ్బాయ్. నీ దారిన నువ్వు పో. లేకపోతే కర్ర తీసుకుని ఒక్కటేస్తాను," అని కసిరింది.

ఉర్సులా అలా అనటంతో నాకు అమితమైన భయం కలిగింది. సైతానుకు కోపం వస్తుందేమో, వస్తే ఉర్సులాను నెత్తిమీద ఒకటి వేసి చంపేస్తాడేమో నని భయపడ్డాను. ఎందుకంటే సైతాను మానవులకి పురుగులకంటే ఎక్కువ విలువ ఇవ్వడు! ఒక జీవి ఉన్నా పోయినా అతని కొకటే. కాని సైతాను ఉర్సులా అన్న మాటలకు చలించలేదు. బహుశా అతనికి అవమానం అనేది లేదనుకుంటాను. మహా రాజును నల్లి కుడితే అవమానమని ఎలా భావించడో అలాగే అతనికి మానవుల ప్రవర్తన అవమాన కారణం కాజాలదు. అతడు నిశ్చలంగా నవ్వుతూ ఉర్సులాకేసి అలాగే చూస్తూ నుంచున్నాడు. ఆ చూపులో ఏమి మహిమ ఉన్నదో అప్పటిదాకా

వణుకుతూ వంగివంగి కూర్చున్న వృద్ధురాలు ఇరవ య్యేళ్ళ యువతిలాగ చురుకుగా లేచి నిలబడింది. అంత చురుగ్గా లేవటం నాకేగాక ఆమెకుకూడా ఆశ్చర్యం కలిగించినట్లుంది. సైతాను సన్నిధిలో సంతోషం, చైతన్యం తప్ప మరొకటి ఉండటానికే వీలులేదు. అతని ప్రభావం పిల్లికూనపైకి కూడా ప్రసరించింది. అది లేచి ఉషారుగా గంతులు వెయ్య సాగింది. ఇది మరింత ఆశ్చర్యకారణ మైంది.

"ఇదేం విడ్డూరం? ఈ పిల్లికూన ఇప్పటిదాకా నడవనేలేక పోయిందిగదా? ఎల్లా ఎగురుతోందో?" అన్నది ఉర్సులా.

"ఈమాదిరి పిల్లిని నువ్విదివర కెప్పుడూ చూడలేదు. ఇది కొత్తరకం పిల్లి," అని నవ్వాడు సైతాను

అసలే సైతానుమీద కోపంగావున్న ఉర్సులా ఈ హేళనకు మరింత మండిపడింది. "ఏ య్, అబ్బాయ్. అసలు నువ్వెవరు? ఇక్కడికొచ్చి అనవసరంగా జోక్యం కలిగించుకోమని ఎవరు చెప్పారు? నేను ఇదివరకు ఏం చూశానో ఏం చూడలేదో నీకేం తెలుసు?"

"నాకు తెలుసుగనకే చెబుతున్నాను. ఈ పిల్లికి నాలికమీద వెంట్రుకలుంటాయి."

"చాల్లే నీ వేళాకోళం."

"వేళాకోళం కాదు. కావలిస్తే పరీక్ష చెయ్."

ఉర్సులా పిల్లిని పట్టుకోబోయింది. కాని పిల్లి చేతికందకుండా దూరంగాపోయింది. ఉర్సులా పిల్లిని పట్టుకోవాలని మహా ప్రయత్నించింది. పిల్లి అందలేదు. చివరికి విసుగుపుట్టి తన ప్రయత్నం విరమించింది.

"ఏదన్నా పేరుపెట్టి పిలు; వస్తుందేమో," అన్నాడు సైతాను.

ఉర్సులా ఏవేవో చాలా పేర్లుపెట్టి పిలిచింది. కాని పిల్లి వినిపించుకోలేదు.

"ఆగ్నెస్ అని పిలు; వస్తుందేమో," అన్నాడు సైతాను.

ఈసారి పిల్లి దగ్గిరికి వచ్చింది. ఉర్సులా దాన్ని పట్టుకొని నోరుతెరచి పరీక్షించింది. "అరె. నిజమే. నాలికమీద వెంట్రుక లున్నాయి. ఇలాంటి పిల్లి నెప్పుడూ చూడలేదు. ఈ పిల్లి నీదా?" అని ఉర్సులా సైతాన్ను అడిగింది.

"కాదు."

"మరి దానిపేరు నీ కెల్లా తెలిసింది?"

"ఈ జాతిపిల్లుల్ని ఆగ్నెస్‌పిల్లు లంటారు. మరే పేరుతో పిలిచినా అవి పలకవు."

"ఎంత చిత్రంగా ఉంది!" అనుకుంది ఉర్సులా. ఇంతలో ఏదో సందేహం కలిగినట్లుంది; పిల్లిని కిందదించి "ఉహు. ఈ పిల్లిని ముట్టుకోగూడదు. వదిలేస్తాను...నాకు భయమని కాదు...ఇట్లాంటి పిల్లుల్ని... ఏమో కొందరు అంటుండగా విన్నాను...కాక

పోయినా ఈపిల్లి ఇప్పుడు నిక్షేపంగా వుంది. దాని బతుకు అది చూసుకోగలదు. దీన్ని నేను సాక నక్కర్లేదు," అన్నది. "మంచిపిల్లే పాపం చూట్టాని క్కూడా నాజూగ్గావుంది. మిస్ మార్గరెట్ ఒంటరిగా ఏమీతోచక బాధపడుతోంది. ఈ పిల్లి వుంటే దీంతో కాలక్షేపం చెయ్యొచ్చు. కాని......"

"ఇంతమంచి పిల్లిని వదిలిపెట్టడం భావ్యంకాదు" అన్నాడు సైతాను.

ఉర్సులా ఉత్సాహంతో "ఏం?" అని అడిగింది.

"ఈజాతి పిల్లుల్ని పెంచితే మంచి అదృష్టం."

"నిజంగా? చెప్పు, అబ్బాయ్, నిజంగానే? ఏమిటా అదృష్టం?"

"ఈ పిల్లులు డబ్బిస్తాయి."

"ఎల్లా ఇస్తాయి?"

"దీన్ని పెంచినవాళ్ళకి ప్రతి ఉదయం జేబులో నాలుగు వెండినాణాలు కనిపిస్తాయి."

ఉర్సులాకు ఒళ్లు మండిపోయింది. కొత్త యువకుడు తన్ను వేళాకోళం చేస్తున్నాడనుకొంది. చూస్తుండగానే ఆమె కోపం రెచ్చిపోయింది. కసితీరా తిడదామనుకుంది. అప్రయత్నంగా గౌనుజేబుల్లో రెండు చేతులూ పెట్టి, నిటారుగా నుంచుని, తిట్లు ప్రారంభించబోయింది. హఠాత్తుగా ఆమె ముఖం మారింది; కోపం మాయమై, ఆశ్చర్యమో, భయమో,

సంతోషమో ప్రవేశించింది. నెమ్మదిగా ఒక జేబు లోంచి చేయి తీసింది. గుప్పిలి విప్పి చూస్తూ నుంచుంది. చేతిలో నాలుగు వెండినాణాలు మెరి శాయి. అవి మాయనాణాలేమో, మాయమైపోతా యేమోనని అలాగే చూస్తూ నుంచుంది. చివరికి భక్తి విశ్వాసా లుట్టిపడే స్వరంతో అన్నది: "నిజం. నిజం. నువ్వన్నది అక్షరాలా నిజం. క్షమించు. తెలియక కారుకూతలు కూశాను. నువ్వు నిజంగా దేవతవి," అంటూనే పరుగునవచ్చి సైతాను చెయ్యి ముద్దుపెట్టు కుంది. ఆస్ట్రియన్ ఆచారంప్రకారం చెయ్యి మళ్ళీ మళ్ళీ ముద్దుపెట్టుకుంది.

డబ్బు చూసి ఉర్సులా సంతోషించినప్పటికీ, ఈ పిల్లి మంత్రపు పిల్లి అనీ, ఇదంతా సైతానుమాయ అనీ, మనస్సులో అనుకునే వుండాలి. ఏ మాయ అయినా స్వీకరించటాని కామె సిద్ధంగానే వుంది. రోజూ రెండుపూటలా తిండికి సరిపోయిన డబ్బు ఇస్తే చాలు. సైతాను మహిమ అయినా ఫరవాలేదు. నిజా నికి ఎంత దైవభీతిగలవారికైనా సైతాను నిజాయితీలో ఉన్నంత నమ్మకం దేవతలమీద కూడా ఉండదు.

ఆగ్నెస్ పిల్లిని చంకబెట్టుకుని ఉర్సులా ఇంటికి బయల్దేరింది. నేనుకూడా ఒక్కసారి మార్గెట్‌ను చూసి వస్తే ఎంత బావుండు ననుకున్నాను. అనుకోవటమే తడవు మరుక్షణంలో మార్గెట్ ఇంట్లో ఉన్నాము. మార్గెట్ కుర్చీలో కూర్చుని వుంది. మెల్లిగా తలఎత్తి

మమ్మల్ని చూసింది. మనిషి అమిత బలహీనంగా వుంది. కాని సైతాను సన్నిధిలో బలహీనత, అనారోగ్యం ఉండటానికే వీల్లేదు. సైతాన్ని చూడగానే ఆమె చురుకుగా లేచి నిలబడింది. సైతాన్ని ఆమెకు పరిచయం చేశాను. అతని పేరు ఫిలిప్ ట్రామ్ అని, నా స్నేహితుడనీ చెప్పాను. ముగ్గురం కూర్చున్నాము. సైతాను రెండుక్షణాల్లో మార్గరెట్ బెరుకుపోగొట్టాడు. చిరపరిచితుడితో మాట్లాడినట్లే ఆమె మాట్లాడసాగింది. తనకు తెలియకుండా, చప్పుడు కాకుండా లోపలికెళ్లా వచ్చారండి. తలుపులు తెరిచే ఉన్నాయనీ, ఆమె పరధ్యానంగా ఉండి మా రాక గమనించలేదనీ సైతాను చెప్పాడు. అది అబద్ధం. నిజానికి ఏ తలుపులూ తెరిచి లేవు. మేము గోడల్లోంచో, ఇంటికప్పులోంచో, భూమి అడుగునుంచో ఎల్లా వచ్చామో నాకే తెలియదు. కాని సైతాను మాటకు తిరుగులేదు. అతడు చెప్పింది ఎంత పచ్చి అబద్ధమైనా అవతలి మనిషి నమ్మితీరాల్సిందే. సైతాను చెప్పింది నిజమేనని మార్గరెట్ నమ్మింది. అతడు కబుర్లు చెబుతున్నంతసేపూ అతనివంకే చూస్తూ కూర్చుంది. లోకోత్తరమైన అతని సౌందర్యానికి ఎవరు ముగ్ధులు కారు? ఆమె అతనికేసే దీక్షగా చూడటం నాకు కూడా ఒకవిధమైన గర్వం కలిగించింది.

సైతాను అబద్ధాలమీద అబద్ధాలు చెప్పుకుపోతున్నాడు. తనకి తల్లీ, తండ్రీ లేరనీ, చిన్నప్పుడే చనిపోయారనీ చెప్పాడు. మార్గరెట్ కి చనిపోయిన తన

తలిదండ్రులు జ్ఞాపకం వచ్చారేమో కళ్ళనీళ్లు పెట్టుకుంది. తనకొక పినతండ్రి ఉన్నాడనీ, ఆయన బాగా ధనవంతుడనీ, ఆయనే దిక్కులేని తన్ను చేరదీసి పెంచి పెద్దవాణ్ని చేశాడనీ చెప్పాడు. మార్గెట్ కి జైల్లోవున్న తన పినతండ్రి జ్ఞాపకంవచ్చి గావును, మళ్లీ కన్నీళ్లు జొటజొట కారాయి. తన పినతండ్రీ, అతని పినతండ్రీ ఎప్పుడన్నా కలుసుకుంటే బావుండునని ఆమె అన్నది. ఆమాట వినేటప్పటికే నావొళ్ళు జలదరించింది. "అవును. వాళ్లిద్దరూ ఒకరొకరికి పరిచయం కావటం బాగానే వుంటుంది," అన్నాడు సైతాను. నాకు మళ్లీ వొళ్లు జలదరించింది.*

"ఏమో ఎవరికి తెలుసు? ఎప్పుడన్నా కలుసుకుంటారేమో? మీ పినతండ్రి ఏం చేస్తూవుంటారు?" అని అడిగింది.

"అబ్బో ఆయనకి ఒకటా? లక్షపనులు. ఎప్పుడూ తిరుగుతూనే వుంటాడు."

ఈవిధంగా యిద్దరూ సంభాషణ సాగించారు. మార్గెట్ ఇన్నాళ్లూ తను పడిన కష్టాలు మరచిపోయింది. ఉత్సాహంతో ఆమె కళ్లు ప్రకాశించాయి. సైతానుమీద క్రమంగా ఆమెకు అనుకూలభావం ఎక్కువవుతున్నట్లు గ్రహించాను. చర్చి ఉద్యోగానికై

---

* మన కథలోవచ్చే సైతాను అసలు సైతాను కాదు. అసలు సైతాను తనపినతండ్రి అని ఇతడు చెప్పాడు. అసలు సైతాను దేవుడి మీద తిరుగుబాటు చేసి నరకంలో పడిపోయినవాడు.

విద్య అభ్యసిస్తున్నానని అతడు చెప్పినప్పుడు మార్గరెట్‌కు అతనిపై గౌరవం ఇంకా ఎక్కువైంది. తరవాత జైల్లో ఉన్న ఫాదర్ పీటర్‌ను మార్గరెట్ ప్రతి రోజూ చూడగల ఏర్పాట్లు చేస్తానని చెప్పినప్పుడు అతనిమీద ఇష్టం నూరింతలయింది. సైతాను అప్పటికప్పుడే ఒక కాగితంమీద ఏవో వింత అక్షరాలు రాశాడు. అది మార్గరెట్ కిచ్చాడు. జైలు కావలివారికి ఆ కాగితం చూపిస్తే లోపలికి వెళ్ళనిస్తారని, బయటికి వచ్చేటప్పుడు మళ్ళీ చూపించమనీ చెప్పాడు. మార్గరెట్ ముఖం వికసించింది. ఎప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడు పోయి పినతండ్రిని చూద్దామా అని తొందరపడింది. ఆ రోజుల్లో శాసనాలు మహా క్రూరంగా ఉండేవి. ఖైదీలు సంవత్సరాల తరబడి బంధుమిత్రులను చూడకుండా కారాగారాల్లో మగ్గేవారు. ఒకపట్టాన సామాన్యజను లెవ్వరూ ఖైదీలను చూసేందుకు అనుమతి లభించేది కాదు. అందుచేత మార్గరెట్ తన అదృష్టానికి పొంగిపోయింది. సైతాను కాగితంమీద గిలికిన అక్షరాలు కావలివారిని మంత్రించేందుకు ఉపయోగపడతాయని, ఆ కాగితం చూసి కావలివారు ఆకాసేపూ నిశ్చేష్టులై ఏం జరుగుతున్నదీ తెలుసుకోలేని స్థితిలో ఉంటారనీ నేను గ్రహించాను.

ఇంతలో ఉర్సులా వంటగదినుండి బయటికి వచ్చి "వంట అయిందమ్మా," అన్నది. నన్నూ, సైతాన్నూ చూసి తెల్లబోయింది. నన్ను పిలిచి రహ

స్యంగా అడిగింది, "పిల్లిసంగతి మార్గరెట్‌తో చెప్పారా?" అని. చెప్పలేదన్నాను. "చెప్పవద్దు. చెబితే మార్గరెట్ వెంటనే మతగురువును పిలిపించి, మంత్రాలు చదివించి, పిల్లిదగ్గరవున్న శక్తులు తీసివేయిస్తుంది. అది మంచిపిల్లి అయినా దెయ్యపుపిల్లి అయినా రెండుపూటలా తిండికి లోటులేకుండా చేస్తుందిగదా! దాన్ని పోగొట్టుకోవట మెందుకూ?" అని నన్ను హెచ్చరించింది.

మార్గరెట్ భోజనానికి సిద్ధమవుతున్నది. "వెడదామా" అని సైతాన్ను అడిగాను. "భోజనంచేసి పోదాము," అన్నాడు సైతాను. ఈమాటకు మార్గరెట్ గాబరాపడింది. 'ఇంట్లో ఒక్కమనిషి అర్ధాకలిగా తినటానికైనా పదార్థాలులేవే' అనే చింతలో పడింది ఆమె. ఉండమనటానికీ, పొమ్మనటానికీ కూడా మాట రాక ఆమె స్తబ్ధురాలైంది. ఇంతలో సైతాను మాటలు విన్నది గాబోలు ఉర్సులా అక్కడికి వచ్చింది. మొదట మార్గరెట్ ముఖంలోని తేజస్సు, చురుకుదనం చూసి ఆశ్చర్యపోయింది. తరవాత మా కర్థం కాదనుకుని బొహీమియన్ భాషలో మార్గరెట్‌తో అన్నది! "మిస్ మార్గరెట్! వీళ్ళని పొమ్మను. ఇంట్లో పదార్థాలేమీ లేవు."

మార్గరెట్ సమాధానమిచ్చే లోగానే సైతాను అందుకున్నాడు. బొహీమియన్ భాషలోనే అన్నాడు:

"ఇందాక నువ్వే కదూ రోడ్డుమీద నాకు కని పించావు -"

"అవును."

అతడు బొహీమియన్ భాషలో మాట్లాడటం ఉర్సులాకు, మార్గరెట్ కూ కూడా ఆశ్చర్యం కలిగించింది.

"అయితే నే నింకా నీకు జ్ఞాపకం ఉన్నానన్న మాట," అంటూ ఉర్సులాను కొంచెం అవతలికి తీసుకుపోయి మార్గరెట్ కు వినపడకుండా చెప్పాడు: "నీతో ఇందాక చెప్పలా? ఆ పిల్లి కోరినదంతా ఇస్తుంది. ఏమీ భయపడకు. అది ఎంతమందికైనా భోజనం సిద్ధం చెయ్యగలదు."

ఉర్సులా ముఖం చేటంతఅయింది. ఆమె ఆందోళన తీరిపోయింది. కళ్ళలో ఆర్ద్రకమైన ఆనందం కందళించింది. పిల్లి విలువ క్షణక్షణానికి హెచ్చుతున్నట్లు ఆమె గ్రహించింది.

"భోజనంచేసి పోదాం" అని సైతాను అన్న మాటకు మార్గరెట్ ఇంతవరకూ సమాధానమివ్వలేదు. తాను అతిథులను తృప్తికరంగా సత్కరించే స్థితిలో లేననీ, అయినా ఉన్నదాంతోనే సంతోషించవలసిందిగా ప్రార్థిస్తున్నాననీ అన్నది.

ఉర్సులా మాకు వంటగదిలో భోజనపు బల్లా, పళ్ళాలూ, అవీ అమర్చింది. మేము సుఖంగా ఆసీనుల మయ్యాము. పొయ్యిమీద పెనంలో చేప నొకదాన్ని

ఉర్సులా వేయిస్తున్నది. కమ్మటి వాసనలు గది అంతటా ఆవరించి నోరూరించాయి. మార్గెరెట్ ఆశ్చర్య పడింది, అదెక్కడినుంచి వచ్చిందా అని. చేప వేగిన తరవాత ఉర్సులా దాన్ని తీసుకువచ్చి మార్గెరెట్ కిచ్చింది. మార్గెరెట్ దాన్ని రెండు ముక్కలుగా కోసి ఒకటి నాకూ, ఒకటి సైతానుకూ వడ్డించింది. తనకు చేపలమీాద అంత ఇష్టం లేదన్నది. ఇంతలో పెనంలో మరొక చేప వేగుతూండటం చూసింది. ఆశ్చర్యపడింది కాని పైకి ఏమీా అనలేదు. బహుశా ఉర్సులాను తర వాత అడిగి కనుక్కుందామని అనుకునిఉంటుంది. ఇంతలో ఉర్సులా రుచికరమైన మాంసం, ద్రాక్షరసం, పళ్లు వరసగా తీసుకువచ్చి వడ్డించసాగింది. మార్గెరెట్ ఇవన్నీ చూసి ఆశ్చర్యం ప్రకటించకుండా ఊరుకుంది. అదికూడా సైతాను ప్రభావమే అయివుంటుంది. అతడు భోజనం ఆరగిస్తూ ఇష్టాగోష్ఠిగా సంభాషణ ప్రారంభించాడు. నిమిషానికి వంద అబద్ధాల చొప్పున కల్పించి తియ్యతియ్యగా మాట్లాడాడు. అతడు ఎన్ని అబద్ధాలాడినా అతని కేమీా ఇబ్బందిలేదు. దేవతగనక అతనికి పాపం చుట్టుకోదు; అసలు దేవతలకి పాప పుణ్యాల ప్రసక్తే లేదని అతడే చెప్పాడుగా!

సైతాను ఉర్సులాను అదేపనిగా ముఖస్తుతి చేశాడు. మార్గెరెట్‌తో రహస్యంగా చెబుతున్నట్టు నటిస్తూ, బిగ్గరిగా ఉర్సులా వంటను మెచ్చుకున్నాడు. ఉర్సులాకు వయస్సు ముదిరినా ఇంకా అందంగానే

ఉందని, ఆమెకు తన పినతండ్రిని పరిచయం చేస్తానని అన్నాడు. ఈ మాటలు ఉగ్గ్రులా విననట్లు నటిస్తూనే విన్నది. ఆ వృద్ధురాలి కెక్కడలేని సిగ్గూ వచ్చింది. యువతులకు సహజమైన లజ్జ అభినయిస్తూ గౌను సవరించుకోవటం, జుట్టు సవరించుకోవటం మొదలుపెట్టింది. ఆ దృశ్యం జుగుప్సాకరంగా వుంది. సైతాను మానవజాతిని అవమానిస్తున్నట్టు అనిపించి సిగ్గుతో తలవంచుకున్నాను.

ఇంతలో ఆగ్నెస్‌పిల్లి మా కుర్చీలవద్దకు వచ్చింది. నేను చూడకుండా అది నా చెయ్యి నాకింది. ఆ నాకటంలో ఒక రహస్యం బయటపడింది. దాని నాలుకమీద వెంట్రుకలూ లేవు, గింట్రుకలూ లేవు. "ఇది మామూలు పిల్లే" అనబోయాను; కాని నోట్లో మాట నోట్లోనే ఆగిపోయింది. సైతాను నావంక చూసి నవ్వాడు. అప్పు డర్థమైంది నాకు.

ఆ రోజున చీకటి పడగానే మార్గరెట్ ఒక బుట్టలో భోజనం, ద్రాక్షరసం సీసా, పళ్లు పెట్టుకుని జైలుకి బయల్దేరింది. నేనూ, సైతానూ మా యింటి వైపు నడుస్తున్నాము. నాకు ఒక ఆలోచన కలిగింది, జైలు లోపల ఎల్లా వుంటుందో చూడాలని. నా ఆలోచన సైతాను విన్నాడు. మరుక్షణం మేము జైల్లో ఉన్నాము. మేమున్న గది చిత్రహింసల గది అని సైతాను చెప్పాడు. నేరస్థులను అక్కడ రకరకాలుగా హింసించేందుకు యంత్రాలున్నాయి. ఒకటి రెండు

గుడ్డిదీపాలు మినుకుమినుకుమని వెలుగుతూ ఆ గదిని మరింత భయంకరం చేస్తున్నాయి. ఒక బల్లమీద ఖైదీ ఒకడు కాళ్లు చేతులు కట్టివేయబడి పడి వున్నాడు. మృత్యుకింకరుల్లాంటి జైలు అధికారులు, భటులు అతనిచుట్టూ వున్నారు. మమ్మల్ని వారు గమనించ నందున మేము అదృశ్యులమై ఉన్నామని గ్రహించాను. ఆ ఖైదీ మతద్రోహి అని ఆరోపణ చేయబడింది. "మతద్రోహి వని ఒప్పుకుంటావా? లేదా?" అని అధికారులు అడుగుతున్నారు. "నేను మతద్రోహిని కాను, కాను, కాను," అని ఖైదీ సమాధానం చెబుతున్నాడు. కొంతసేపైన తర్వాత భటులు ఖైదీ గోళ్లలో గుండుసూదులు దిగవెయ్యసాగారు. అతడు గుండెలు బద్దలయ్యేటట్లు బాధతో అరుస్తున్నాడు. ఆ అరుపులు విని నాకు తల తిరిగిపోయింది. ఆ గుండుసూదులు నాకే గుచ్చబడుతున్నట్లు నిలువెల్లా గజగజ వణికిపోయాను. సైతాను ఎప్పటివలెనే నిశ్చలంగా నవ్వుతూ చూస్తున్నాడు. చివరికి మూర్ఛపోయే స్థితిలో వున్న నన్ను పట్టుకుని బయటికి తీసుకురావలసివచ్చింది. చల్లగాలి సోకగానే నేను మామూలు మనిషి నయ్యాను. చిత్రహింసల గదిని తలుచుకుంటే వొళ్లు గగుర్పొడిచి మళ్ళీ కంపించాను. "అబ్బ! ఎంత ఘోరమైన హింస! వాళ్లు మనుషులా జంతువులా?" అన్నాను.

"కాదు, వాళ్లు మనుషులే. వాళ్ళని జంతువులతో ఎందుకూ పోలుస్తావు? మనుషులు చేసే పనికి జంతువుల నెందుకూ అవమానిస్తావు? తప్పుతప్పు," అన్నాడు సైతాను.

"మీ జాతి ఎంత అబద్ధాలకోరో చూశావా? ఎక్కడలేని సద్గుణాలూ తనకే ఉన్నాయంటుంది. దుర్గుణాలన్నీ, తనకంటే ఉన్నతశ్రేణికి చెందిన జంతువులకు ఆరోపిస్తుంది. అసలు సద్గుణాలనేవి ఉంటేగింటే ఉన్నతశ్రేణి జంతువులకేగాని మానవజాతికి లేనేలేవు. ఏ జంతువూ ఇంత క్రూరహింస చెయ్యలేదు. ధర్మాధర్మ విచక్షణ చెయ్యగల మానవజాతికే అది చేతనైనపని. ఏ జంతువైనా హింస చేసినప్పుడు తను చేసేది హింసఅని దానికి తెలియదు. అందుచేత అది తప్పనీ, అసలు తప్పనేదొకటి వుందనీ దానికి తెలియదు. పైగా ఏ జంతువూ హింసకోసమే హింస చెయ్యదు; తన సంతోషంకోసం అంతకన్నా చెయ్యదు. ధర్మాధర్మవిచక్షణ చేస్తున్నాననే గర్వంతో మానవుడొక్కడే ఆపని చెయ్యగలడు. ఏది ధర్మమో ఏది అధర్మమో నిర్ణయించేశక్తి మానవుడొకడికే ఉన్నది. ధర్మం చెయ్యటమో, అధర్మం చెయ్యటమో నిర్ణయించుకునే శక్తికూడా అతని కొక్కడికే ఉన్నది. ఆ శక్తి ఉండటంవల్ల అతనికొచ్చిన లాభమేమిటి? పది సందర్భాలు తీసుకుంటే తొమ్మిది సందర్భాల్లో మానవుడు అధర్మం చెయ్యటానికే నిర్ణయించుకుం

టున్నట్టు కనిపిస్తుంది. అసలు అధర్మం అనేది ఎందు కుండాలి? ధర్మాధర్మ విచక్షణ లేకపోతే అధర్మం అనేదే ఉండదు. కాని మానవుడు ఎంత తెలివితక్కువ వాడంటే, ధర్మాధర్మ విచక్షణ జ్ఞానంవల్లనే, తను జంతుకోటిలో అన్నిటికన్నా అధఃశ్రేణిలో ఉన్నా నన్న సంగతి అతడు గ్రహించటంలేదు. ఏమోయ్ థియొడోర్! మాట్లాడవేం? సీ కింకో తమాషా చూపిస్తానాగు."

## 6

మరుక్షణంలో మేము ఒక ఫ్రెంచిగ్రామంలో ఉన్నాము. అదేదో పెద్ద ఫ్యాక్టరీ; ఆడవాళ్లు, మగవాళ్లు, పిల్లలు చాలామంది వంచిన నడుము ఎత్త కుండా పనిచేస్తున్నారు. ఫ్యాక్టరీలోపల నిప్పులు చెరుగుతున్నంత వేడిగా వుంది; దుమ్ము, పొగ కలిసి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. అంత దుర్భరమైన వాతావరణంలో పనివాళ్లు, చిరిగిన పేలికలు ధరించి, వాడిన ముఖాలతో, వంగిన శరీరాలతో, ఆకలితో నీరసించి, అలసటతో కుంగిపోయి, పనిచేస్తున్నారు. నేనూ, సైతాను అదృశ్యరూపాలతో వారిమధ్య సంచరిస్తున్నాము. సైతాను ఇలా ప్రారంభించాడు:

"చూశావా థియొడోర్! మీ మానవుల ధర్మాధర్మ విచక్షణజ్ఞానం? ఈ ఫ్యాక్టరీయజ మానులు ధనవంతులు; గొప్ప దైవభక్తులు; వాళ్లు

తమ తోటి మానవులైన ఈ కార్మికులకు ఇచ్చే జీతం ఎంతో తెలుసా ? ఆకలికి మలమల మాడి చనిపో కుండా ఉండటానికి ఎంత అవసరమో అంతే ఇస్తారు. ఈ కార్మికులు ఇలా ఎంతసేపు పనిచేస్తారో తెలుసా? చలికాల మయేది, వేసవికాల మయేది, పిల్లల యేది, పెద్దవాళ్ల యేది—రోజుకి పధ్నాలుగు గంటలు, పొద్దున ఆరింటినించి, రాత్రి ఎనిమిది గంటలదాకా పని చేస్తారు. వీళ్లు ఎలుక బొరియలలాంటి కొంపల్లో నివసిస్తారు. ఆ కొంపలనించి ఈ ఫ్యాక్టరీదాకా, రానూ పోనూ ఎనిమిదిమైళ్లు, ప్రతిరోజూ, వానలో, ఎండలో, బురదలో, ధూళిలో, చలిలో, వడలో సంవత్సరాలతరబడి, బలికివున్నన్నాళ్లూ, నడిచి వచ్చి ఇక్కడ శ్రమిస్తారు. వీళ్లు నిద్రపోయేది రోజుకి నాలుగ్గంటలసేపు. ఒక్కొక్క గదికి మూడేసి కుటుం బాల చొప్పున ఊహించటానికి చేతకానంత ధూళిలో, దుర్గంధంలో నివసిస్తారు. రోగాలు రాక ఏమవుతాయి? వస్తాయి; వీళ్లు పురుగుల్లాగ టపటపరాలిపోతారు. ఈశిక్ష అనుభవించటానికి వారేమైనా నేరాలు చేశా రంటావా? ఉహు. ఏ నేరాలూ చెయ్యలేదు. మీ మూర్ఖ మానవజాతిలో పుట్టడమే వాళ్లు చేసిన నేరం! నేరం చేసినవాణ్ణి ఎంత చిత్రంగా హింసిస్తారో జైల్లో చూశావు. ఏ నేరం చెయ్యని వందలాది అమాయ కులను ఎలా హింసిస్తారో ఇక్కడ చూస్తున్నావు. మీ జాతికి ఏ కోశానైనా మెదడు అనేది వుందం

టావా? జైల్లో ఆ మతద్రోహి బాధకీ, ఈ కార్మికులు పడే బాధలకీ పోలిక లేదంటావా? అవును పోలిక లేదు. వీరి బాధలతో పోలిస్తే ఆ నేరస్థుని బాధ అతి స్వల్పం. అతన్ని మన మిటు వచ్చెయ్యగానే, రంపపు చక్రాల మధ్య నుంచోబెట్టి ముక్కలు ముక్కలుగా, పిండి పిండిగా చేసి ప్రాణం తీశారు. అతడు చనిపోయాడు. మీ మానవజాతినుంచి శాశ్వతంగా విముక్తుడయ్యాడు. కాని ఈ కార్మికులు—పాపం వీరు కొన్ని సంవత్సరాలుగా ప్రతిరోజూ చనిపోతూనేవున్నారు. వీరిలో కొందరు మరికొన్నేళ్లదాకా జీవితంనుంచి విముక్తి పొందలేరు. చూశావా? ధర్మానికీ అధర్మానికీ తేడా తెలిసిన ఫ్యాక్టరీ యజమానులు చేసేపని ఇదీ. పైగా తాము కుక్కలకంటే గొప్పవారమని వారి భావన. ఎంత తెలివితక్కువజాతోయ్ మీది!"

సైతాను ఉపన్యాసం ఆపేసి మన సామ్రాజ్యాలను, యుద్ధాలను, మహారాజులను, మహారాణులను, వారి వీరగాథలను తనివితీరా వేళాకోళం చేశాడు. మనచరిత్ర తలుచుకున్న కొద్దీ అతడు చక్కిలి గింతలు పెట్టినట్లు నవ్వసాగాడు. ఆ నవ్వు ఎంతసేపటికి ఆగలేదు; వింటున్నకొద్దీ అసహ్యంవేసింది. చివరికి నవ్వు ఆపాడు. "మీ చరిత్ర ఇంత హేళన చెయ్యదగినది కాదులే. ఒక్కొక్కసారి మిమ్మల్ని, మీ అల్పత్వాన్ని తలుచుకుంటే జాలి వేస్తుంది."

ఇంతలో అన్నీ మాయమై, క్షణంసేపు శూన్యాకాశంలో తేలిపోయాను. కన్నుమూసి తెరిచేలోగా మా గ్రామంలో వున్నాను. ఇద్దరం నదివైపు నడుస్తున్నాము. చీకటి పడింది. వెనకనుంచి సంతోష పూరితస్వరం వినిపించింది; "వచ్చాడు, వచ్చాడు, అడుగో!"

ఆ కంఠం సెప్పీదని గుర్తుపట్టాను. చీకట్లో, నేనుగాని, సైతానుగాని అతని కళ్లకు కనబడకపోయినా, నాకు అనుభవమైనట్లే అతనికీ అనుభవం కలిగి సైతానుసాన్నిధ్యాన్ని గుర్తించగలిగాడు. మా దగ్గిరికి వచ్చి మా పక్కనే నడిచాడు. సైతాన్ను చూసి తన సంతోషం వెళ్లబోసుకున్నాడు. ఎంతో కాలం వియోగం అనుభవించిన ప్రియుడు ప్రియురాల్ని కలుసుకున్నట్లు ఆనందపారవశ్యంలో పరవళ్లు పెట్టాడు.

మా గ్రామంలో హాన్స ఆపర్ట్ అని ఒక తిరుగుబోతు ఉండేవాడు. వాణ్ణిగూర్చి చెప్పసాగాడు సెప్పీ. వాడు రెండు రోజుల్నించీ ఊళ్లో కనిపించటంలేదట. గ్రామస్థులు వాడేమయ్యాడా అని చర్చలపై చర్చలు చేస్తున్నారట. సెప్పీ ఇంకా ఇలా చెప్పాడు:

"వాడికో కుక్క వుంది. ఎప్పుడూ ఆ కుక్కని చితగ్గొడుతూవుంటాడు. రెండు రోజులకిందట ఏమొచ్చిందో ఏమో దాన్ని పట్టుకుని బాదటం మొదలెట్టాడు. నేనూ, థియొడోర్ వాణ్ణి బతిమాలాము కొట్టవద్దని. మా మాటలు వినకపోగా, కుక్కని ఇంకా

కొట్టాడు. ఆ కొట్టడంలో పాపం దాని కన్నొకటి ఊడి వచ్చేసింది. ఛీ! వాడు మనిషికాదు. పశువు, మృగం, జంతువు..." సెప్పీకంఠం కోపంతో, కరుణతో వణికింది.

నాకు తెలుసు సైతాను ఏమంటాడో. సరిగ్గా నేనూహించినట్టే అన్నాడు: "కాదు సెప్పీ! అలా తిట్టబోకు. జంతువు లెప్పుడూ అలాటిపనులు చెయ్యవు. మానవులే చెయ్యగలరు."

"పోనీ జంతువులుకూడా చెయ్యవనుకో. ఏమయినా అది అమానుషం, రాక్షసం, పైశాచికం అంటాను."

"అదిగో మళ్లీ పొరపాటు పడుతున్నావు సెప్పీ! అది అమానుషం కాదు; మానుషమే. ముమ్మాటికీ అది మానుషకార్యమే. మానవ హృదయంలో తప్ప ఇంకెక్కడా లేని క్రూరస్వభావాన్ని ఉన్నత శ్రేణి ప్రాణులకు అంటకట్టడం అన్యాయం. మీరు జంతువు లని పిలిచే ప్రాణులున్నాయే, వాటిలో వేటికీ ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం లేదు. సెప్పీ! మీ భాషని కొంచెం మరమ్మతుచెయ్యి. జంతువు, పశువు ఇత్యాది దూషణపదాల్ని తీసి వెయ్యి."

సైతాను కొంచెం కఠినంగానే మాట్లాడాడు. సెప్పీ ఎంతో నొచ్చుకున్నాడు. సైతానుకు కోపం తెప్పించానని బాధపడ్డాడు. కొంతసేపు ముగ్గురం నిశ్శబ్దంగా నడిచాము. ఆ నిశ్శబ్దత మరీ బాధ కలిగించింది. కాని ఇంతలో నిశ్శబ్దత భంగంచేస్తూ ఒక

నన్నని మూలుగు వినబడింది. హాన్స్ ఆపస్ట్ కుక్క కుంటుతూ మమ్మల్ని సమీపించింది దానికన్ను ఒకటి స్థానం తొలగి వేళ్లాడుతోంది. అది సరాసరి సైతానువద్దకు పోయి ఏడుస్తున్నట్లు మూలిగింది. సైతాను కూడా మూలుగుతున్నట్లే సమాధాన మిచ్చాడు. సైతానూ, ఆ కుక్కా- కుక్కల భాషలో మాట్లాడుతున్నట్లు మా కర్థమైంది.

అప్పటికి చంద్రుడు ఉదయించాడు. పల్చటి తెరల్లాగ పరుచుకున్న చంద్రకాంతిలో పచ్చికమీద ముగ్గురం కూర్చున్నాము. సైతాను కుక్కను దగ్గరికి తీసుకుని దానితల ఒళ్లో పెట్టుకున్నాడు. కన్ను యథా స్థానంలో అమర్చాడు. కుక్కకు బాధ తీరిపోయి, సంతోషంతో తోకాడించింది; సైతాను చెయ్యి ప్రేమగా నాకింది; తనభాషలో ఏదో చెప్పింది; బహుశా తన కృతజ్ఞత తెలిపివుంటుంది. తరవాత అదీ, సైతాను కొంతసేపు ఏవో సంభాషించారు. సైతాను మాతో చెప్పాడు:

"తన యజమాని బాగా తాగి వొళ్లు తెలియక తన్ను కొట్టాడని చెబుతోంది."

"అవును. అప్పుడు బాగా తాగివున్నాడు," అన్నాము మేము.

"తన్ను కొట్టిన తరవాత అడవుల్లోకి వెళ్లి ఒక కొండ గుట్టమీంచి కిందకి దొర్లి పడిపోయాడని ఇది చెబుతున్నది. అది చూసి తను గ్రామంలోకి వెళ్లి



తన యజమానిని రక్షించమని వాళ్ళనీ వీళ్ళనీ బతిమాలిందట. కాని ఒక్కరూ వినిపించుకోలేదట."

నాకిప్పుడు జ్ఞాపకం వచ్చింది, ఈకుక్క పెంపు రోజులకిందట మాదగ్గిరికి వచ్చి మూలుగటం నాకేమీ అర్థంకాక దాన్ని పొమ్మనటం

సైతాను కుక్క చెప్పిన మాటలు తర్జుమా చేసి చెప్పాడు: "తన యజమాని ప్రమాదస్థితిలో వున్నాడని ఇతర గ్రామస్థుల సహాయం కోసం ప్రయత్నించిందట. తనే ఈ రెండు రోజుల్నించీ తిండీ, నిద్రా లేకుండా యజమానివద్ద కాపలాగా కూర్చుందిట. చూశారా, తన్ను హింసించిన యజమానిపై ఈకుక్క కెంత విశ్వాసమో? ఇప్పు డేమంటారు, మీ జాతిని గూర్చి? మీమతగురువులు చెప్పే స్వర్గానికి అర్హు లెవరు? మీరా, ఈ కుక్కా? ఈ కుక్క మీ దగ్గర్నించి నేర్చుకోవలసిన నీతు లింకా ఏమన్నా వున్నాయా?"

ఇలా అని సైతాను కుక్కతో ఏదో మాట్లాడాడు. వెంటనే అది సంతోషంతో గంతులు వేస్తూ, ఏది చెబితే అది చెయ్యటానికి సిద్ధంగా వున్నట్లు కనబడింది.

"థియొడోర్! మీరిద్దరూ గ్రామంలోకి వెళ్లి కొందరు మనుషులను వెంటబెట్టుకుని రండి. హాన్స్ ఆపర్ట్ పడివున్నచోటు ఈకుక్క చూపిస్తుంది. మత గురువును కూడా అక్కడికి తీసుకువెళ్లి, ఆ తిరుగుబోతు స్వర్గానికి వెళ్ళే ఏర్పాట్లు, అవీ చేయించండి. వాడి కిక ఆట్టే గడువులేదు," అన్నాడు సైతాను. వెంటనే మాతో చెప్పనైనా చెప్పకుండా అంతర్హితుడై పోయాడు.

మేము గ్రామంలోకి వెళ్లి ఫాదర్ అడాల్ఫ్‌ను, మరికొందరిని వెంటబెట్టుకుని హాన్స్ ఆపర్ట్ ఉన్న చోటికి వెళ్లాము. మేము వెళ్లిన కాసేపటికి అతడు స్పృహ రాకుండానే ప్రాణం విడిచాడు. అతని పెంపుడు కుక్క తప్ప అతనికోసం కంటతడిపెట్టిన వారు లేరు. కుక్క అతని ముఖం నాకుతూ, ఏడుస్తూ చుట్టూ తిరుగుతోంది. హాన్స్ ఆపర్ట్‌కి బంధువులూ లేరు; డబ్బూ లేదు. అందుచేత అతన్ని అక్కడే శవపేటిక వగైరాలేమీ లేకుండా గొయ్యి తవ్వి పాతిపెట్టారు. మరొక గంటముందు వచ్చివుంటే అతనికై మతగురువు ప్రార్థనాదికం చెయ్యటం, అతడు స్వర్గానికి పంపించబడటం జరిగేది. ఇప్పుడా అవకాశం పోయింది. హాన్స్ ఆపర్ట్ శాశ్వతంగా నరకానికి వెళ్లిపోయాడు. లోకంలో అనేకులు వృథాగా కాలం గడిపే వారున్నారు. వారి కాలంలో ఒక్కగంట హాన్స్ ఆపర్ట్‌కు లభించివుంటే అతనికి శాశ్వత నరకం గాక శాశ్వత స్వర్గం లభించి వుండేది. అప్పుడు నాకు తెలిసి వచ్చింది, కాలం ఎంత అమూల్యమైనదో. హాన్స్ ఆపర్ట్ దుర్గతికి సెప్పీ ఎంతో విచారించాడు. మనుష్య జన్మకంటే కుక్క జన్మే నయమనీ, స్వర్గ నరకాలబాధ దానికి లేదనీ అన్నాడు. కుక్కని ఇంటికి తీసుకుపోయి పెంచుదామనుకున్నాము. ఇద్దరం దిగులుగా గృహాభిముఖంగా నడుస్తున్నాము. సెప్పీకి మంచి ఆలోచన తట్టింది. కుక్క తన యజమానిని క్షమించినట్లు

కనిపిస్తున్నదనీ, కుక్కగనక క్షమిస్తే బహుశా దేవుడు కూడా క్షమిస్తాడనీ, ఆ విధంగా హాన్స్ ఆపర్ట్‌కి నరకం తప్పుతుందనీ అన్నాడు.

తరవాత వారంరోజులదాకా సైతాను రాలేదు. ఒంటరితనం దిగులుగా గడిచింది. మాకు అప్పుడప్పుడు మార్గరెట్‌ని చూడాలనిపించేది గాని, అవి వెన్నెలరాత్రులు; ఎంత రహస్యంగా ఇంటినుంచి తప్పించుకు పోదామనుకున్నా ఎవరికో ఒకరికి కంట పడక మానదు. అందుచేత ఆ ప్రయత్నం మానేశాము. కాని రెండు మూడు పర్యాయాలు ఉర్సులా పిల్లిని వెంటపెట్టుకుని కనిపించింది. మార్గరెట్ కులాసాగానే ఉందనీ, ఇంట్లో ఏ ఇబ్బందులూ లేవనీ ఆమె చెప్పింది. వృద్ధదాసి చక్కని కొత్త దుస్తులు ధరించి డబ్బు చేతిలో ఆడుతున్న మనిషివలెనే కనిపించింది. పిల్లి రోజుకి నాలుగు వెండి నాణాలూ ఖచ్చితంగా ఇస్తున్నదనీ, భోజనం, సారాయం మొదలైనవాటికి కూడా అదే అదనపు ఏర్పాట్లు చేస్తున్నందున రోజూ వచ్చే నాలుగు నాణాలూ నిలవలో పడుతున్నాయనీ కూడా ఉర్సులా చెప్పింది.

మార్గరెట్ ఒంటరిగా ఉంటున్నా దిగులుగా లేదనీ, అప్పుడప్పుడు విల్హెల్మ్ మీడ్లింగ్ వచ్చి పలకరించి పోతున్నాడనీ ఆమె అన్నది. ప్రతిరోజూ మార్గరెట్ తినుబండారాలు పట్టుకుని జైలుకి వెడుతోందనీ, జైల్లో ఉన్న ఫాదర్ పీటర్ కూడా ఆరోగ్యం

కోలుకున్నాడట. మేము ఫిలిప్ ట్రామ్‌ను మళ్లీ ఒక సారి తమ ఇంటికి తీసుకువస్తే బాగుండు ననుకుంటోం దట. ఉర్సులా తనకు కూడా అతన్ని చూడా లని వున్నట్లు చెప్పింది. అతన్ని గూర్చి, ముఖ్యంగా అతని పినతండ్రిని గూర్చి చాలా అడిగింది. సెప్పీ, నికొలాస్ నవ్వారు. నేను వాళ్లతో అంతకు ముందే చెప్పాను, సైతాను తన పినతండ్రిని గూర్చి కోతలు కోసి ఉర్సులాను ఉబ్బించాడని. ఉర్సులా ప్రశ్నలకు మేము సమాధాన మివ్వలేదు. ఇద్దామను కున్నా నోళ్లు కట్టుపడిపోతాయిగా!

ఉర్సులా మరొక కబురుకూడా చెప్పింది. డబ్బు దండిగా ఉన్నందున, ఇంటిపనులు చేసేందుకు ఒక నౌకరుకుర్రాణ్ణి కుదుర్చుకున్నామని తెలిపింది. అది మామూలు విషయమైనట్లు నిర్లక్ష్యంగా చెప్ప జూచింది; కాని ఎంత ప్రయత్నించినా ఆమె సంతోషం ఆగలేదు. నౌకరు కుర్రాడిపేరు గాట్ ఫ్రీడ్ నార్ అని చెప్పింది. ఆపేరు వినగానే మాకు మనస్సులో ఆందో ళన బయలుదేరింది. మేము బాలురమైనా, ప్రపంచ జ్ఞానం అట్టే లేకపోయినా కొన్ని విషయాలు గూర్చి మాకు నిశ్చితమైన పరిజ్ఞానం ఉన్నది. గాట్ ఫ్రీడ్ నార్ మంచి కుర్రాడే; అతనిలో ఎటువంటి దోషమూ లేదు; కొంచెం మందబుద్ధి గలవాడుతప్ప దుర్బుద్ధి అణు మాత్రమూ లేనివాడు. అయినా వాణ్ణి నౌకరుగా ఏర్పాటు చేసుకోవటం మంచిది కాదని తోచింది.

ఎందుకంటే వాడి నాయనమ్మ మంత్రగత్తె అనే ఆరోపణ మీద ఆరునెలల కిందటే భస్మీభూతం చేయబడింది. కుటుంబంలో ఒకరు మంత్రగత్తె అయినప్పుడు మిగతా వారిలో కూడా ఆదోషం కొంత గాకపోతే కొంతైనా ఉండకపోదు. పైగా ఈకాలంకూడా మంచిదికాదు. కొద్దిరోజులుగా మా పరగణాలో మంత్రగత్తెలవేట ముమ్మరంగా సాగుతున్నది. ఈవేట యాభై అరవై ఏళ్ల లోగా ఎన్నడూ ఇంత ఉధృతంగా విజృంభించలేదట. మంత్రగత్తె అనే మాట వినిపిస్తే చాలు ప్రాణాలు పైనే ఎగిరిపోయేవి. పూర్వకాలంలో వృద్ధ స్త్రీలు మాత్రమే మంత్రగత్తెలుగా ఉండేవారు. ఇప్పుడలా కాదు—అన్ని వయస్సుల్లో వారూ, ఆఖరికి ఎనిమిది తొమ్మిదేళ్ల పిల్లలు కూడా మాంత్రిక శక్తులు సంపాయిస్తున్నారు. ఆడవాళ్లయేది, మగవాళ్లయేది, పిల్లలయేది, పెద్దలయేది, ఎవరు పడితే వాళ్లే సైతానుకు ఆత్మలమ్ముకోవటం, శక్తులు సంపాదించటం జరుగుతోంది. మా ప్రాంతంలో మాంత్రికులనేవాళ్లు లేకుండా నిర్మూలం చెయ్యటానికి తీవ్రమైన ఉద్యమం కొనసాగింది. కాని ఎంతమందిని తగలబెడితే అంతమంది మళ్ళీ తయారవుతున్నారు.

మాపూరికి పదిమైళ్ల దూరంలోవున్న ఒక వూళ్లో ఒక సంఘటన జరిగింది. బళ్లో చదువుకుంటున్న ఒక బాలికకు వీపు ఎర్రగా దద్దుర్లతో నిండి

వున్నట్లు ఉపాధ్యాయులు కనిపెట్టారు. అవి సైతాను వేసిన గుర్తులని వారు అనుమానించారు. బాలిక భయ పడింది. అవి దోమ కాట్లనీ, తను ఏదోషం ఎరగననీ, తన్ను రక్షించవలసిందనీ మొత్తుకుంది. కాని ఉపా ధ్యాయులు విడిచిపెట్టలేదు. బళ్ళోవున్న బాలిక లంద రినీ పరీక్షించారు. యాభైమంది బాలికలకీ మొత్తం మీద వీపులు కొంచెం ఎర్రఎర్రగానే వున్నాయి; పదకొండుగురు బాలికల వీపులుమాత్రం అనుమా నించదగినంత ఎర్రగా వున్నాయి. ఈ విషయం దర్యాప్తు చేయటానికి ఒక కమిటీ ఏర్పాటైంది. విచా రణ చేయగా ఆ పదకొండుగురు బాలికలు తల్లుల కోసం ఏడ్చారు తప్ప, సైతానుతో తాము ఒడంబడిక చేసుకున్నట్లు ఒప్పుకోలేదు. వారిని వేర్వేరు చీకటి గదుల్లో పెట్టి పదిరోజులపాటు బంధించారు. మాడి పోయిన రొట్టె, నీళ్లు తప్ప వారికి వేరే తిండిలేదు. పద కొండో రోజుకి బాలికలందరూ నీరసంవల్ల ఏడవటం మానేశారు; జబ్బులుపడి లేచినవాళ్ళలాగ నయా రయ్యారు; తిండి తినరు; పలకరు, ఉలకరు; కర్రల్లాగ బిగుసుకుపోయి కూర్చున్నారు. మళ్ళీ విచారణ చెయ్యగా వారిలో ఒకపిల్ల చేసిన పాపం చెప్పేసింది. చీపురుకట్టలమీద ఎక్కి గాలిలో తేలుతూ నిర్జన పర్వతాల్లోకి అనేకసార్లు వెళ్లామనీ, మంత్రగత్తెలు చేసుకునే ఉత్సవాల్లో పాల్గొన్నామనీ, సైతానుతో కలిసి నాట్యం చేశామనీ, మతగురువులనూ, దేవుణ్ణి

నోటికి వచ్చినట్లు తిట్టామనీ ఆమె వాఙ్మూలం ఇచ్చింది. ఆ పిల్ల తనంతటతనే ఈ విషయాలన్నీ చెప్పిందనుకోగూడదు. ఆమెకు ఇదంతా వివరంగా జ్ఞాపకం లేనందున కమిటీసభ్యులే "జ్ఞాపకం" చేశారు. "చీపురుకట్టలమీద ఎక్కి వెళ్లారా?" అని కమిటీవారు ప్రశ్న వేస్తారు. పదిరోజుల్నించీ తిండీ తిప్పలూ లేక నీరసించివున్న ఆ పిల్ల "అవును" అని సమాధానమిస్తుంది. ఆ పాయింటు జాగ్రత్తగా రికార్డు చేస్తారు. తరవాత "సైతానుతో నాట్యం చేశారా?" "దేవుణ్ణీ, మత గురువులను తిట్టారా?" మొదలైన ప్రశ్నలు వరసగా వేస్తారు. అన్నిటికీ ఆపిల్ల "అవు"నని, సమాధానమిస్తుంది. ఆ పాయింట్లన్నీ ఆమె స్వయంగా చెప్పినట్టే రికార్డు చేస్తారు. ఈవిధంగా ముక్కుపచ్చలారని బాలికనుంచి వాఙ్మూలం తీసుకోబడుతుంది. కమిటీ సభ్యులకు ఏమేమి ప్రశ్న లడగాలో క్షుణ్ణంగా తెలుసు. ఎందుకంటే ఇటువంటి అవాంతరాలు వస్తాయని రెండు వందల ఏళ్లకిందటే ఎవరో ఒక "ప్రశ్నావళి" తయారు చేసి వుంచారు.

తమలో ఒకపిల్ల ఒప్పేసుకుందని తెలియగానే మిగతా పదిమంది బాలికలూ కిక్కురుమనకుండా సైతానుతో తమకు సంబంధం ఉందని ఒప్పుకున్నారు. అప్పుడు వారందరినీ కట్టగట్టి కట్టెలమోపులు తగలపెట్టినట్లు తగలపెట్టారు. ఈ "అద్భుత దృశ్యం" చూట్టానికి చుట్టుపక్కల ఊళ్లనుంచి తండోపతండా

లుగా ప్రజలు తరలివెళ్లారు. నేనుకూడా వెళ్ళాను. తగలబడేవారిలో ఒకపిల్ల నాకు స్నేహితురాలు. ముద్దులొలికే ఆమె చిన్నారిముఖం నే నెన్నటికీ మరవలేను. ఆమెతల్లి గుండెలు పగిలిపోయేట్లు "ఓయి నాయనో! ఓయి దేవుడో!" అని ఏడుస్తుంటే, ఆ బాలికలు కణకణ కాలిపోతుంటే, చూడలేక అవతలకు వెళ్లిపోయాను.

ఇక మార్గరెట్ ఇంట్లో నౌకరుగా కుదిరిన గాట్ ఫ్రీడ్ నార్ విషయానికి వద్దాం. అతని నాయనమ్మ తలకాయ నెప్పులను తమాషాగా నయం చేసేది. తల, మెడ కొంతసేపు నిమిరేది; చేత్తో తీసేసినట్టు తలనెప్పి మాయమయ్యేది. ఇది సైతానుపనేనని ఆరోపణ చేశారు. మంత్రగత్తెల కమిటీవారు ఆమెను విచారణకు పిలిపించారు. ఆమె విచారణ అవసరం లేకుండానే ఒప్పుకున్నది. మర్నాడు ఆమెకు దహనశిక్ష జరుగుతుందని ప్రకటించారు. గ్రామ మధ్యంలో చితి ఏర్పాటైంది. పోలీసులు ఆమెను తీసుకువచ్చి, మరొక మంత్రగత్తెను తీసుకురావటానికి వెళ్లారు. ఆమె చితివద్ద కూర్చుని, అది శీతాకాలపు ఉదయం కావటంచేత వళ్లు వెచ్చబెట్టుకుంటోంది. నేను ఆమెను సమీపించి ఎవరూ చూడకుండా ఒక ఆపిల్ పండు ఇచ్చాను. ఇంతలో మరొక కొత్తవాడెవడో వచ్చాడు. ఎవరూ వినకుండా ఆమెను చూసి "అయ్యో, పాపం" అని జాలిపడ్డాడు.

"నువ్వు ఒప్పుకున్న విషయం నిజమేనా?" అని అడిగాడు. ఆమె కాదన్నది. కొత్తవాడు ఆశ్చర్యపడి "అయితే ఎందుకు ఒప్పుకున్నావు?" అన్నాడు.

"నేను బీదముండని. కూలినాలి చేసుకుని పొట్ట పోసుకునేదాన్ని. వాళ్లన్నది ఒప్పుకుంటేనే మంచిదని ఒప్పుకున్నాను. ఒప్పుకోకపోతే బహుశా విడిచి పెట్టేవాళ్లేమో. కాని విడిచిపెట్టినా, నేను మంత్రగత్తెననే అనుమానం ఎవరికీ పోదు. ఆమీదట నాకెవరూ కూలిపని ఇవ్వరు. నన్ను చూసి దూరంగా తొలిగి పోవటమో, కుక్కలను ఉసికొలపటమో చేస్తారు. నేను మలమల మాడి చావటం తప్ప ఇంకేమీ ఉండదు. అంతకంటే ఇలా కాసేపు తగలడి చావటమే మంచిది. మీ రెవరో జాలిగుండె మనిషల్లే వున్నారు. మీరాడిన మంచిమాట మరిచిపోను."

అని ఆ వృద్ధస్త్రీ మంటకు దగ్గరగా జరిగి కూర్చుంది. అప్పటికి జనం బాగా పోగయ్యారు. ఎవరో ఒక కోడిగుడ్డు విసిరారు. అది ఆమెకంటికి తగిలి, పగిలి, ముఖమంతా అయింది. ఈ హాస్య చేష్టకి జనం గొల్లున నవ్వి తమ ఆనందం ప్రకటించారు. తరవాత కాసేపటికి వృద్ధస్త్రీకి యథావిధిగా సజీవ దహనసంస్కారం జరిగింది.

ఒకసారి సైతానుకు మాటలసందర్భంలో పదకొండుగురు బాలికల సంగతి, వృద్ధస్త్రీసంగతి చెప్పాను. అత డేమీ చలించలేదు. "మానవజాతి

స్వభావమే అంత" అన్నాడు. "మానవజాతి చర్యలు పట్టించుకోవలసినంత ముఖ్యమైనవి కా"వన్నాడు. "మానవజాతి పుట్టడం ఎరుగుదును. మానవుడు మట్టితో తయారయ్యాడని కొందరంటారు. అది అబద్ధం. బురదతో తయారయ్యాడు. కనీసం అంతా కాకపోతే కొంత భాగమైనా బురదతో తయారు చెయ్యబడ్డాడు," అన్నాడు. అతని అభిప్రాయం నా కర్థమైంది; మానవునికున్న ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం బురద అని అతని అభిప్రాయం. నేను గ్రహించినట్లు తెలుసుకొని సైతాను నవ్వాడు. పచ్చిక మేస్తున్న ఎద్దు నొకదాన్ని చూపించి, దాన్ని నిమిరి, దానితో ఏదో మాట్లాడాడు. తరవాత నాతో ఇలాగన్నాడు :

"ఇదుగో—ఈ ఎద్దు చూడు. అమాయికలైన బాలికలను పదిరోజులు ఆకలితో మాడ్చి, భయపెట్టి, వారు చెయ్యని పాపాలను వారిచేత ఒప్పింపజెయ్యటం, ఈ ఎద్దు చెయ్యగలదంటావా ? నిరుపేద వృద్ధస్త్రీలు తోడిమానవులకు సహాయం చేస్తుంటే సహించలేక కాల్చి చంపటం, కాల్చబోయేముందు కోడిగుడ్లు విసిరి అవమానించటం, ఈ ఎద్దు చెయ్యగలదంటావా ? ఊహూ. చెయ్యలేదు. దానికి ధర్మాధర్మ విచక్షణ జ్ఞానం లేదు గనక అధర్మం చెయ్యలేదు. అందుకనే అది మా దేవతలతో సమానమైనది.

సైతాను ఒక్కొక్కసారి ఎంత తియ్యగా మాట్లాడుతాడో, మరొక్కొక్కసారి అంత క్రూరంగా

మాట్లాడుతాడు. ముఖ్యంగా మానవజాతిప్రసక్తి వస్తే చాలు అతని కంఠంలో కాఠిన్యం ఉట్టిపడుతుంది.

మళ్లీ కథలోకి వద్దాం. గాట్ ఫ్రీడ్ నార్‌ను నౌకరుగా ఏర్పాటు చేసుకోవటం క్షేమం కాదని మాకు అనిపించింది. మేము అనుమానించినట్టే జరిగింది. మంత్రగత్తె అని తగలపెట్టబడిన స్త్రీ మనమడు ఫలానా మార్గరెట్ వద్ద నౌకరుగా ఉంటున్నాడనే విషయం నలుగురిలోనూ పొక్కింది. కొందరు మండిపడ్డారు. పైగా ఆఇంట్లో మార్గరెట్‌కూ, ఉర్సులాకే లేదే? నౌకర్ను పెట్టుకుని వాడికి జీతమిచ్చి పోషించటాని కెక్కడుంది? అని గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఈ రహస్యం ఛేదించటానికి కొందరు నడుం బిగించి తీవ్ర కృషిచేశారు. గాట్‌ఫ్రీడ్ నార్ కనిపిస్తే వాడిమీద ఇంతవరకూ ఉమ్మేసే మహానుభావులు, ఇప్పుడు వాణ్ణి మెల్లిగా దువ్వసాగారు. వాడు అసలే మేధకుడు గనక వారు పన్నిన వల చూసుకోకుండా, వారు తనతో మాట్లాడిందే భాగ్యమనుకుని, సంతోషించాడు. చల్లగా ఉన్నదున్నట్టు చెప్పేశాడు.

"డబ్బా? వెధవ డబ్బు! మార్గరెట్‌గారి దగ్గర చచ్చేంత డబ్బుంది. నాకు ముప్పూటా మూడుకంచాల తిండి పెట్టడమే గాక వారానికి రెండు వెండి నాణాలు జీత మిస్తున్నారు. వాళ్ల భోజనం ఎల్లా వుంటుందో తెలుసా? మహారాజులు కూడా జన్మలో తిని ఎరగని

పదార్థాలు ఇంట్లో ఎక్కడ చూసినా మూలుగు తూంటాయి," అన్నాడు.

గాట్ ఫ్రీడ్ నార్ ఇలా వర్ణించే సరికి గ్రామస్థులకి మూర్ఛ పర్యంతం అయింది. ఆశ్చర్యం, భయం ముంచుకొచ్చాయి. కొందరు వెంటనే వెళ్లి జ్యోతిష్కుడితో చెప్పారు. ఆయనకి ఈ మాటలు విని కాళ్లు చేతులు చల్లపడ్డాయి. తక్షణంపోయి ఫాదర్ అడాల్ఫ్‌కు చేరవేశా డీ కబురు. ఆయనకూ్కడా కాళ్లూ చేతులూ ఆడలేదు. దీర్ఘంగా ఆలోచించి, "ఇదేదో చూడాల్సిందే. దీని అంతు నేనో, నా అంతుఅదో కనుక్కోవాలి," అని ఫాదర్ అడాల్ఫ్ నిశ్చయించాడు.

మార్గరెట్‌కు తిరిగి సిరిసంపదలు లభించడానికి ఏవో మంత్రశక్తులే కారణమైవుండాలని ఫాదర్ అడాల్ఫ్ భావించాడు. మార్గరెట్ ఇంటికి తరుచు వస్తూపోతూ ఉండాలని, ఏమీ ఎరగనట్టు నటిస్తూ అంతా కనిపెట్టాలనీ, గ్రామస్థులకు రహస్యంగా హెచ్చరిక చేశాడు. గ్రామస్థులు మొదట సందేహించారు, మంత్రశక్తులతో నిండిన మార్గరెట్ ఇల్లు ప్రవేశించటానికి. కాని తన ప్రభావంవల్ల ఎవరికీ ఏ అపాయమూ రాకుండా చేస్తానని ఫాదర్ అడాల్ఫ్ అభయం ఇచ్చాడు. మంత్రించిన నీళ్ళూ, అవీ దగ్గిర పెట్టుకుని ఉండమని సలహా ఇచ్చాడు. అప్పుడు గ్రామస్థులకు భయం తొలిగి మార్గరెట్ ఇంటికి పోవటానికి

అంగీకరించారు. ఆమెపై అసూయ, ద్వేషం ఉన్న కొందరు ఆమె ఇంటికి వెళ్ళటానికి సంబరపడ్డారు కూడాను.

ఈవిధంగా మార్గరెట్ ఇల్లు మళ్ళీ కలకలలాడ సాగింది. తన ఇంటికి గ్రామస్థులు రాకపోకలు జరుపుతున్నందుకు ఆమె సంతోషించింది.

మేము ముగ్గురం కూడా నిరభ్యంతరంగా మార్గరెట్ ఇంటికి వెళ్ళసాగాము. మా తల్లిదండ్రులు కూడా రోజూ ఒకసారైనా ఆ ఇంటికి వెళ్లేవారు. ఉర్సులా పెంపుడుపిల్లి ఎంతమంది వచ్చినా షడ్రసోపేతమైన విందు ఏర్పాటు చేసేది. రకరకాల రుచ్య పదార్థాలు, పానీయాలు, ఫలాలు సప్లయి చేసేది. మహారాజులకు తగిన ఈ భోజ్యవిశేషాలు ఆరగించి గ్రామస్థులు విపరీతమైన ఆశ్చర్యంతో ఇళ్లకు తిరిగి పోయేవారు. అంత ఖరీదైన పదార్థాలు ఎక్కణ్నుంచి వస్తున్నాయో ఎవరికీ తెలీదు.

మార్గరెట్ కి అప్పుడప్పుడు సందేహం పట్టుకుని బాధించేది. ప్రతిరోజూ అతిథులను సత్కరించటానికి తగిన ధనం ఎక్కణ్ణించి వస్తోంది? ఈ విషయమై ఉర్సులాను ఎన్నిసార్లు అడిగినా ఆమె "దిక్కులేని వారికి దేవుడే దిక్కు" అని వల్లించటం తప్ప మరొక మాట చెప్పేది కాదు. దేవుడు తలుచుకుంటే ఆయన కసాధ్యమనేది లేదని మార్గరెట్ కి నమ్మకం ఉన్నది. అయినా వట్టి పుణ్యానికి దేవుడింత విస్తారంగా దయ చూపిస్తున్నాడంటే మార్గరెట్ నమ్మలేక పోయింది.

కాని ఆముక్క పైకన లేదు. అంటే ఏం కీడు మూడు తుందోనని భయం. మంత్రాలు తంత్రాల ప్రభావ మేమోనని మొదట అనుమానించింది, గాని ఆ అను మానం నిరాధారమని నిశ్చయించు కుంది. ఎందుకంటే గాట్ ఫ్రీడ్ నార్ నౌకరుగా తమవద్ద కుదరక ముందు నుంచీ, ఇంట్లో ఈ ఆర్థిక విచిత్రాలు జరుగుతున్నాయి. కనక ఇది గాట్ ఫ్రీడ్ నార్ పని కాజాలదు. ఇకఉన్నది ఉర్సులా. ఆమెను అనుమానించటమే మహా పాపం. అంత భక్తురాలు, పుణ్యాత్మురాలు పృథ్విలో ఉండదు. పైగా ఉర్సులాకు మాత్ర గత్తైలంటే తగని మంట.

ఈ విధంగా తన అదృష్టానికి కారణం భగ వంతుని కరుణయేగాని మరేమీకాదని మార్గెట్ నిర్ణ యించుకుంది. ప్రతిరోజూ ప్రార్థన సమయంలో దేవు నికి కృతజ్ఞత వెల్లడించేది. పిల్లి న్యాయంగా తనకు రావలిసిన కృతజ్ఞతా గౌరవం దేవునికి పోతున్నందుకు ఏమీ కించపడలేదు. తన శాయశక్తులా తంటాలు పడి ఇంటిల్లి పాదికీ సమస్తా వసరాలు తీరుస్తున్నది. రోజు కొకరకంగా పిండి వంటలు సప్లయి చేస్తున్నది.

ప్రతి ఊళ్లోనూ సాధారణంగా మంచి స్వభావం గలవారు ఉంటూనే వుంటారు. అటువంటి వారు భయ గ్రస్తులై నప్పుడో, స్వీయ ప్రయోజనాలకు పెద్ద దెబ్బ కలుగ నున్నప్పుడో తప్ప, ఇతరులకు హాని చెయ్యరు. మా ఈజెల్ డార్ఫ్ లో కూడా ఇటువంటి సుస్వ

కావులు లేకపోలేదు. అయితే నేం? ఇవి మామూలు రోజులు కావు. మంత్ర గత్తెల భయం దేశమంతటా వ్యాపించి వుంది. భయ వివశులైన మనుషులు సులభంగా కర్కశత్వం అవలంబిస్తారు. అందుచేత మా వూళ్లో మంచివాడు, స్నేహశీలి అని చెప్పుకోదగ్గ వాడొక్కడూ మిగల్లేదు. మార్గెట్ గృహంలో జరిగే విచిత్రాలకు ప్రతివాడూ భయంతో కొయ్యబారి పోసాగాడు. మంత్ర శక్తులవల్లనే ఆ విచిత్రాలన్నీ జరుగుతున్నాయని అంతా రూఢి చేసుకున్నారు. అక్కడికీ మా గ్రామస్థుల్లో కొందరు అమాయిక లైన మార్గెట్, ఉర్సులాలకు దుస్థితి పట్టనున్నందుకు లోలోపల జాలిపడ్డారు. ఆజాలి పైకేమాత్రం వెల్లడించ లేదు. (వెల్లడించటం క్షేమం కాదు)

మార్గెట్, ఉర్సులాలను కొంచెం జాగ్రత్తగా ఉండవలసిందిగా హెచ్చరించాలని మేం ముగ్గురు మిత్రులం అనుకున్నాం. కాని ఎన్నిసార్లు ప్రయత్నించినా ధైర్యం చాలలేదు. గ్రామస్థులు పన్నిన పన్నాగాన్ని బయట పెట్టేస్తే, ఏం కొంప మునుగుతుందో నని భయపడి నోరుమూసుకుని వూరు కున్నాం. ఇలా మేము ముగ్గురం లోలోపల భయపడి ఊరుకున్నట్లు పైకి ఒకళ్లతో ఒకళ్లం చెప్పుకోటానికి కూడా సిగ్గు పడ్డాం. ముగ్గురం కలుసు కున్నప్పుడు మార్గెట్ విషయం తప్ప మిగతా అన్ని విషయాలు మాట్లాడు కునే వాళ్లం. ఈ కృత్రిమ ప్రవర్తనవల్ల మేమెంత

నీచులమై పోయామో మాకే తెలుసు. అందులో, రోజూ మార్గరెట్ ఇంటికివస్తూ, పోతూ, ఆమె ఇంట్లో విందులారగిస్తూ, ఆమెకు రాగల హానిగూర్చి ఒక్క మాట అందించలేక పోవటం మరీ నీచం అనిపించింది. పాపం, మార్గరెట్ వట్టి అమాయకురాలు. మొన్నటివరకూ తనగడప తొక్కని గ్రామస్థులు మళ్లీ ఎందుకు వస్తున్నారో, వచ్చి ఇంట్లో నాలుగు మూలలూ వెయ్యి కళ్లతో ఎలా శోధిస్తున్నారో, తాము చూసిన ప్రతి స్వల్పవిషయమూ మూట కట్టుకుని ఫాదర్ అడాల్ఫ్‌కు ఎలా చేరవేస్తున్నారో ఆమె కాస్తయినా గ్రహించలేదు. వెర్రి బాగుల దానిలా, గ్రామస్థులు తన గడప తొక్కిందే చాలనుకుని మురిసిపోయింది.

గ్రామస్థులు మార్గరెట్ ఇంట్లో పరిస్థితిని ఎప్పటికప్పుడు ఫాదర్ అడాల్ఫ్‌కి తెలియజేసినా ఆయనకి తలాతోకా స్ఫురించలేదు. ఆఇంట్లో గాకపోతే చుట్టుపక్కల దగ్గర్లోనే ఎక్కడో మాంత్రికుడో, మంత్రగత్తో ఉండి ఉండాలి. గ్రామస్థులు ఎంత సోదా చేసినా అటువంటి వ్యక్తి ఎవరూ కంటపడలేదు. మార్గరెట్ గాని, ఉర్సులాగాని, గాట్‌ఫ్రీడ్‌నార్ గాని మంత్రతంత్రాలు జపిస్తున్నట్టుగాని, మాయలు గారడీలు చేస్తున్నట్టు గాని ఎవరూ చూడలేదు. అయితే ఇన్ని రకాల పిండివంటలూ, ఇన్నిరకాల ఫలాలూ, పానీయాలు ఎడతెగకుండా ఎక్కణ్ణించి వస్తున్నట్టు?

గ్రామస్థులు ఏది అడిగితే అది, ఎంత అడిగితే అంత చిటికెలో సప్లయి అవుతోందట. మంత్రగత్తెలు ఇటు వంటి పనులు తేలిగ్గానే చేయగలరు. కాని మంత్రాలు జపించకుండా, ఉరుములు, పిడుగులూ, భూకంపాలు రాకుండా, పిశాచాలు కళ్ళఎదట నాట్యం చెయ్య కుండా ఈ విచిత్రాలేమీ జరగటానికి వీల్లేదే. ఎంత మంత్రగత్తెలయినా ఇంత సునాయాసంగా మాయలు చేయలేరే. ఇదేదో కొత్తరకం ఇంద్రజాలం. ఏపుస్తకం లోనూ ఈమాదిరి మాయల్ని గూర్చి చదవలేదు. మాంత్రిక వస్తువులు మంత్రం ఉన్నంత వరకే బాగా ఉంటాయి; మంత్రం విచ్చిపోయిన తరవాత అవి మట్టి అయిపోతాయి. కాని మార్గరెట్ ఇంట్లో వస్తువులు అలాకాదే! గ్రామస్థులు చాటుగా కొన్ని పిండివంటలు పళ్లు, ఇతరవస్తువులు తెచ్చి ఫాదర్ అడాల్ఫ్ కిచ్చారు. ఆయన శిలువ ముట్టుకుని ఆ వస్తువుల్లో వున్న మంత్రం విచ్చిపోవుగాక! అని ప్రార్థనలు చేశాడు. అవి నిజంగా మాయవస్తువులైతే అంతటితో మట్టై పోవాల్సిందే కాని అవి శుభ్రంగా నిక్షేపంలా ఉండి పోయాయి. మామూలు పదార్థాలు చెడిపోవటానికి ఎంతకాలం పుచ్చుకుంటాయో అవికూడా అంత కాలం పుచ్చుకుని మరీ చెడిపోవటం, కుళ్లిపోవటం ప్రారంభించాయి.

ఫాదర్ అడాల్ఫ్ ఆశ్చర్యానికి మేరలేదు. తనంత గొప్పమేధావినికూడా తల్లకిందులు చేసేస్తున్న

ఈవిచిత్ర సంఘటనలను తలుచుకున్నప్పుడల్లా ఆయనకి పిచ్చెక్కినంత పని అయ్యేది. మంత్రశక్తులవల్ల జరుగుతున్న పని కాదని ఆయన నిశ్చయం చేసుకున్నాడు. కాని అలాగని అక్కడితో ఊరుకుంటే ఎల్లా? ఇదేదో కొత్తరకం మంత్రశక్తి కావచ్చుగా? మరి ఈ సంగతి ఎలా తేల్తుంది? ఆలోచిస్తే ఒక ఉపాయం తట్టింది:

మార్గరెట్ ఇంట్లో అంత వస్తుసామగ్రి ఉన్నదీ అంటే, అది బయటినుండి వచ్చినదై ఉండాలి; లేక ఇంట్లోనే ఎక్కడో తయారైఉండాలి. ఇంట్లోనే అంత సామగ్రీ తయారవుతోందీ అంటే నిస్సందేహంగా అది మంత్రశక్తివల్లనే. భేష్! ఈ ఆలోచన బావుంది; ఇప్పుడు బయటపడకపోతుందా కిటుకు అనుకున్నాడు ఫాదర్ అడాల్ఫ.

## 7

ఇంతలో మార్గరెట్ తన ఇంట్లో విందుచేయ నిశ్చయించింది. నలభై మందికి ఆహ్వానపత్రాలు పంపించింది. విందు ఇంకా వారం రోజు లుంది. ఈ విషయం ఫాదర్ అడాల్ఫ్‌కి తెలియగానే ఆయన సంతోషం వర్ణనాతీతం. 'వెదుకబోయిన తీగ కాలికి తగిలిన'ట్లయింది. రహస్య విచ్ఛేదం చేయటానికి కిదే మంచి తరుణం. మార్గరెట్ ఇల్లు విడిగా ఉన్నది. దానికి చుట్టుపక్కల చాలదూరంవరకూ జనసంచారం ఉండదు. ఈ వారంరోజులూ జాగ్రత్తగా మార్గరెట్ ఇంటిని

నిఘాలో ఉంచితే, విందుకు అవసరమైన పదార్థాలు, వస్తుసామగ్రి బయటినుంచి లోపలికి వెడుతున్నదీ లేనిదీ సులభంగా కనిపెట్టవచ్చు. బయటినుండి లోనికి ఏమీ వెళ్లకపోతే లోపలే ఎవరో సైతాను సహాయంతో వాటిని తయారుచేస్తున్నారన్నమాట.

మార్గరెట్ ఇంట్లోకి మనుషులు వస్తున్నారు, పోతున్నారు. కాని ఎవరూ ఏమీ తీసుకుపోవటమూ లేదు; తీసుకురావటమూ లేదు. సల్భైమంది అతిథులకు వడ్డించటానికి ఎంత సామగ్రి కావాలి? మరి ఒక్క పిసరుకూడా లోపలికి పోలేదే? ప్రతిరోజూ చీకటి పడగానే మార్గరెట్ ఒక బుట్ట తీసుకుని ఎక్కడికో వెడుతూ వున్నమాట నిజమే. కాని తిరిగి వచ్చేటప్పుడు వెంట ఏమీ తీసుకొస్తున్నట్లు కనబడలేదు.

ఆరోజే విందు. అతిథులు కొంచెం ముందుగానే వచ్చి తమ తమ స్థానాలాక్రమించారు. ఫాదర్ అడాల్ఫ్, ఆయన వెనక (ఆహ్వానింప బడకపోయినా) జ్యోతిష్కుడు వచ్చారు. గ్రామస్థులు జ్యోతిష్కుని చెవులో ఊదారు, బయటినుంచి సామగ్రి ఏమీ రాలేదని. విందు ప్రారంభమైంది. బల్లలమీద తళతళ మెరిసే పళ్లెరాలలో, పాత్రలలో గ్రామస్థులెవరూ తిని కని వినని పదార్థాలు, పానీయాలు కొల్లలుగా ఉన్నాయి. అతిథులు వాటిని ఒక్కుమ్మడిగా ముట్టించి నిశ్శేషం చెయ్యసాగారు.

మనస్సు క్షణకాలం. కల్లోల

చుట్టూ చూశాడు. ఈ పదార్థాలన్నీ నిజమైన పదార్థాలుగానే కనిపిస్తున్నాయి. రుచికి, స్పర్శకు, వాసనకు అన్నిటికీ మామూలుగానే ఉన్నాయి. మంత్రాలు లేవు, తంత్రాలు లేవు; ఉరుములు లేవు, మెరుపులు లేవు; అంతవరకూ నిశ్చయమే. ఇది మంత్ర మహిమ అనే విషయంకూడా నిశ్చయమే. సందేహం లేదు; అంతే కాదు; ఇది మామూలుగా చూసే మంత్ర మహిమకూడా కాదు; అపూర్వము, అద్భుతము, అనితరసాధ్యము అయిన మంత్ర మహిమ. ఇది సామాన్యమైన శక్తికాదు. దీన్ని భేదించటానికి జ్యోతిష్కుడు కృతనిశ్చయుడయ్యాడు. తన ప్రయత్నం నెరవేరితే, ప్రపంచం మూల మూలలకూ ఈ విషయం పాకిపోతే, తన పేరు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతుంది. దేశాలన్నీ దిగ్భ్రమ చెంది చూస్తాయి. ఇంత గొప్ప వ్యక్తి, మరెవరూ చేయలేని పనిని చేసిన మహాత్ముడు నిజంగా ఉన్నాడా అని ఆశ్చర్యంతో తర తరాలు తన పేరు చెప్పుకుంటారు. తన భావి కీర్తికి సంబంధించిన ఈ మధుర భావనతో జ్యోతిష్కునికి కైపెక్కింది.

ఉర్వీలా జ్యోతిష్కుణ్ణి వినయంగా సమీపించి, "ఏం కావాలి సార్!" అని అడిగింది.

"నీ యిష్టం వచ్చింది తీసుకురా," అన్నాడతడు.

ఉర్సులా, గాట్‌ఫ్రీడ్ నార్ ఇద్దరూ కలిసి పక్క గదిలోనుంచి కొన్ని పానీయాలు పట్టుకువచ్చారు. జ్యోతిష్కుడి బల్లమీద ద్రాక్షరసం సీసాలు రెండు అమర్చారు. ఒక సీసాలో ఎర్రమధువు, మరొక దానిలో తెల్లమధువు ఉన్నాయి. జ్యోతిష్కుడు అత్యుత్సాహంతో ఎర్రమధువు ఒక గ్లాసులో పోసుకుని తాపీగా తాగాడు; మరొకగ్లాసు కూడా కానిచ్చాడు. తరవాత ఎదురుగా వున్న వివిధ రుచ్యపదార్థాలు ఆబగా లగాయించసాగాడు.

సరిగ్గా ఆ సమయానికే సైతాను అక్కడికి వచ్చాడు. అతడు వస్తాడని నేను ఊహించలేదు. వారం రోజులు పైగా అయింది అతడు వెళ్లిపోయి. ఈరోజున వస్తానని కూడా మాతో చెప్పలేదు. అయినా సరిగ్గా సమయానికే వచ్చాడు. విందు జరుగుతూండటంచూసి, ఆహ్వానం లేకుండా వచ్చినందుకు సిగ్గుపడ్డట్టు నటించి, వెళ్ళిపోబోయాడు. కాని మార్గరెట్ గబగబ వెళ్ళి అతని కరస్పర్శ చేసి ఉండవలసిందని బతిమాలింది. అతడు ఉండటానికి అంగీకరించాడు. మార్గరెట్ అతన్ని సాదరంగా హాల్లోనికి తీసుకుపోయింది. ఆడపిల్లలకీ, విల్హెల్మ్ మీడ్లింగ్‌కు, కొంతమంది గ్రామపెద్దలకు అతన్ని పరిచయం చేసింది. అతణ్ణి, చూడగానే హాలంతటా సంచలనం కలిగింది. ఒకరితో ఒకరు గుసగుసలాడుతూ అతన్ని గురించే చెప్పుకోసాగారు:

"చూశావా? ఆ అబ్బాయి ఎంత బావున్నాడో?"

"మొహంలో ఏమి వర్చస్సు, ఏమి తేజస్సు!"

"అతని పేరేమిటో?"

"ఫిలిప్ ట్రామ్."

"సరిగ్గా సరిపోయింది పేరు. పేరుకు తగ్గట్టే ఉన్నాడు." (జర్మన్ భాషలో 'ట్రామ్' అంటే 'డ్రీమ్'—స్వప్నం—అని అర్థం.)

"ఏం చేస్తూ వుంటాడో?"

"చర్చి ఉద్యోగానికి చదువుతున్నాడట."

"బావుంది. అతని అందం చూస్తే బిషప్ అయిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. అదృష్ట వంతుడు."

"అతని పినతండ్రి దక్షిణాదిన ఎక్కడో ఉన్నాడట. గొప్పధనవంతుడట."

"అలాగా? అబ్బా!"

ఈవిధంగా అతిథులు గుస గుసలుగా చెప్పుకో సాగారు. సైతాన్ను చూడగానే యీ వన్మందీ తన్మయులై పోయారనటంలో సందేహం లేదు. అతడు హాల్లో అడుగుపెట్టిన క్షణం నుంచీ వాతావరణం హఠాత్తుగా చల్లబడింది. బయట తీవ్రంగా ఎండ కాస్తున్నా లోపల ఇలా చల్లపడటానికి కారణ మేమిటో ఎవరూ ఊహించలేక పోయారు. (అది సైతాను సాన్నిధ్యంవల్ల జరిగిన పనేనని మా ముగ్గురికీ తప్ప మరెవరికీ తెలియదు.)

ఈలోగా జ్యోతిష్కుడు మరొక గ్లాసెడు మధువు తాగాడు. అది మూడో గ్లాసు. గ్లాసులో మధువు వంచుకుని సీసా బల్లమీద పెట్టడంలో బల్ల కొంచెం కదిలి సీసాకింద పడబోయింది. వెంటనే పట్టుకున్నాడు. కాని మధువు చాలా వొలికిపోయింది. సీసా ఎత్తిపట్టుకుని చూస్తూ "అరెరే! చక్కటి ఎర్రద్రాక్షరసం. వొలికిపోయింది!" అని విచారించాడు. ఇంతలో హఠాత్తుగా అతని ముఖం ఒక్క వెలుగు వెలిగింది. "త్వరగా! త్వరగా! పెద్దగిన్నె పట్టుకురండి," అని అరిచాడు.

ఉర్సులా గిన్నెపట్టుకొచ్చి ఇచ్చింది. జ్యోతిష్కుడు సీసాను గిన్నెలోకి వంచాడు. అంతకుముందు సీసాలో కొంచెంమాత్రమే ఎర్రమధువు ఉన్నది. అతడు సీసా వంచగానే బుడబుడ శబ్దం చేసుకుంటూ గిన్నెలోకి బోలెడు ఎర్ర మధువు స్రవించసాగింది. గిన్నె క్రమంగా నిండిపోయింది. ఎర్రమధువు గిన్నెనుండి కొంచెం పొర్లిపోయింది కూడాను. ఈ అద్భుతదృశ్యం అతిథులు యూవన్మందినీ ఆశ్చర్యచకితులను చేసింది.

జ్యోతిష్కుడు సీసాఎత్తి అందరికీ చూపించాడు. "చూశారా? సీసా పూర్తిగా వంచేసినా ఇంకా నిండుగా వుంది," అన్నాడు. అతిథులు నిశ్చేష్టులై వున్నారు. నేను సైతాను వంక చూశాను. అదే క్షణంలో అతడు అంతర్హితుడై పోయాడు. ఫాదర్ అడాల్ఫ్ రపీమని లేచాడు. గొంతెత్తి "ఈ ఇంట్లో

పిశాచా లున్నాయి," అని గర్జించాడు. అతిథులు కెవ్వున కేక వేసి లేచిపోయారు. "ఈ ఇంట్లో పిశాచా లున్నాయి. ఈ ఇంటిని—" అని ఫాదర్ అడాల్ఫ్ ఏదో అనబోయాడు. ఆయన నోరు హఠాత్తుగా మూసుకు పోయింది. ఒక్కమాట బైటికి రాలేదు.

ఆక్షణంలో సైతాను నాకు మళ్లీ కనిపించాడు; ఉల్లి పొరలాగ గాలిలో తేలుతూపోయి జ్యోతిష్కుడి శరీరంలో ఏకమై పోయాడు. జ్యోతిష్కుడు చెయ్యెత్తి అధికార స్వరంతో, పారిపోబోతున్న గ్రామస్థులను ఆజ్ఞాపించాడు: "ఆగండి. కదలకండి." అందరూ ఉన్న చోటే ఆగిపోయారు. "గరాటీ పట్టుకురండి," అని అరిచాడు. ఉర్సులా గడగడ వణికిపోతూ రాటీ తెచ్చి ఇచ్చింది. జ్యోతిష్కుడు గరాటీ సీసాలో పెట్టి ఇందాక మధువుపోసిన గిన్నె ఎత్తి అదంతా సీసాలో పోశాడు. సీసానిండా అదివరకే మధువున్నది. అయినా గిన్నెలోని మధువంతా సీసాలోకే పోయింది. మధు వంతా ఈ విధంగా సీసాలోకి ఓడ్చాక జ్యోతిష్కుడు అందరికేసీ గర్వంగా చూసి "హాహ్హాహ్హా" అని వికటాట్ట హాసం చేశాడు. "హు. ఇదో లెక్కా, పత్రమా, జమా? ఇది ఎవరైనా చేయగలరు. నేను తలుచుకుంటే ఇంతకంటే గొప్ప తమాషాలే చెయ్యగలను," అని మళ్ళీ నవ్వాడు.

"ఓయి దేవుడోయ్ ! ఈయనకి దెయ్యం పట్టింది," అంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు. అతి

థుల ముఖాలు భయంతో తెల్లగా పాలిపోయాయి. ఒక్క పరుగున గుమ్మంకేసి దూకి వెనక్కి తిరిగి చూడ కుండా అంతా పారిపోయారు. ఒకళ్లనొకళ్లు తోసు్కకుంటూ, ఎటు పోతున్నదీ చూసుకోకుండా తలోక దారిగా పోయి వీధిలోపడి పరిగెత్తారు. ఒక్క నిమి షంలో ఇల్లంతా ఖాళీ అయింది. మేము ముగ్గురు మిత్రులం, విల్హెల్మ్ మీడ్లింగ్, ఉర్సులా, మార్గరెట్, గాట్‌ఫ్రీడ్ మాత్రం ఉన్నచోటనే పాతుకుపోయాము. ఇప్పుడు జరిగిన విచిత్రసంఘటనలోని రహస్యం మాకు ముగ్గురికే తెలుసు; ఏమీభయపడవద్దనీ, ఇది సైతాను ప్రభావమేనని చెప్పి వారికి ధైర్యం కలిగించా లను కున్నాం, గాని నోరు మెదల్చలేకపోయాము. సమ యానికివచ్చి మార్గరెట్‌ను ఆదుకున్నందుకు సైతాన్ను మనసులోనే అభినందించాం. అతడు గనక రాకపోతే ఫాదర్ అడాల్ఫ గ్రామస్థులచేత ఏం చేయించేవాడో తెలియదు.

అతిథులంతా ఎవరిదోవన వారు పారిపోవటం, తనఇల్లు పిశాచావిష్టమైనదని ఫాదర్ అడాల్ఫ ఆరో పించటం—ఇదంతా తలుచుకుని మార్గరెట్ కంటికి మంటికి ఏకధారగా ఏడవసాగింది. మీడ్లింగ్ చేష్టలు దక్కి శిలా ప్రతిమవలె కూర్చున్నాడు. ఉర్సులాస్థితి కూడా అలాగే వుంది. గాట్‌ఫ్రీడ్ నార్ సంగతి చెప్పనే అక్కర్లేదు. మంత్రగత్తెల కుటుంబానికి చెందిన మనిషి గనక ఇదంతా తనపనేనని ఎవరేప్పుడు

ఆరోపిస్తారోనని గజగజ వణికి పోతున్నాడు. ఆగ్నెస్ పిల్లి అమాయికంగా అక్కడికి వచ్చింది. ఉర్సులాను ప్రేమగా నాకింది. కాని ఉర్సులా భయపడి వెనక్కి తగ్గింది. ఆపిల్లి దెయ్యాల పిల్లేమోనని ఆమెకు లోపల అనుమానం. కాని అటువంటి పిల్లితో జగడం పెట్టు కొనే ధైర్యంలేక ఊరుకుంది. మా ముగ్గురు మిత్రులికీ ఆపిల్లి సంగతి తెలుసుగనక దాన్ని దగ్గిరికి చేర దీశాము. ఆపిల్లి మంచిది కాకపోతే సైతాను దానిపై కరుణ చూపించి ఉండడు. (ధర్మా ధర్మ విచక్షణలేని ఏ ప్రాణి అయినా సైతాను దృష్టిలో మంచిదే)

ఇక అతిథుల సంగతి. చెల్లా చెదరైన అతిథులు గావు కేకలు పెట్టుకుంటూ బజార్లలో పరిగెత్తారు. ఆ కేకలు విని గ్రామ ప్రజలు యావన్మందీ సంగతేమిటో తెలియక కంగారుగా రోడ్లమీదకొచ్చి గుంపులు గూడారు. భయంతో కొయ్యబారి పోయారు. ఇంతలో ఫాదర్ అడాల్ఫ వచ్చాడు. జనం వొత్తిగిలి ఆయనకు దోవ ఇచ్చారు. ఆయనవచ్చిన కాసేపటికి జ్యోతిష్కుడు తన లో తను ఏమిటో గొణుక్కుంటూ వొచ్చాడు. అతన్ని చూస్తూనే అందరినోళ్లూ బిగుసుకు పోయాయి. దూరంగా తప్పుకున్నారు. అతనికేసి తేరి చూడటానికే భయపడ్డారు. ఆడవాళ్లు కొందరు మూర్ఛిల్లారు. అలా అతడు ముందుకు సాగిపోయిన తరవాత జనం అతన్ని కొంత దూరం నుంచి వెంబడించారు. జ్యోతిష్కుడు విందులో చేసిన విచిత్రాలు తెలియనివాళ్లు అడిగి

తెలుసుకొన్నారు. ఈవిధంగా గ్రామమంతా ఆవిషయం క్షణాలో అల్లుకుపోయింది. అల్లుకుపోవటమే కాదు— ఆనోటా ఆనోటాపడి గోరంతలు కొండంతలుగా విస్తరించినై. చివరికి జ్యోతిష్కుడు సీసాడు మధు వుతో ఒక పెద్ద పీపా నింపాడన్నీ, ఆపీపాడు మధువూ తిరిగి సీసాలోకి వంచాడన్నీ కథలు బయలుదేరాయి.

జ్యోతిష్కుడు అలాపోయి పోయి మావూరి పెద్ద బజారు చేరాడు. అక్కడ గారడీ వాడొకడు గారడీ చేస్తున్నాడు. వాడు మూడు ఇత్తడి బంతులు ఒకదాని వెనుక ఒకటిగా గాలిలోకి ఎగరేస్తూ, పట్టు కుంటూ తనవిద్య ప్రదర్శిస్తున్నాడు. జ్యోతిష్కుడు సరాసరి గారడీవాని దగ్గిరికెళ్ళి ఆ బంతులు తీసు కున్నాడు. తన వెంట వచ్చే గుంపు నుద్దేశించి "పాపం ఈ బీదగారడీ వాడు పొట్ట కూటికోసం ఈ ముష్టివిద్య కాస్త నేర్చుకున్నాడు. రండి. మీకు నావిద్య చూపిస్తాను," అన్నాడు.

అని మూడు బంతులూ ఒకదాని వెనక ఒకటి అతి వేగంగా ఎగరేస్తూ పట్టుకుంటూ, కోడిగుడ్డు ఆకారంలో ఒక వృత్తం ఏర్పడేట్టు చేశాడు. తరవాత బంతుల సంఖ్య క్రమంగా హెచ్చింది. నాలుగు, అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది, ఈవిధంగా ఎక్క ణ్ణించి వచ్చాయో తెలియకుండా వంద బంతులు తయారయ్యాయి. ఇన్నిటినీ గాలిలో ఆడిస్తూంటే ఇందాకటి కోడిగుడ్డు ఆకారపు వలయం బ్రహ్మాండ

మైన పరిమాణానికి పెరిగింది. బంతులాడిస్తున్న జ్యోతి ష్కుని చేతులు ఎప్పుడు బంతిని పట్టుకుంటున్నాయో, ఎప్పు డెగరేస్తున్నాయో కనిపించలేదు. అసలు ఆ వేగానికి అతని చేతులుకూడా కనిపించలేదు. కొంత సేపటికి అతడు చేతులు కట్టుకుని పైకి చూస్తూ బంతుల్ని వాటంతటవాటినే తిరగమని ఆజ్ఞాపించాడు. అతని ఆజ్ఞ ప్రకారమే అవి గాలిలో వేగంగా తిరగ సాగాయి. ఎండలో ధగ ధగ మెరుస్తూ నిరాధారంగా తిరిగే ఆ ఇత్తడి బంతులు చూస్తుంటే అది చూసి తీర వలసిన దృశ్యం అనిపించింది. రెండు నిమిషాలైన తర వాత "చాలు" అన్నాడు. వెంటనే వలయం విడిపోయి బంతులు చెల్లా చెదురుగా కింద పడ్డాయి. అవి ఎక్కడ పడితే అక్కడ జనం భయ భ్రాంతులై దూరంగా పారిపోయారు. వాటిని ముట్టుకుంటే చచ్చి పోతా మేమో అన్నంత భయపడ్డారు. వారి భయం చూసి జ్యోతిష్కుడు హేళనగా నవ్వాడు. పిరికి దద్దమ్మలు, అని తిట్టాడు.

ఆపక్కనే గారడీవాడు రెండు గడకర్రలు పాతి వాటికి ఎత్తుగా ఒకతాడు బిగించి కట్టాడు. అది చూశాడు జ్యోతిష్కుడు. "ఈగారడీ వాడు ఈతాడు మీాద ఎంతో కష్టపడి అటూ ఇటూ నడవటం మీారు చాలసార్లు చూసి వుంటారు. ఇప్పుడు నేను చేసే తమాషా చూడండి," అంటూ జ్యోతిష్కుడు 'హుప్' అని గాలిలో కెగిరి తాడుమీాద నుంచు

న్నాడు. రెండుకళ్లూ చేతులతో మూసుకుని ఒంటి కాలితో ఈ చివరనుంచి ఆ చివరకి గెంతుతూ పోయాడు. మళ్లీ అలాగే వెనక్కి గెంతుతూ వచ్చాడు. ఇలా కొన్నిసార్లు చేశాక తాడుమీదనే పిల్లిమొగ్గలు వేశాడు. మొత్తం ఇరవైఏడు మొగ్గలు వేశాడు.

జనం ఈ దృశ్యం చూసి ఆశ్చర్య చకితులయ్యారు. జ్యోతిష్కుడు ముదివగ్గు. కర్ర పట్టుకోందే తిన్నగా నడవ లేనంత బలహీనుడు. అటువంటి వాడు ఇలా గెంతటం, మొగ్గలెయ్యటం చూసి ఏమనుకో డానికీ తోచలేదు. చివరికి జ్యోతిష్కుడు తాడుమీద నుంచి కిందికి దూకి కర్ర పట్టుకుని నేరుగా తన నివాసంకేసి మెల్లిగా నడిచిపోయాడు. అప్పటికి జనానికి స్పృహ వచ్చింది. అంతా దీర్ఘనిశ్వాసాలు విడిచి, కళ్లు నులుముకొని ఒకరి నొకరు చూసుకున్నారు. "ఇదంతా నిజమా కలా? నేనేనా చూసింది, నువ్వు కూడా చూశావా?" అని ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు. ఆఖరికి గుంపు విడిపోయింది. గ్రామస్థులు జంటలు జంటలుగా ఒకరి కొకరు ఆనరాగా బుజాల మీాద చేతులు వేసుకుని ఎవరిళ్లకు వారు వెళ్ళిపోయారు.

మేము ముగ్గురం మా తండ్రుల వెనకే నడిచాం. వారేం మాట్లాడు కుంటారో వినాలనుకున్నాం. మా ముగ్గురి తండ్రులూ మా ఇంటిలోనే సమావేశ మయ్యారు. మేము కూడా వారి పక్కనే

కూర్చున్నాం. వారు ముగ్గురూ గాఢ విచారంలో మునిగి వున్నారు. ఈ విచిత్ర సంఘటనలను బట్టి చూస్తే మా గ్రామానికేదో ప్రళయం ముంచుకు రాబోయే సూచనలు కనిపిస్తున్నాయని వారు అను కున్నారు. మా నాన్న ఇలా అన్నాడు:

"ఫాదర్ అడాల్ఫ్ చూశారా? ఏదో మాట్లాడటానికి నోరు తెరిచాడు. తెరిచిననోరు తెరిచి నట్టే వాగ్బంధమై పోయింది. ఇంతవరకూ ఏ మంత్ర గత్తెలయినా సామాన్య జనం మీదనే తమ ప్రభావం చూపించేవారు. ఇప్పుడు దేవుడి సేవకులైన మతగురు వుల్ని కూడా లెక్క చెయ్యటంలేదు. కాలం మారి పోయింది. ఇదంతా ఏదో వినాశనానికే వచ్చింది. పైగా ఫాదర్ అడాల్ఫ్ మెళ్లో శిలువబిళ్ల ఉన్నది కూడాను."

"అవునవును. మేమూ చూశాం. అది వున్న ప్పటికీ లెక్కలేక పోయింది," అన్నారు మిగతా ఇద్దరూ.

"ముందేం జరుగుతుందో. ఇప్పటివరకూ మన్ని రక్షించేది చర్చేనని నమ్ముకున్నాం. అది కూడా ఓడి పోయింది."

"అవును. ఓడిపోయింది. దేవుడు మన్ని విసర్జిం చాడు. దేవుడు మన్ని వొదిలేసి వెళ్లిపోయాడు."

"అయితే మన కింకెవరు దిక్కు" అన్నాడు సెప్పీ తండ్రి.

"మనం దిక్కులేని పక్షుల మయ్యాము. మనకి వినాశకాలం సమీపించింది," అని నికొలాస్ తండ్రి జడ్జిగారు అన్నారు.

"మన ఊళ్లో ఇలా జరిగిందని దేశమంతా తెలుస్తుంది. మంత్రగత్తెల పలుబడిలో వున్న మన గ్రామాన్ని అంతా వెలి వేస్తారు. మనవూరికి బయటి వారెవరూ రారు; మనతో సంబంధాలు తెంచుకుంటారు. ఇక మనవాళ్లు కుక్కల కెరుక," అని సెప్పీ తండ్రి హోటల్ యజమాని అన్నాడు.

"అవును. అంతేకాదు. అన్నిటికంటే ఘోరం ఇంకోటుంది..." అని చెప్పలేక ఆగిపోయాడు మా నాన్న.

"ఏమిటది?" అని మిగతా ఇద్దరూ వాణికి పోతూ అడిగారు.

"పోప్ కూడా మన గ్రామాన్ని వెలిపెట్టవచ్చు!"

ఈమాటలు పిడుగుపాటు లాగ పనిచేశాయి. స్పృహతప్పి పడిపోయి నట్లయ్యారు మా తండ్రులు ముగ్గురూ. పోప్ చేత వెలివెయ్య బడటం కంటె దారుణ దుర్గతి ఏ గ్రామానికీ పట్టదు. ఈ దుర్గతి తప్పించటం ఎలాగా అని ముగ్గురూ తలలు బద్దలు కొట్టుకున్నారు. అనేక విధాల చర్చించారు. అనేక మార్గాలు ఆలోచించారు. కాని ఏదీ నచ్చలేదు. ఆ మధ్యాహ్నమంతా యోచించినా సమస్య తెగలేదు.

తెగేట్టు లేదని నిశ్చయించుకుని, బరువెక్కిన గుండె లతో ఇళ్లకు వెళ్లిపోయారు.

వారు వెళ్ళిపోకముందే నేనొక్కణ్ణే అవతలికి జారుకున్నాను. మార్గరెట్ ఇంటికి వెళ్లి అక్కడేం జరుగుతోందో చూడాలను కున్నాను. దోవలో పరి చితులైన గ్రామస్థులనేకులు ఎదురు పడ్డారు. కాని ఎవరూ మాట్లాడలేదు. మాట్లాడే స్థితిలో కూడా లేరు. స్వప్నంలో నడుస్తున్న మాదిరిగా శూన్యంగా చూస్తూ ఎటో నడుస్తున్నారు. వారిని చూస్తే జాలి వేసింది.

మార్గరెట్ ఇంట్లో శ్మశాన వాతావరణం ఏర్ప డింది. మార్గరెట్, మిాడ్లింగ్ ఒకే సోఫాలో కూర్చు న్నారు. కాని ఒకరితో ఒకరు మాట్లాడటం లేదు. విచారంగా చూస్తూ కూర్చున్నారు. మార్గరెట్ కళ్లు ఏడ్చి ఏడ్చి ఎరుపెక్కి వున్నాయి. ఆమె నన్ను చూసి ఇలా అన్నది:

"మిాడ్లింగ్‌ని వెళ్ళిపొమ్మని ఇందాకణ్ణించీ చెబుతున్నాను. ఇక ఇక్కడికి రావద్దన్నాను. మాతో సంబంధాలు పెట్టుకోవద్దన్నాను. అతడు వినటంలేదు. మాయిల్లు పిశాచాల ఏలుబడిలో వుంది. మాకెల్లాగూ నరకం తప్పదు. ఈ అమాయకుడు కూడా ఎందుకు నరకం కొని తెచ్చుకోవాలి? నామిాద ప్రేమ వుంటే ఉండవచ్చును గాని నాతోపాటు నరకంలో పడిపో వాలని ఎక్కడుంది?"

మిాడ్లింగ్ వెళ్లనంటే వెళ్లనన్నాడు. ఆమె ఎక్కడుంటే అక్కడే ఉంటానన్నాడు. ఆమెకు అపాయం వస్తే తనకూ రానిమ్మన్నాడు. ఆమాటలు విని మార్గెరెట్ మళ్ళీ ఏడ్చింది. ఆదృశ్యం చాలా జాలి గొలుపుతోంది. వెళ్ళిపోదామా అనుకుంటున్నాను. ఇంతలో ఎవరో తలుపుకొట్టారు. సైతాను లోపలికి వచ్చాడు. అతడు రాగానే గాలి చల్లబడింది. మధ్యాహ్నపు ఎండలో వెన్నెల కలసినట్టయింది. సైతాను మునపటి కంటె సుందరంగా, సంతోషంగా ఉన్నాడు. అతన్ని చూస్తూనే అందరూ క్షణకాలం తన్మయులై పోయారు. సైతాను ఇందాకటి విషయాలు స్మరించ నైనా స్మరించకుండా, అవేమిా జరగనట్టే మాట్లాడ సాగాడు. ముందు సంగీతం గూర్చి మాట్లాడాడు. సంగీతం మాట వినగానే మార్గెరెట్ తన దుఃఖం మరిచిపోయి ఉత్సాహితురాలై సంభాషణలోకి దిగింది. సైతాను అలా ఎంతసేపో సంగీతకళ గూర్చి ఉప న్యాసం చేశాడు. సంగీతంమిాద అంత అద్భుతంగా, విశదంగా, విజ్ఞాన వంతంగా మాట్లాడటం మార్గెరెట్ ఎప్పుడూ వినలేదు. సైతానుపై ప్రేమవొలికించేస్తు న్నట్టు చూసింది. ఆచూపు గమనించి మిాడ్లింగ్ మూతి ముడుచుకున్నాడు. తన ప్రియురాలు మరొకరి కేసి అంత గౌరవంతో చూడటం అతనికి బాధగా ఉండదూ?

తరవాత సైతాను కవిత్వం మీద మరికొంత సేపు సంభాషించాము. మహాకవుల రచనలు కొన్ని చదివి వినిపించాను. మార్గరెట్ మళ్ళీ ఇందాకటిలాగే ప్రేమగా చూసింది. మళ్లీ మోడ్లింగ్ తిన్నా డమన్యాము. ఈసారి మార్గరెట్ కనిపెట్టింది తన ప్రియు డికి కోసం తెప్పించానని. ఎంతో నొచ్చుకుంది.

ఆ రాత్రి నేను మామూలుగా పక్కమీద పడు కున్నాను. వాన కురుస్తోంది. కిటికీ తలుపుల మీద వాన జల్లు సంగీత ధ్వనులు చేస్తోంది. ఆ సంగీతం జోల పాడినట్లయి అలాగే నిద్రపోయాను. ఒకరాత్రి వేళ సైతాను నా దగ్గరకివచ్చి లేపాడు.

"నాతోరా. అల్లల్లా తిరిగొద్దాం. ఎక్కడికి పోదాం చెప్పు," అన్నాడు.

"నీ యిష్టం, ఎక్కడికైనా సరే."

వెంటనే కళ్లు మిరుమిట్లు గొలిపే సూర్య కాంతిలో ఉన్నాను.

"ఇది చైనా!" అన్నాడు సైతాను.

చైనా అనగానే ఆశ్చర్యం, సంతోషం, గర్వం ఒక్కసారిగా కలిగాయి. మా వూరునుంచి ఎంత దూరం వచ్చానో! నా కంటె అదృష్టవంతుడు మర లేడనిపించింది. మావూళ్లో అందరికంటె ఎక్కువ దేశాలు తిరిగినమనిషి ఒకడున్నాడు. వాడికి తను గొప్ప దేశసంచారినని చచ్చేగర్వం. కాని వాడు కూడా ఇంతదూరం తిరిగి వుండడు. వాడిజన్మలో

ఇంతదూరం రాలేము కూడాను. నేను కొన్నివేల మైళ్లదూరంలో ఉన్న చైనాదేశం కూడా వెళ్లి వచ్చానని తెలిస్తే వాడిగర్వం పటాపంచలౌతుంది.

చైనాసామ్రాజ్యం యావత్తూ ఒక అరగంటలో పర్యటించాం. చూడవలసిన విశేషాలన్నీ చూశాం. కొన్నికొన్ని దృశ్యాలు అద్భుతంగా, కొన్ని దృశ్యాలు అసహ్యంగా ఉన్నాయి. అలా తిరిగి తిరిగి కొంతసేపటికి ఒక కొండ శిఖరాన వ్రాలి కూర్చున్నాం. మేము కూర్చున్న చోటినించి ఎన్నో కొండలు, కోనలు, నదులు, మైదానాలు, పట్టణాలు, పల్లెలు, ఒకవైపున సముద్రం కనిపిస్తున్నాయి. ఆ విశాలమైన దృశ్యం కళ్లకి పండుగగా, హృదయానికి వెన్నెలగా, ఎంతో ప్రశాంతంగా ఉన్నది. ఈమాదిరిగా అనుకున్నప్పుడల్లా దూరదేశాలకి వెళ్ళగలిగితే, ఎంత బాగుండును! ఎప్పుడూ కూపస్థ మండూకాలవలె ఉన్నచోటే ఉండకుండా కొత్తచోట్లకి వెడుతూ ఉండటంవలన జీవితభారం ఈబుజం మీంచి ఆ బుజంమీదికి మార్చుకున్నట్టయి మనస్సు ఎంత తేలికపడుతుంది!

నేనూ సైతాను కబుర్లలోకి దిగాము. సైతాను ప్రవర్తన ఏవిధంగానైనా సంస్కరించాలనే ఆలోచన కలిగింది. అతడు చేస్తున్న పనులు నాకేమీ నచ్చ లేదనీ, అతనిమూలంగా ఎందరు కష్టాలపాలౌతున్నారో ఆలోచించుకోమనీ చెప్పాను. అతడు మాన

వుల కపకారం చెయ్యాలని ఉద్దేశించకపోయినా, చేసే పనులవలన దుష్ఫలితాలు మాత్రమే కలుగుతున్నాయని చెప్పాను. ఏ పని చేస్తే ఎవరికే ఫలితాలు కలుగుతాయో ఆలోచించుకుని మరీ పనులు తలపెట్టమని అన్నాను.

సైతాను నవ్వాడు: "ఏమిటి నువ్వనేది? పిచ్చివాడా! నేను చేసే పనుల ఫలితాలు నాకు తెలియవంటావా? బలేవాడివే!"

"నీ పనులవల్ల కలిగే ఫలితాలు నీకు ముందే తెలిసేటట్లయితే, ఇవన్నీ ఎందుకు చేస్తున్నట్లు?"

"చెప్పమంటావా? విను. మీ జాతి చిత్రమైన జాతి. మానవుడు యంత్రంలాంటివాడు. ఈయంత్రంలో ఒకభాగం దుఃఖాన్ని తయారు చేస్తుంది. మరొక భాగం సంతోషం తయారుచేస్తుంది. చాలామందికి ఈయంత్రం సుఖదుఃఖాలను సరిసమానంగా తయారు చేసి పెడుతుంది. ఒకవేళ సమానంగా తయారు చెయ్యటానికి వీల్లేకపోతే దుఃఖాన్నే ఎక్కువ తయారు చేస్తుందిగాని సుఖాన్ని కాదు. కొందరు మనుషుల తత్త్వాన్ని బట్టి దుఃఖం ఉత్పత్తిచేసే యంత్రభాగానికి ఊపిరి సలపకుండా పని పడుతుంది. అటువంటివాళ్లు జీవితంలో సంతోషంఅంటే ఏమిటో ఎరక్కుండానే బతుకుతారు, చస్తారు. వాళ్లేం ముట్టుకున్నా, ఏం చేసినా దుఃఖమే తయారవుతుంది. వాళ్ళకి జీవితం గుదిబండగా, సర్పబంధంగా, శాపఫలితంగా అని

పిస్తుందిగాని దేవుడిచ్చిన వరం అనిపించదు. అటు వంటివాళ్లు ఉండరంటావా? ఓ. కావలసినంతమంది ఉన్నారు. ఒక్కొక్కసారి ఒక్కొక్క మనిషికి ఒక గంటసేపు అనుభవించిన ఆనందానికి బదులుగా కొన్ని సంవత్సరాల బాధామయ జీవితం లభిస్తుంది. ఏం, తెలిసిందా? ఇప్పుడు చెబుతావిను. మీ గ్రామ ప్రజలు నాకే మీ కారు. నాదృష్టిలో వాళ్లకేమీ విలువలేదు. ఒప్పుకుంటావా?"

"కావచ్చు," అన్నాను ముక్తసరిగా.

"కావచ్చేమిటి? నిజంగానే వాళ్ళకీ నాకూ ఎక్కడా సాపత్యంలేదు. వాళ్ళకీ నాకూ ఆకాశ మంత తేడా వున్నది. ఉదాహరణకి చెబుతాను, వాళ్లకి మెదడు లేదు."

"మెదడు లేదూ?" అని ఆశ్చర్యపోయాను.

"అబ్బే. ఏకోశానా మెదడు లేదు. నీకు ముందు ముందు వివరించి చెబుతాను, మనిషి గర్వంగా చెప్పు కునే మనస్సు అనే పదార్థం ఏమిటో, ఆ అంధకార అయోమయకూపం ఎలా వుంటుందో—అన్నీ తర వాత వర్ణిస్తాను. మానవులకీ నాకూ పోలిక లేదు. వాళ్లకేవో క్షుద్రభావాలు, క్షుద్రసంతోషాలు, దుఃఖాలు, గర్వాలు, అతిశయాలు వస్తూంటాయి, పోతూంటాయి. వాళ్ల క్షుద్రజీవితం ఒక చిరునవ్వు, ఒకనిట్టూర్పు, ఒక రెప్పపాటులాంటిది. వాళ్లకి అసలు జ్ఞానంలేదు, ధర్మాధర్మ విచక్షణజ్ఞానంతప్ప. ఈ చీ

మనిచూాడు. దీన్ని చూసి ఒకఏనుగు ఏమనుకుంటుంది? ఈచీమ సుఖంగా ఉందో, కష్టాల్లోవుందో, దానికి పెళ్లాంబిడ్డలు, తలిదండ్రులు ఉన్నారో లేదో, మంచి ఉద్యోగం చేస్తోందో లేదో, దాని రాజకీయ ఆశయాలు సఫలం అవుతాయో లేదో, దానికి పడిసెం పట్టిందో, తలనొప్పి వచ్చిందో—ఇవన్నీ ఆలోచిస్తుందా ఏనుగు? ఊహూ. ఏనుగు బ్రహ్మాండమైన జంతువు. దానికి చీమ జీవితం గూర్చి ఆలోచించవలసిన అగత్యంలేదు; తన ఆలోచనలను చీమ పరిమాణానికి కుదించుకోవలసిన అవసరం దానికి లేదు. అంతేగాక చీమమీాద కోపగించుకుని ద్వేషించవలసిన పనికూడా లేదు. నాకూ్కడా మానవునిపై కోపం లేదు. ఏనుగుకు చీమపై లక్ష్యంలేదు. నాకూ్కడా మానవునిపై లక్ష్యంలేదు.

ఏనుగు వంద ఏళ్లు బతుకుతుంది. చీమ ఒక రోజే బతుకుతుంది. బలంలో, బుద్ధిలో, ఠీవిలో ఏనుగుకూ, చీమకూ ఎంతో భేదం ఉన్నది. మానవుణ్ణి నన్నూ పోలిస్తే చీమకూ ఏనుగుకూ గల భేదంకంటే ఎన్నోరెట్లు భేదం కనిపిస్తుంది.

మానవుని మనస్సు బహు వోపిగ్గా ఆ ముక్కా యీ ముక్కా కలిపి చీకిరిబాకిరిగా ఏదో తయారుచేస్తుంది. కాని నా మనస్సు సృష్టిస్తుంది! అర్థమైందా, సృష్టించడమంటే ఏమిటో? ఏది కావాలంటే అది, ఒక చిటికెలో సృష్టిస్తుంది! ఏ ముడివస్తువూ

అక్కర్లేకుండా సృష్టిస్తుంది. ఘన, ద్రవ, వాయు పదార్థాలు, రంగులు—ఏది పడితే అది, భావన అనే శూన్యంలోంచి సృష్టిస్తుంది. మానవుడు సిల్కు దారం గూర్చి భావిస్తాడు; అది తయారు చేసేందు కొక యంత్రంగూర్చి భావిస్తాడు; ఎంతో శ్రమపడితేనే గాని యంత్రమూ, సిల్కు దారమూ తయారు కావు. నేనో? తలుచుకోవటం, తయారుకావటం రెండూ ఒకేసారి జరుగుతాయి.

నేను ఒక పద్యం, ఒక రాగం, ఒక చదరంగం ఆట ఏది తలుచుకున్నా తక్షణం అది తయారైపోతుంది. నాది దివ్య మేధస్సు. దానికి అందని విషయం లేదు. నా దృష్టిని అరికట్టగలది ఈ విశ్వంలో లేదు. రాళ్ల లోంచి అవతలికి చూడగలను. గాఢాంధకారం నాకు పట్టపగలు అవుతుంది. ఒక పుస్తకం తీసుకుంటే పేజీ తరవాత పేజీ చదవ నక్కర్లేదు. అట్టలోంచి చూశానంటే లోపలి విషయాలన్నీ ఒక్క క్షణంలో ఆకళించుకోగలను. ఆకళించుకున్నదాన్ని పదిలక్షల సంవత్సరాలకైనా మరిచిపోను. పక్షి, చేప, పురుగు ఏదీ కూడా నాకు తెలియకుండా రహస్యంగా ఏ పనీ చెయ్యలేదు. ఒక పండితుడు అరవయ్యేళ్ళపాటు శ్రమపడి నేర్చుకున్న విజ్ఞానాన్ని అతని బుర్రలోకి ఒక్క చూపు పోనిచ్చి అదంతా నాది చేసుకోగలను. అతడు తను నేర్చుకున్న విజ్ఞానం

మరిచిపోవచ్చు. కాని అతని దగ్గిర్నించి కొట్టేసిన నేను మాత్రం మరిచిపోను.

బహుశా ఇప్పుడు కొద్దిగా సన్నర్థం చేసుకుం టున్నా వనుకుంటాను. చెబుతా విను. ఇందాక చెప్పిన ఏనుగు ఉందే! అది ఖర్మంచాలక చీమ అంటే ఇష్టపడివుండచ్చు; అంతే గాని చీమను ప్రేమించటం మాత్రం దానివల్ల కాదు. ఏనుగు ఏనుగులనే ప్రేమిం చగలదు. దేవతలు దేవతలనే ప్రేమించగలరు. దేవ తల ప్రేమ మహోన్నతంగా, మహావిశాలంగా, తేజో న్వితంగా ఉంటుంది. ఒకవేళ దేవతలు మానవుల్ని ప్రేమించటమే తటస్థిస్తే ఆ ప్రేమ మానవుల్ని భస్మీ భూతం చేస్తుంది. ఊహు. మేము మానవుల్ని ప్రేమించ లేము. వారంటే ఇష్టపడవచ్చు. నువ్వు, ని మిత్రు లిద్దరూ, ఫాదర్ పీటర్, నాకెంతో ఇష్టులయ్యారు. మీామీద ఇష్టం మూలంగానే మీ గ్రామస్థులకోసం ఈ పనులన్నీ చేస్తున్నాను.

మీ గ్రామస్థులకి నేను చేసేది చెడుఅని నువ్వను కుంటున్నావు. కాదు. నేను మంచే చేస్తున్నాను. మంచిఅని నీకు తెలియకపోవచ్చు. మీా మానవులకి ఏదిమంచి ఏదచెడ్డ అనేది తెలియదు. ఎందుకంటే వాళ్లు నాలాగా భవిష్యత్తులోకి చూడలేరు. నేను చేసిన పనులమూలంగా మీా గ్రామస్థులకి శుభమే చేకూరుతుంది. కొందరికి వాళ్ల జీవితకాలంలోనూ, మరికొందరికి వారితరవాత తరాల్లోను శుభం కలుగు

తుంది. ఈ శుభానికి కారణం నేనని వారెవ్వరూ గ్రహించలేరు. అంతమాత్రాన అది శుభం కాకుండా పోదు. పిల్లలు మామూలుగా ఆడుకునే ఆట ఒకటుంది. ఇటుకలు తీసుకొచ్చి వాటిని వరసగా నుంచోపెడతారు. ఒక ఇటుకను తోస్తే చాలు, అది తనపక్క ఇటుకను, అది తనపక్క ఇటుకను అలా ఒకదాన్నొకటి తోసుకుంటూ, చివరికన్నీ పడి పోతాయి. మానవజీవితం అలాంటిదే. శిశువు పుట్టగానే మొదటగా చేసేపని, తరవాత చెయ్యబోయే పనులన్నిటినీ నిర్ణయిస్తుంది. ఇటుకలన్నీ పడిపోవటానికి మొదటి ఇటుకపడటం ఎలా కారణమవుతోందో, అలాగే మానవుడు చేసేపనులన్నిటికీ అతడు మొదట చేసేపనే కారణమవుతుంది. నాలాగా భవిష్యత్తులోకి నువ్వుకూడా చూడగలిగితే ఒకమనిషికి జీవితంలో ఏమేమి జరగబోతోందో అంతా చూడగలవు. ఆమనిషి చేసిన మొట్టమొదటిపని తెలిస్తే చాలు, అంతా చెప్పివెయ్యొచ్చు. దానికి తిరుగులేదు."

"అయితే మానవజీవితం ఎలా ఉండాలో శాసించేది దేవుడేనా?" అని అడిగాను.

"కాదు. మనిషిపరిసరాలు, పరిస్థితులే అతని జీవితం నిర్ణయిస్తాయి. మొదటిపని రెండోపనిని, అది మూడోపనిని అలా జీవితాంతంవరకూ చేసే అన్ని పనులనూ నిర్ణయిస్తుంది. ఒకవేళ ఎవరైనా తను చెయ్యవలసిన పనుల్లో ఒకటి చెయ్యలేదనుకో. ఉదా

హారణకి ఒకమనిషి ఫలానారోజున, ఇన్నిగంటల ఇన్నినిమిషాల ఇన్నిసెకండ్లకి, ఒక నూతి వద్దకు వెళ్లాల్సి ఉందనుకో. అతడు వెళ్లలేదనుకో. అతని జీవితం ఆ సెకండునుంచే మారిపోతుంది. నూతివద్దకు వెళితే, అతడు చచ్చిపోయేలోగా చక్రవర్తి కాగలడు అనుకుందాం. నూతివద్దకు వెళ్లలేదు కనుక బిచ్చగాడై కష్టాలపాలు కావలసిరావచ్చు. మరొక ఉదాహరణ: కొలంబస్ అమెరికా కనిపెట్టాడు. అతడు ఏదో కారణంవల్ల ఏదోఒక చెయ్యవలసిన పని చెయ్యలేదనుకో. దానివల్ల అతని జీవితమంతా మారిపోయి ఉండేది. ఏదో మారుమూల ఇటాలియన్ గ్రామంలో, మత గురువుగా ఉంటూ ఎవరికీ తెలియకుండా చనిపోయేవాడు. అమెరికా ఇంకా రెండువందల ఏళ్ళదాకా కనిపెట్టబడకుండా ఉండిపోయేది. ఈసంగతి నాకు తెలుసు. కొలంబస్ జీవితం నేను బాగా పరిశోధించాను. అతని జీవితానికి కొన్ని లక్షల గమ్యస్థానాలు ఉన్నాయి. ఇన్ని లక్షలమార్గాలలోను ఒక్క మార్గంలోనే అతడు అమెరికాకనిపెట్టడం తటస్థిస్తుంది. అతడు మరేమార్గం అనుసరించినా అమెరికా కనిపెట్ట గలిగే వాడు కాడు.

మీరు చేసే పనుల్లో కొన్ని ముఖ్యమైనవనీ, కొన్ని ముఖ్యమైనవి కాదనీ మీరనుకుంటారు. కాని అన్ని పనులూ ఒకే ప్రాముఖ్యం కలవి. నువ్వివ్వాళ ఏమీ తోచక ఒక తూనీగను పట్టుకున్నావనుకో.

రేపు ఒక సామ్రాజ్యం జయించావనుకో. రెండూ నీ జీవితవిధానాన్ని ఒకేవిధంగా తీర్చిదిద్దుతాయి. ఒక దానికంటె ఒకటి ఏమీ గొప్పది కాదు.

అయితే ప్రతిమనిషికీ ఇన్ని లక్షల గమ్యస్థానా లున్నప్పుడు తన ఇష్టమైనది ఎంచుకోవచ్చుగదా అని నువ్వంటావు. కాని అతడు చేరవలసిన గమ్యస్థానం నిర్ణయించేది అతడు కాడు; అతడు జీవితంలో మొట్ట మొదట చేసిన పనే దాన్ని నిర్ణయిస్తుంది. ఒకవేళ ఫలానా పని చెయ్యకూడదని అనుకుంటాడనుకో. ఆ అనుకోవటాన్ని నిర్ణయించేది కూడా అతని మొదటి పనే. ఫలానా పని చెయ్యడనుకో. ఆ చెయ్యకపోవ టాన్ని నిర్ణయించేది కూడా మొదటి పనే."

సైతాను చెప్పింది మహా భయంకరంగా తోచింది.

"అయితే మనిషికి స్వాతంత్ర్యం లేదంటావా?" అని విచారంగా అడిగాను.

"లేదు. తనంతట తను ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు. కాని నేను అతన్ని స్వతంత్రుడు చేయగలను."

ఆశతో తలెత్తి చూశాను.

"నేను మీ గ్రామస్థులనేకుల జీవిత గమ్య స్థానాలు మార్చేశాను," అన్నాడు.

అతనికి కృతజ్ఞత తెలపబోయాను. కాని ఏమన డానికీ తోచక ఊరుకున్నాను.

"ఇంకా కొన్ని మార్పులు చెయ్యదలుచుకున్నాను. లిజా బ్రాంట్ అనే పిల్ల నీకు తెలుసుకదా?"

"ఓ తెలియకేం? మా అమ్మ ఆ పిల్లనిగూర్చి ఎప్పుడూ చెబుతూ వుంటుంది. చాలా మంచిదట, ముద్దొస్తూ వుంటుందట. పెద్దదైతే మాంఛి అందమైన పిల్లగా తయారవుతుందని మా అమ్మ అంటూ వుంటుంది."

"ఆ పిల్ల భవిష్యత్తు మార్చేస్తాను."

"అంటే, బాగు చేస్తావని అర్థమా?"

"అవును, ఆ పిల్ల జీవితం బాగుచేస్తాను. నీ స్నేహితుడు నికొలాస్ లేడూ? అతని భవిష్యత్తు కూడా మార్చేస్తాను."

"అంటే అతని జీవితం కూడా బాగుచేస్తావన్నమాటేగా?"

"అవును."

నా సంతోషానికి మేరలేదు. నికొలాస్ ఎంత గొప్పవాడైపోతాడో నని ఊహాగానం చేశాను. బహుశా సర్వసైన్యాధిపతి అవుతాడేమో, చక్రవర్తి దర్బారులో గొప్పపదవి సంపాదిస్తాడేమో నని భావన చేశాను. ఇలా ఆలోచిస్తుంటే సైతాను నాకేసి చిరునవ్వు నవ్వుతూ చూస్తున్నాడు. నా ఆలోచనలన్నీ సైతాను కనిపెడుతున్నాడని తెలిసి సిగ్గుపడ్డాను. మళ్ళీ ప్రారంభించాడు సైతాను :

"నికొలాస్ జీవితకాలం అరవైరెండేళ్లు."

"బలే," అన్నాను.

"లిజా బ్రాంట్ ఆయుస్సు ముప్ఫయ్ ఆరేళ్లు కాని నేను వారిద్దరి జీవితాలు, ఆయుస్సులూ మార్చే స్తాను. ఇంకా రెండుంబావు నిమిషాల్లో నికొలాస్ నిద్రపోతున్నవాడల్లా మేలుకుంటాడు. వాన కురు స్తూండటం చూస్తాడు. మామూలుగా అయితే అతడు మళ్ళీ అటు తిరిగి దుప్పటి కప్పుకుని నిద్రపోవాలి. కాని నేను అతని కార్యక్రమం మారుస్తున్నాను. అతడు లేచి వానజల్లు పడకుండా కిటికీ తలుపులు మూసేస్తాడు. ఈ కాస్త పని చెయ్యటంమూలంగా అతని యావజ్జీవితం మారిపోతుంది. రేపుపొద్దున అతడు లేవవలసిన టైముకంటె రెండు నిమిషాలు ఆల స్యంగా లేస్తాడు..." అంటూ జేబులోంచి గడియారం పైకి తీశాడు సైతాను. "ఆ, అదుగో నికొలాస్ లేచాడు. కిటికీ మూశాడు. మళ్ళీ దుప్పటి కప్పుకుని పడుకున్నాడు. అతనికి కొత్తజీవితం ప్రారంభమైంది."

ఊపిరి బిగపట్టి సైతాను మాటలు వింటు న్నాను. ఏదో భయంతో వొళ్లు గగుర్పొడిచింది.

"ఆ కొత్తజీవితం ఏమిటంటావా? చెబుతా విను. మామూలుగా అయితే, అంటే, ఇందాక నికొ లాస్ లేచి కిటికీ తలుపు మూయకుండా ఉంటే, నేటికి పన్నెండవరోజున అతడు లిజా బ్రాంట్‌ను రక్షించి ఉండేవాడు. లిజా బ్రాంట్ ఆ రోజున నదిలో మునిగి పోతూ వుంటుంది. నికొలాస్ సరిగ్గా పదిగంటలనాలుగు

నిమిషాలకి అక్కడికి వచ్చి తనుకూడా నదిలో దూకే వాడు. తేలికగా లిజా బ్రాంట్‌ను రక్షించేవాడు. కాని ఇప్పుడు నేను చేసిన మార్పుమూలంగా అలా జరగదు. నికొలాస్ కొన్ని సెకండ్లు ఆలస్యంగా అక్కడికి వస్తాడు. అప్పటికే లిజా బ్రాంట్ ఆఖరిదశలో వుంటుంది. నికొలాస్ నదిలో దూకి ఆమెను వొడ్డుకి లాక్కురాబోతాడు. కాని ఇద్దరూ కలిసి మునిగి చని పోతారు."

"ఓ సైతాన్! సైతాన్! అలా వద్దు. వాళ్ళని రక్షించు. చచ్చిపోనివ్వకు. నికొలాస్ చనిపోతే నేను భరించలేను. అతడు నా స్నేహితుడు. పుట్టినప్పటి నించీ కలిసి మెలిసి ఆడుకున్నాం. అతడు లేకపోతే భరించలేను. లిజా బ్రాంట్‌ను కూడా రక్షించు. ఆమె తల్లి గతి ఏమవుతుందో ఆలోచించు," అని రుద్ధ కంఠంతో అరిచాను. నేనెంత మొత్తుకున్నా సైతాను చలించలేదు.

"నేను చెప్పేది పూర్తిగావిను, థియొడోర్! నేనిలా మార్చకపోతే నికొలాస్ లిజాబ్రాంట్‌ను రక్షించి వుండేవాడు. కాని నీళ్ళలో నానటంమూలంగా అతనికి జలుబుచేసేది. తరవాత మీమానవ జాతికి మామూలుగావచ్చే ఆటలమ్మవచ్చేది. దాని ఫలితాలు జీవితాంతమూ ఉండేవి. నలభై ఆరేళ్ల పాటు పక్షవాతంతో, చెవిటివాడై, మూగవాడై, గుడ్డివాడై, అహోరాత్రాలు మృత్యువు నాహ్వానిస్తూ,

దేవుణ్ణి ప్రార్థిస్తూ మంచానపడి తీసుకునేవాడు. తెలిసిందా? ఈ జీవితం వచ్చేట్టు మళ్లీ వెనక్కి మార్చమంటావా?"

"వద్దు, వద్దు. ఈదీర్ఘవ్యాధిగ్రస్త జీవితంకంటే నదిలో మునిగి చనిపోవడమే మేలు," అన్నాను.

"నేను చెప్పలా? నికొలాస్ జీవితానికి గల లక్షలక్షల గమ్యస్థానాల్లో, ఏదీకూడా కోరదగినంత మంచిదిలేదు. అవన్నీ రోగాలతోనో, కష్టాలతోనో నిండివున్నాయి. నేనతని జీవితాన్ని ఇందాక మార్చకపోతే లిజా బ్రాంట్‌ను రక్షించటం, తత్ఫలితంగా వలపై ఆరేళ్లపాటు మంచానపడి తీసుకుతీసుకు చావటం జరిగేది."

లిజా బ్రాంట్‌ను చనిపోకుండా బతకనిస్తే ఏం జరిగేదో అని లోపల అనుకున్నాను. నా ఆలోచనకు సైతాను సమాధానమిచ్చాడు:

"నదిలో మునిగినందువల్ల ఆమెకూడా పదేళ్ళపాటు రకరకాల జబ్బులతో బాధపడేది. తరవాత పంధొమ్మిదేళ్లపాటు వ్యభిచారిణిగా ఘోరమైన, అవమానకరమైన జీవితం గడిపేది. చివరికి ఉరిశిక్షకు పాల్పడి మరణించేది. పన్నెండురోజుల్లో చనిపోవటం మంచిదంటావా? లేక అవమానభారంతో జీవించటం మంచిదంటావా?"

"నువ్వు చేసిందే మంచిది," అన్నాను.

. . "ఫాదర్ పీటర్ కేసు విచారణకు రాబోతున్నది. అతన్ని విడుదల చేస్తారు. అతను నిర్దోషి అని బోలె డంత ఋజువు దొరుకుతుంది. కేసు కొట్టేస్తారు."

"అదెలా జరుగుతుంది ?" అని అడిగాను.

"నాకు తెలుసు, జరుగుతుంది. అతని మిగిలిన జీవితం సౌఖ్యవంతంగా గడిచిపోతుంది."

ఫాదర్ పీటర్ జీవితం సౌఖ్యవంతం కాగలదని సంతోషించాను. జ్యోతిష్కుణ్ణిగూర్చి అడుగుదా మనుకున్నాను. సైతాను సమాధానమిచ్చాడు :

"జ్యోతిష్కుడికి మామూలుగా అయితే చాలా దీర్ఘజీవితమే ఉంది. బోలెడు కష్టాలుపడతాడు. కాని అతని జీవితంకూడా మార్చేస్తాను. అతనికి హాని చెయ్యాలనే ఉద్దేశం నాకులేదు. అతడెంత చెడ్డవాడై నా అతన్నికూడా బాగుచేద్దామనే అనుకుంటున్నాను. బహుశా అతడు త్వరలో దహనంఅయ్యేట్టుచేస్తాను."

బాగుచెయ్యటమంటే సైతాను అభిప్రాయం తగలపెట్టడమన్నమాట. అతడు దేవత. దేవతలకు ఏది మంచి, ఏదిచెడ్డ అనేదిలేదు. మన మంచిచెడుగు లతో వాళ్ళకి సంబంధంలేదు.

సూర్యకాంతి హాయిగా, మృదువుగా మమ్మల్ని స్పృశిస్తోంది. నేను చెయ్యిజాచాను.

"సైతాన్ ! నాచేతిమీాద సూర్యకాంతి పడు తున్నది. దాన్ని మధుపాత్రగా మార్చు," అని అడి గాను. క్షణంలో నాచేతిలోకి మధుపాత్రవచ్చింది.

"దాన్ని బద్దలుకొట్టు," అన్నాడు.

బద్దలుకొట్టాను. బద్దలైంది.

"చూశావా? ఈ మధుపాత్ర మాయవస్తువు కాదు, నిజమైనది. మీ గ్రామస్థులు ఆ ఇత్తడి బంతులు మాయవనుకున్నారు. వాటిని ముట్టుకోటానికి భయపడ్డారు. ఎంత చిత్రమైన జాతోయ్ మీది? సరే. ఇక పోదామా? నాకు వేరేచోట పనుంది. నిన్ను నీ పక్కమీద పడుకోబెడతాను."

మరుక్షణంలో నేను నా పక్కమీద పడుకుని వున్నాను. సైతాను వెళ్ళిపోయాడు. దూరంనుంచి, వానచినుకుల చప్పుడుగుండా అతని కంఠం వినిపించింది: "సరే. సెప్పీతో చెప్పు. నికొలాస్‌తో చెప్పద్దు. ఇంకెవరికీ కూడా చెప్పకు," అన్నాడు.

నేను అప్పుడే మనసులో అనుకుంటున్నదానికిది సమాధానం.

# 8

ఆ రాత్రి ఎంతకీ నిద్ర పట్టలేదు: ప్రపంచమంతా చుట్టి వచ్చినందుకు, చైనాదేశం చూసి వచ్చినందుకు కలిగిన సంతోషంవల్ల కాదు. ఇంకొకప్పుడెప్పుడైనా అయితే ఆ సంతోషం వల్లనే నిద్ర పట్టకపోయి ఉండును. కాని ఇప్పుడు అది కారణం కాదు. నికొలాస్‌కు పట్టనున్న గతి, తలుచుకున్నకొద్దీ గుండె బద్దలు చేస్తోంది. అడవుల్లో, కొండల్లో, పొలాల్లో

మేము ఆడుకున్న ఆటలు, నదిమీద పడవ షికార్లు, శీతకాలం మంచుమీద పరిగెత్తటాలు, బళ్లోకి వెడుతున్నామని ఇంట్లో చెప్పి, బలాదూరు తిరగటాలు, అన్నీ జ్ఞాపకంవచ్చి కళ్ల నీళ్లు తిరిగాయి. ఇంతవరకూ అతడు మా జీవితంలో భాగస్వామి. ఇప్పుడు తన జాగా ఖాళీచేసి వెళ్లిపోతాడు. అతన్నిక ఎప్పటికీ చూడలేము. రేపు అతన్ని కలుసుకున్నప్పుడు, అమాయికంగా నవ్వుతూ, తుళ్లుతూ, కులాసా కబుర్లు చెబుతూ సందడి చేస్తాడు. కాని అతని అమాయక ఆనందం చూసి నాకు కడుపు తరుక్కుపోతుంది. అతని నెత్తిమీద నల్లటి రెక్కలాడిస్తూ మృత్యువు చుట్టూ ఎగురుతున్నట్టు కనిపిస్తుంది' ఎల్లుండి, అవతెల్లుండి, అలా మిగిలిన కాసిని రోజులూ తనకు మృత్యువు ఆసన్నమైందనే సందేహ లేశం లేకుండా, ఆడుతూ, పాడుతూ తిరుగుతాడు. అంతకంతకు చీకటిలా మృత్యువు అతన్ని ఆవరిస్తోందని, నాకూ సెప్పీకి మాత్రమే మనస్సులో రాచపుండు సలపరిస్తూ వుంటుంది. పన్నెండు రోజులు—పన్నెండు రోజులు మాత్రమే; భయం వేస్తోంది తలుచుకుంటే.

క్రమంగా నేనూ, నికొలాస్ గడిపిన దినాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. ముఖ్యంగా నేను ఆకతాయితనం కొద్దీ నికొలాస్‌ను అన్యాయం చేసి ఏడిపించిన సందర్భాలే ఎక్కువగా జ్ఞాపకం వచ్చాయి. ఇంక కొద్ది రోజుల్లో చనిపోబోతున్న నికొలాస్‌ను ఆవిధంగా

అన్యాయం చేసినందుకు ఎంతో సిగ్గు, విచారం కలిగి బాధ పడ్డాను.

ఒకసారి నికొలాస్ మావూళ్లోవున్న పళ్లదుకాణం యజమానికేదో చిన్న సహాయం చేసిపెట్టాడు. అందుకు ప్రతిఫలంగా ఆయజమాని ఒక ఆపిల్ పండు నికొలాస్‌కు ఇచ్చాడు. ఆపండు చాలా పెద్దది. అంత పెద్దపండు సాధారణంగా దొరకదు. అది పట్టుకుని నికొలాస్ ఉత్సాహంగా గంతులువేస్తూ వస్తున్నాడు. దారిలో నేను ఎదురయ్యాను. మిత్రుణ్ణి అని నమ్మి నాకు పండు చూపించాడు. నేను హఠాత్తుగా పండు లాక్కుని తింటూ తింటూనే పారిపోయాను. నికొలాస్ నావెంట బడి బతిమాలాడు తనపండు తన కిచ్చెయ్యమని. నేను పండుఅంతా తినేసి మధ్యలో మిగిలిన గట్టిభాగం అతనికిచ్చాను, నవ్వుతూ. అతడు కళ్లనీళ్లు పెట్టుకుని 'ఆపండు మా చెల్లాయి కిద్దామనుకున్నాను. ఇస్తే ఎంతో సంతోషపడేది' అనుకుంటూ వెళ్లిపోయాడు. ఆముక్క నాకు బాణంలాగ గుచ్చుకుంది. అతని చెల్లెలు జబ్బుపడి లేచింది. ఆమెకు మంచి ఆపిల్ పండు ఇవ్వగలగటం అతనికెంతో గర్వకారణమై ఉండేది. అతనికా అవకాశం లేకుండా చేసినందుకు బాధ పడ్డాను. పైకి మాత్రం నిర్లక్ష్యంగా "ఏడిశావ్, పోరా" అన్నాను. నికొలాస్ సమాధానమివ్వకుండా గాయపడిన చూపుతో ఇంటికిపోయాడు. ఆ గాయపడిన చూపు ఆతరవాత ఎన్నాళ్ల వరకో

పన్ను వెంటాడి బాధించింది. చివరకి ఆ సంఘటన మర్చిపోయాను. అప్పటికి మాకు తొమ్మిదేళ్లు. ఇప్పుడది మళ్లీ పైకివచ్చి పుండు సలిపినట్టు సలిపింది.

ఇంకోసారి బల్లో నా సిరాబుడ్డి పడేసి నాలుగు కాపీ పుస్తకాలనిండా ఒలకబోసి ఖరాబు చేశాను. మేష్టారికి తెలిస్తే యముడిలాగ దండిస్తారు. అది నికొలాస్ మీదికి తోసేసి నాకు పడవలసిన బెత్తం దెబ్బలు అతనికే తగిలేట్టు చేశాను.

నిరుడే ఇంకో అన్యాయం చేశాను. నాదగ్గిర పెద్దగాలం ఒకటుంది. అది కొంచెం విరిగివుంది. అది నికొలాస్ కిచ్చి, బదులుగా మూడు మంచివి చిన్న చిన్నవి గాలాలు తీసుకున్నాను. నీళ్లలో గాలం వేసీ వెయ్యగానే ఒకచేప చిక్కుకోవటం, అది గిలగిల కొట్టుకోవటంలో గాలం కర్ర పుటుక్కున విరిగిపోవటం జరిగింది. అతనికి తెలియదు నే నిచ్చింది విరిగిన గాలమేనని. నేను నా దగ్గిర చిన్నగాలాల్లో ఒకటి ఇవ్వజూపాను. కాని అతడు తీసుకోలేదు "మనం గాలాలు మార్చుకునేట్టు ఒప్పందం చేసుకున్నాక మళ్లీ నీగాలం తీసుకుంటానా?" అని నిరాకరించాడు.

ఇలాంటివే ఎన్నో సంఘటనలు జ్ఞాపకం వచ్చి మనస్సు కల్లోలితమై నిద్ర పట్టనేలేదు. బతికివున్న వాళ్లకి మనంచేసిన అన్యాయాలకంటె చచ్చిపోయిన వాళ్లకి చేసిన అన్యాయాలే ఎక్కువగా కలత పరుస్తాయి. నికొలాస్ బతికే వున్నప్పటికీ అతనికిచావు

సమీపించిందని ఎరుగుదును గదా! అందుచేత న శతడు మరణించిన వాళ్లతో సమానమే. రాత్రి బాగా పొద్దుపోయింది. చెట్లఆకులు శోకిస్తున్నట్టు రొద చేస్తున్నాయి. కిటికీల మీద మొత్తే వానచినుకులు ఆరొదకు తాళం వేస్తున్నాయి. నిద్ర పట్టలేదు.

తెల్లారగానే ముందు సెప్పీని చూడబోయాను. సైతాను చెప్పిందంతా అతనితో చెప్పాను. నది ఒడ్డున కూర్చున్నాం. అంతా విని సెప్పీ కొయ్యబారి నట్టు నిశ్చలంగా చూశాడు. పెదిమలు కదిలించాడు కాని మాటరాలేదు. క్రమంగా అతని ముఖం పాలి పోయింది. నెమ్మదిగా కన్నీళ్లు కారాయి. ముఖం తిప్పుకుని కొండలవైపు నడిచాడు. అతని బుజంమీద చెయ్యివేసి నేను కూడా నడిచాను. ఇద్దరం మాట్లాడ కుండా ఆలోచిస్తూ అడవులు, కొండలు అన్నీ తిరి గాము. కొంతసేపటికి గుక్క తిప్పుకుని మాట్లాడ సాగాము. నికొలాస్‌ను గురించే తప్ప మరొకమాట లేదు. సెప్పీ మధ్య మధ్య తనలో తను అనుకుంటు న్నట్టు—

"పన్నెండు రోజులు! ఊహు! పన్నెండు రోజులు కూడా లేదు," అనేవాడు.

ఈ పదకొండు రోజులూ నికొలాస్‌తోనే కాలమంతా గడపాలనుకున్నాం. వీలైనంత ఎక్కువ సేపు అతని సాన్నిధ్యం అనుభవించాలనుకున్నాం. అట్టే రోజులు లేవుగదా! అయినా వెంటనే నికొలాస్

వద్దకు వెళ్లటానికి మనసొప్పలేదు. చచ్చిపోయిన వాడి ప్రేతాన్ని కలుసుకోవాలన్నంత భయం కలిగింది. ఇంతలో ఒకచోట అకస్మాత్తుగా నికొలాస్ తటస్థ పడ్డాడు. దెయ్యాన్ని చూసినట్టు గుండె ఝల్లుమంది. అతడు మమ్మల్ని చూసి సంతోషంగా అరిచాడు:

"ఏరోయ్! ఇక్కడున్నారా? ఎంత వెదికినా కనబడలేదే? అదేమిట్రా? మొహాలల్లా వున్నాయి. నే నేం దెయ్యాన్ననుకున్నారా?"

మేము కుంగిపోయాము. అతని సంతోషం మాకు దుఃఖకరంగా వుంది. నికొలాస్ అప్పుడే సైతాన్ను చూసివచ్చాట్ట నేలమీద నిలవలేనంత పారవశ్యంలో వున్నాడు. నన్ను చైనా తీసుకెళ్లిన సంగతి సైతాను నికొలాస్‌తో చెప్పాట్ట. తన్నుకూడా తీసుకువెళ్లమని నికొలాస్ బతిమాలాట్ట. త్వరలో తీసుకు వెడతానని సైతాను వాగ్దానం చేశాట్ట. చాలా దూరదేశం, అద్భుతమైన, సుందరమైన, వర్ణనాతీతమైన దేశం తీసుకువెడతా నన్నాట్ట. సెప్పీని, నన్ను కూడా తీసుకు వెడదామని నికొలాస్ అనగా "వద్దు వద్దు. వాళ్లనిప్పుడు కాదు, తరవాతెప్పుడో, వాళ్ల టైము వచ్చినప్పుడు తీసుకు వెడతా" నన్నాట్ట. సైతాను నేటికి పదకొండో రోజున వస్తా నన్నాడనీ, ఆరోజుకోసం ఎదురు చూస్తున్నాననీ నికొలాస్ చెప్పాడు.

అదే రోజు! నికొలాస్ చనిపోయే రోజు! ఆరోజు కోసం ఎదురు చూస్తున్నాడు!

ముగ్గురం కలిసి చాలామైళ్లు తిరిగాము. మేము ఎప్పుడూ తిరిగే స్థలాలే తిరుగుతూ, మా పసితనం నుంచీ జరిగిన విశేషాలే జ్ఞాపకం చేసుకుంటూ చాలా సేపు గడిపాము. అందరిలోకీ నికొలాస్ మహా ఉత్సాహంగా ఉన్నాడు. అతని ఉత్సాహం మా గుండెలోని గుబులును పోగొట్టలేకపోయింది. నికొలాస్‌మీద ఇంతకాలమూ మా హృదయాల్లో దాగివున్న అనురాగం వెల్లబోసుకున్నాం. అతన్ని ఏపనీ చెయ్యనివ్వలేదు. "ఆగు, మేం చేసి పెడతాం" అని ప్రతి పనికీ అడ్డం తగిలాము. నాదగ్గిర ఏడు గాలాలు ఉన్నాయి. అవన్నీ నికొలాస్‌కు 'అచ్చంగా' ఇచ్చేశాను. సెప్పీ తన కొత్తచాకూ ఒకబూరా ఇచ్చేశాడు. సెప్పీకూడా నాలాగే నికొలాస్‌ను అడపాతడపా మోసం చేశాట్ట. వాటికి పరిహారంగా ఇవి ఇచ్చాడని తరవాత నాకు తెలిసింది. మాఅనురాగం చూసి నికొలాస్ హృదయం సంతోషంతో నిండిపోయింది. అతని సంతోషం మాకు ఇంకా దుఃఖకారణమై గుండెల్లో శూలంవలె గుచ్చుకుంది. చివరికి ముగ్గురం ఎవరిళ్లకు వాళ్లు వెళ్ళిపోయాం. వెళ్లిపోతూ ఇంత మంచిరోజు ఎప్పుడూ ఎరగనని నికొలాస్ అన్నాడు.

సెప్పీ నాతో రహస్యంగా అన్నాడు: "ఇదివరకు కూడా మనకు నికొలాస్ అంటే ఇష్టంవున్నా,

ఎప్పుడూ ఇంత ప్రేమ కలగలేదు. చివరికి అతనిక మనకు దక్కడని తెలిసేటప్పటికి, ఇంత ప్రేమ పుట్టు కొస్తోంది."

మర్నాడూ, ఆ తరవాత ప్రతిరోజూ నికొలాస్‌తోనే కాలం గడిపాము. ప్రతిరోజూ ఉదయం లేచేటప్పుడు అనుకునే వాళ్ళం: మరొక రోజు గడిచి పోయింది. నికొలాస్ చావు ఇంకొక రోజు దగ్గిర పడింది. ఇక పదిరోజులే; ఇక తొమ్మిది రోజులే; ఇక ఎనిమిది రోజులే—"

నికొలాస్ సంతోషంగానే వుండేవాడు. మేము దిగులుగా ఉంటున్న కారణ మేమిటో అతనికి బోధపడ లేదు. మమ్మల్ని ఉషారు చెయ్యటానికి అతడు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. నవ్వటానికి ప్రయత్నించేవాళ్ళంగాని అది మూలుగుగా బయట పడేది. సంగతేమిటని అడిగాడు కాని ఏదో అబద్ధం చెప్పి, ఏమీ లేదనే వాళ్ళం.

అన్నిటి కంటే మాకు బాధకరంగా అనిపించింది ఒకటి: నికొలాస్ తను చచ్చిపోవలసిన రోజు తరవాత రోజుల్లో ఏమేం చెయ్యాలో ఇప్పటినుంచే ఆలోచించే వాడు. ఫలానా రోజున మానాన్న కొత్త బట్టలు కుట్టిస్తా నన్నాడు; ఫలానా రోజున ఫలానా చోటికి వెడదాము, అని చెప్పేవాడు. అలా అన్నప్పు డల్లా మాగుండెలు బివ్వుమనేవి. ఆఖరికి నికొలాస్ ఒక ఆలోచన చేశాడు. అతడు ఆనెల 13 వ తేదీన

చనిపోవలసి వుంది. 14 వ తేదీన ఊళ్లో పిల్లల మంతా కలిసి ఊరిబయట కొండమీద 'పిక్నిక్' చేసు కుందా మని అన్నాడు. "వద్దు" అందామనిపించింది కాని అతడు "ఎందుకు వద్దు?" అని అడిగితే సమాధానం ఏం చెప్పగలం? అందుకని, 'సరే వెడదా' మన్నాము. "అందర్నీ పిలిచి వద్దాం" అన్నాడు. సరే నన్నాము. కాని మేము ఆహ్వానించేది పిక్నిక్ కి కాదనీ, అంత్య క్రియలకనీ మాకు మాత్రమే తెలుసు.

ఆ పదకొండు రోజులూ ఎంత దుర్భరంగా గడిచాయో చెప్పలేను. కాని ఇప్పుడు తలుచుకుంటే ఆ పదకొండు రోజులూ ఎంతో బావున్నట్టు తోస్తుంది. నా జీవితంలో ఆరోజులంత విలువైనవి మరిలేవు. నికొలాస్ పై ఆరోజుల్లో నా కేర్పడినంత స్నేహభావం తరవాత మరెవరిమీదా కలగలేదు. గంటలు, నిమిషాలు లెక్క పెట్టుకుంటూ, "అరెరే మరొక గంట అయిపోయిందే" అనుకొంటూ, లోభి చిల్లి గవ్వల దగ్గిర్నించీ జాగ్రత్త పడినట్లు ప్రతి నిమి షమూ అమూల్యంగా భావిస్తూ గడిపాము.

ఆఖరి రోజు సాయంత్రం రాత్రి పొద్దుపోయే వరకూ నికొలాస్ తో కలిసివున్నాము. ఎంత సేపటికీ ఆతన్ని విడిచిపెట్ట బుద్ధి కాలేదు. నికొలాస్ ను ఇంటివద్ద దిగబెట్టి బయటే కొంతసేపు ఆగాము. నికొలాస్ ఆలస్యంగా ఇంటికి వచ్చినందుకు వాళ్ల నాన్న పట్టు కుని కొట్టసాగాడు. నికొలాస్ అరుపులు మాకు బయ

టికి వినిపించాయి. అతనికి తన్నులు తగలటానికి కారణం మేమేగదా అని విచార పడ్డాము. రేపు నికొలాస్ చనిపోతాడని తెలిస్తే తండ్రి అలా కొట్టేవాడా, అనుకున్నాము.

మర్నాడు నికొలాస్ అనుకున్న ప్రకారం వచ్చి మమ్మల్ని కలుసుకోలేదు. అందుకని మేమే అతని ఇంటికి వెళ్లాము. అతని తల్లి మమ్మల్ని చూసి అన్నది:

"నికొలాస్‌ను వాళ్ల నాన్న రాత్రి బాగా తన్నారు. ఎప్పుడూ తిరగటమే తప్ప చదువు లేదాయె. మీ ఇద్దరితో కలిసి వాడు ఊరంతా తిరుగుతున్నాడని వాళ్ల నాన్నకి చెడ్డకోపంగా వుంది. మామూలుగా ఆయనెప్పుడైనా చెయ్యి చేసుకుంటే నేను అడ్డం వెళ్ళేదాన్ని, రాత్రి మాత్రం నాక్కూడా కోపంవచ్చి బాగా తగలనివ్వమన్నాను. మరీ అంత తిరుగుబోతయితే ఎలా చచ్చేది?"

మేము గుడ్లలో నీళ్లు గుడ్లలోనే కుక్కుకున్నాము. "ఈ ఒక్కసారికైనా మీరు నికొలాస్‌ను కొట్టకుండా చేస్తే బావుండేది," అన్నాను.

ఆమె అప్పుడు బట్టలు ఇస్త్రీ చేస్తోంది. ఇస్త్రీ పెట్టె అక్కడ పెట్టి నాకేసి చూసి "ఏం?" అని ఆశ్చర్యపడి అడిగింది.

సమాధానం ఏం చెప్పటానికీ తోచలేదు. ఆమె జవాబుకోసం ఇంకా నాకేసే చూస్తోంది. ఇంతలో సెప్పీ అందుకున్నాడు:

"ఏమీ లేదండి. రాత్రి నికొలాస్ మాతో మిమ్మల్ని గూర్చే చెప్పాడు. "మా నాన్న ఎప్పుడు కొట్టవచ్చినా మా అమ్మ అడ్డంవచ్చి కొట్టకుండా చేస్తుంది. మా అమ్మ ఎంతో మంచిది, అని రాత్రి పొద్దుపోయేదాకా మీ గురించే కబుర్లు చెప్పాడండి. మాకూ్కడా ఎంతవిన్నా వినబుద్దేసి అలాగే కూర్చుండి పోయాం. అందుకనే రాత్రి నికొలాస్ ఇంటికి వచ్చేటప్పటికి అంత ఆలస్యమైంది."

"నిజంగానా? మా నాయన నన్నుగురించే చెప్పాడా?" అని ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

"నిజంగానండీ! కావలిస్తే థియొడోర్ నడగండి," అన్నాడు సెప్పీ.

"అయ్యో, నికొలాస్‌ను అనవసరంగా కొట్టించాను. నేనెంతో మంచిదాన్నని వాడు పొగడినందుకు నేనిచ్చిన బహుమానం ఇదీ. పాపం వాడు ఎంత జాలిగా ఏడ్చాడు. ఎంత రాతిగుండె దాన్ని," అని నికొలాస్‌తల్లి మళ్లీ కన్నీళ్లు తుడుచుకుంది.

సెప్పీ అడిగాడు "నికొలాస్‌ను ఒక్కసారి బయటికి పంపిస్తారా?" అని.

"ఊహు. వాళ్లనాన్న వాణ్ణి ఇంట్లోంచి కదిల్తే కొడతానని చెప్పారు."

ఒక్కసారిగా ఆశ ఉదయించింది. నికొలాస్ ఇంట్లోంచి కదలకుండా ఉంటే నదిలో మునిగే అవకాశం ఉండదు. కనుక ప్రమాదం దాటిపోతుంది," అనుకున్నాం.

'నికొలాస్ ఈరోజంతా కదలటానికి వీల్లేదా? లేక మధ్యాహ్నం వరకేనా?" అని అడిగాడు సెప్పీ.

"రోజంతా కదలగూడదు. పాపం వాడొక్కడే మేడమీద కూర్చునున్నాడు. ఎప్పుడూ ఇంట్లో కూర్చునేఅలవాటు లేదేమో, ఏం తోచటం లేదట."

సెప్పీ ధైర్యం చేసి అడిగాడు:

"మేము కూడా మేడమీదికి వెళ్లి అతనితో కబుర్లు చెబుతూ కూర్చుంటామండి."

"సరే, అలాగే వెళ్లండి. ఇదుగో ఈ బిస్కట్లు తీసుకోండి. ఒకటి నికొలాస్ కివ్వండి," అన్నది ఆమె.

నికొలాస్ గదిలోకి వెళ్లగానే ముందు గడియారం చూశాం. పావు తక్కువ పది అయింది. అరె! ఇంక కొద్ది నిమిషాలే టైమ్ వున్నది! నికొలాస్ మమ్మ చూసి చెంగున ఎగురుతూ లోనికి తీసుకుపోయాడు. అతడు ఉత్సాహంగానే వున్నాడు. 14 వ తేదీన జరగబోయే పిక్నిక్కి ప్లానులు వేస్తున్నాడు.

"కూర్చోండిరా. నేను ఒక మంచి గాలిపటం తయారు చేశాను. మాదొడ్లో ఆరబెట్టాను," అన్నాడు నికొలాస్.

పిక్నిక్ రోజున ఆటలపోటీలు ఏర్పాటు చేద్దామనీ, గెలిచినవాళ్లకి బహుమతు లిచ్చేందుకు తను దాచుకున్న డబ్బుపెట్టి రక రకాల వస్తువులు కొన్నానని అన్నాడు. ఆ వస్తువులన్నీ బల్లమీద అమర్చి గర్వంగా చూడమన్నాడు. "గాలిపటం తీసుకుని



ఇప్పుడే వస్తా" నని చెప్పి గబగబ మెట్లు దిగి కిందికి వెళ్లాడు.

మేము మాటామంతీ లేకుండా చూస్తూ కూర్చున్నాం. బహుమతివస్తువులను ముట్టుకో బుద్ధి కాలేదు. గడియారంవంకే చూస్తూ సెకండ్లు, నిమిషాలు లెక్కపెడుతున్నాం. నిమిషాల ముల్లు కదిలినప్పుడల్లా ఉలికిపడేవాళ్లం. సెప్పీ సట్టూర్చు విడిచి అన్నాడు;

"రెండు నిమిషాలు తక్కువ పది అయింది. ఇంక ఏడు నిమిషాలు! అది దాటితే నికొలాస్‌కు గండం గడిచిపోతుంది. థియొడోర్! నిక్ బతుకుతాడు. తప్పకుండా బతుకుతాడు."

"హుష్! ఆగరా. నాకు ముళ్లమీద వున్నట్టుంది. గడియారం చూస్తూ మాట్లాడకుండా కూర్చో," అన్నాను.

ఇంకా అయిదు నిమిషాలు! ఊపిరి బిగపట్టి గడియారపు టిక్‌టిక్ శబ్దం వింటున్నాం. అయిదు నిమిషాల్లో చావో, బతుకో తేలిపోతుంది. ఇంకా మూడు నిమిషాలే! ఒళ్లంతా గగుర్పొడిచింది. మా గుండె చప్పుడు మాకే స్పష్టంగా వినిపిస్తోంది. ఇంతలో మెట్లమీద ఎవరో వస్తున్న చప్పుడైంది.

"ఆ, అడుగో, నికొలాస్ వస్తున్నాడు. ఇక భయంలేదు. బతికాడు," అనుకుని లేచి మెట్లవద్దకు వెళ్ళాం.

కాని వచ్చింది నికొలాస్ కాదు; అతని తల్లి. నికొలాస్ తయారుచేసిన గాలిపడగ తీసుకు వచ్చింది. "ఎట్లావుందీ? చాలా బావుంది కదూ? ఇవ్వాళ పొద్దుణ్ణించీ కూర్చుని కష్టపడి తయారుచేశాడు," అన్నది. గాలిపడగ గోడ కానించి, కొంచెం దూరాన నుంచుని, మెచ్చుకుంటున్నట్టు చూసింది. "గాలి పడగ మీద బొమ్మలుకూడా తనే వేశాడు. చాలా బాగా వేశాడు కదూ? ఆ చర్చి బొమ్మ అంత బావుళ్లేదుగాని వంతెన చక్కగా నే వేశాడు. ఎంత బావుందో! ఏడీ వాడు? 'ఇప్పుడే వస్తాను, ఇది పైకి పట్టుకెళ్లు' మన్నాడే? పదిహేడు నిముషాలయింది. ఇంకా రాలేదే?"

"అసలెక్కడికి కెళ్లాడు?" అని ఆదుర్దాగా అడిగాము.

"ఆ, ఎక్కడికీ లేదు. ఇప్పుడే అలా పంపించాను. వస్తూవుంటాడీపాటికి."

"బయటికి వెళ్లాడా?" అని కంగారు పడ్డాము.

"అవును. వాడు కిందికి వచ్చేసరికి లిజా బ్రౌంట్ తల్లి వచ్చింది. లిజా ఎక్కడికెళ్లిందో కనిపించ లేదన్నది. ఆవిడ గాబరా చూసి కాస్త వెదికిరమ్మని నికొలాస్‌ను పంపించాను...అరె! ఏమిటి, మీ ఇద్దరూ అలా చూస్తారు? మొహాలు పాలిపోయి, వణికి పోతున్నారే? కూచోండి. ఇంతట్లోకే ఏం జబ్బొచ్చిందర్రా? ఆ రొట్టెముక్క పడలేదు గావును మీకు.

ఆగండి, ఏదన్నా తెస్తాను..." అంటూనే ఆమె కిందికి వెళ్లింది.

నేనూ, సెప్పీ ఒక్క ఉదుటున వెనకవేపు ఉన్న కిటికీదగ్గిరి కెళ్ళి నదికేసి చూశాము. నది వొడ్డున పెద్ద గుంపు చేరింది. జనం ఊళ్లోనుంచి ఇంకా పరిగెత్తుతున్నారు. అది చూసి

"అయిపోయింది. అంతా అయిపోయింది. అయ్యో నికొలాస్! నికొలాస్!" అని ఇద్దరం గద్గదికంగా ఏడవ సాగాము.

"థియొడోర్! పోదాంరా. ఇప్పుడు వాళ్ళమ్మ వస్తుంది. ఆమెను చూడలేము. అయిదు నిమిషాల్లో ఆవిడ కెలాగూ తెలిసిపోతుంది," అన్నాడు సెప్పీ.

కాని మేము తప్పించుకుపోవటానికి వీల్లేకుండా నికొలాస్ తల్లి మేడ మెట్లెక్కి వచ్చేసింది. మమ్మల్ని కూర్చోమని చెప్పి ఏదో మందు గొంతుకలో పోసింది. మందు పనిచేస్తోందో లేదో చూసింది. పని చేసినట్టు కనబడలేదు. 'అయ్యో. ఆ వెధవరొట్టె మీ కెందుకు పెట్టానురా' అని చింతించ సాగింది.

ఇంతలో మేము అనుకున్నంతా జరిగింది. ఇంటి ముంగిట జనం మూగిన సద్దు అయినది. చాలా మంది మనుషులు టోపీలు చేతపట్టుకుని ఇంట్లోకి ప్రవేశించారు. కొందరు రెండు శవాల్ని తీసుకొచ్చి మంచాలమీద పడుకోపెట్టారు.

"అయ్యో దేవుడా!" అంటూ నికొలాస్ తల్లి కొడుకుశవంమీద పడి గోలగా ఏడవసాగింది. ఏడుస్తూ, కొడుకుముఖం ముద్దులు పెట్టుకుంటూ "నాతండ్రీ! నాయనా! నన్ను విడిచిపోయావా? చేతులారా చంపుకున్నానురా. ఇంట్లోనే ఉంచితే చచ్చిపోయేవాడివి కాదురా. బయటికి పంపించి చంపానురా. చిట్టి తండ్రీ! అయ్యయ్యో! ఇంక నా బతుకెందుకురా. అప్పుడే నీకు నూరేళ్లు నిండాయిరా," అంటూ ఒకటే విధంగా రోదించింది.

చుట్టూ వున్న ఆడవాళ్లు కళ్ల నీళ్లు పెట్టుకున్నారు. ఆవిడని ఓదార్చటానికి ప్రయత్నించారు. కాని ఆమె ఓదార్పు చెందలేదు. తనే వాణ్ణి బయటికి పంపించి చంపుకున్నాననీ, ఇంట్లోనే వుంటే బతికేవాడనీ పదేపదే అనుకుని ఏడుస్తోంది.

దీన్నిబట్టే తెలుస్తుంది, మానవులు ఎంత తెలివితక్కువ వాళ్లో. తమకి కర్తృత్వం లేకపోయినా, తప్పొప్పులన్నీ తమకే ఆరోపించుకుంటారు. అందుకే సైతాను అన్నాడు: మానవుడు చేసిన మొదటిపని మిగతా పనులన్నిటినీ నిర్ణయిస్తుంది. తనంతట తను ఏమానవుడూ తన భవిష్యత్తు మార్చుకోలేడు.

ఇంతలో పెద్ద పెట్టున ఏడుస్తూ మరొక కంఠం వినిపించింది. లిజా బ్రాంట్ తల్లి పరుగు పరుగున వచ్చి కూతురు శవం కావిలించుకుని "ఓరి దేవుడో!" అంటూ ఏడవసాగింది. ఆమె దుఃఖం మరీ చూడ శక్యం

కాకుండా వుంది. జుట్టు పీక్కున్నది; వళ్లు రక్కుకున్నది; కూతురును కావిలించుకుని నలిపి వేసింది; విడవకుండా ముద్దులు పెట్టుకున్నది. చివరికి లేచి నుంచుని గుప్పిళ్లు బిగించి ఆకాశంకేసి చూసి ఇలా అరిచింది:

"పది రోజుల్నించీ నాకు ప్రతిరాత్రి కలలు వచ్చాయి. నా ఒక్క కూతురూ చచ్చిపోతుందని కలల్లో కనబడింది: అప్పటినించీ భయపడి పోతూనే వున్నాను. రాత్రిం బగళ్లు దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను నా కూతురు కే ఆపదా రాకుండా చెయ్యమని. చివరకి దేవుడు చేసింది ఇదీ—"

మళ్ళీ కూతురుమీాద పడి ఏడ్చింది. జుట్టూ, కళ్లూ, నుదురూ, చెంపలు, చేతులూ అన్నీ ముద్దు పెట్టుకుంది. తిరిగి లేచి "ఛీ! దేవుడికి దయలేదు. ఈ జన్మలో మళ్లీ ప్రార్థన చెయ్యను," అన్నది. కూతురును బుజానవేసికొని, గుంపును ఒత్తిగించుకుని, ఇంటికి వెళ్లిపోయింది. ఆమె దేవుణ్ణి తిట్టడం విని జనం నిర్ఘాంతపోయారు. సైతాను అన్నది నిజం. మానవులకి ఏది మంచో, ఏది చెడో తెలియదు. మంచి జరిగితే చెడుఅనీ, చెడు జరిగితే మంచి అని అనుకుంటారు. దీర్ఘరోగులను కాపాడమని అనేకులు ప్రార్థించటం విన్నాను. నేను మాత్రం ఎప్పుడూ ప్రార్థించలేదు.

రెండు శవాలకూ మర్నాడు అంత్యక్రియలు జరిగాయి. ఊళ్లో జనమంతా శ్మశానం వద్దనే ఉన్నారు.

సైతాను కూడా వచ్చాడు. అతడు రాకుండా ఎలా? అతని పనేగదా ఇదంతా. నికొలాస్ మతగురువు దగ్గిర లేకుండా చనిపోయాడు గనక అతని ఆత్మ నరకానికి పోకుండ ఉండగలందులకై చర్చిలో ప్రార్థనలు చేయించవలసి వుంది. దానికిగాను నికొలాస్ తల్లి తండ్రులు వచ్చిన వారందరివద్దా డబ్బు పోగుచేశారు. కావలసిన డబ్బులో మూడువంతులు మాత్రమే పోగయింది. మిగతా డబ్బు ఎవరివద్దనైనా బదులు తీసుకుందామనుకుంటున్నారు. సైతాను మిగతా డబ్బు తను సర్దుతానని చెప్పి ఇచ్చాడు. తరవాత అతడు మాకు రహస్యంగా చెప్పాడు: "నరకం గిరకం ఏమీ లేదు. అయినా నికొలాస్ తల్లి దండ్రుల సంతృప్తి కోసం ఆడబ్బిచ్చాను."

శ్మశానంవద్ద లిజా బ్రౌంట్ శవాన్ని మా వూళ్లోని వడ్రంగి వచ్చి పట్టుకున్నాడు. వాడికి లిజాతల్లి యాభై నాణాలు బాకీవున్నది. ఆ బాకీ ఎన్నాళ్లకీ తీర్చలేకపోయింది. అందుచేత వడ్రంగి ఆశవం లాక్కున్నాడు. లాక్కుని ఇంటికి తీసుకుపోయాడు. ఇంట్లో ఒక చీకటి కొట్లో నాలుగు రోజు లుంచాడు. ఆ నాలుగు రోజులూ లిజా తల్లి వడ్రంగి ఇంటిచుట్టూ తిరిగింది. తనకూతురుశవం తనకిచ్చివెయ్యమని ఎంతో బతిమాలింది; మొత్తుకుంది; ఏడ్చింది; తల నేలకు కొట్టుకుంది. ఎంత చేసినా వడ్రంగి కరగలేదు. అయిదో రోజున శవం తీసుకెళ్లి పశువుల దొడ్లో

పాతి పెట్టాడు. అంత్యసంస్కారాలేమీ జరగలేదు. తల్లి గుండె ఘోషించింది. దుఃఖంతో పిచ్చెక్కినట్లయింది. రోజూ తల విరబోసుకొని ఊరంతా తిరిగేది. వడ్రంగినీ, చక్రవర్తినీ, చర్చినీ, దేశాన్నీ ప్రపంచాన్నీ, దేవుణ్ణీ బండబూతులు తిట్టేది. ఆమెను చూస్తే ఎంత రాతిగుండెవాడికయినా గుండె నీరవుతుంది. సైతాన్ని సెప్పీ అడిగాడు, ఆమెను రక్షించమని కాని సైతాను నవ్వి "వడ్రంగి మానవుడు. మానవులంతా చేసేపనే అతడూ చేస్తున్నాడు. ఒక గుర్రమో, మరే పశువో ఆవిధంగా చేస్తే నేను అడ్డపడే వాణ్ణి. సెప్పీ! నీకెక్కడన్నా అలా ప్రవర్తించే పశువు కనిపిస్తే నాతో చెప్పు. నేను తప్పకుండా జోక్యం చేసుకుంటాను. చెబుతావు కదూ?" అన్నాడు.

కొన్ని రోజులు గడిచాక లిజాతల్లి దుస్థితి భరించలేక పోయాము. సైతాన్ని అడిగాము—ఆమె జీవితం బాగుచేసే మార్గం వుందేమో చూడమని. అతడు ఆమె జీవితం పరిశీలించాడు. "ఆమెకు నలభై రెండేళ్ల కంటె ఎక్కువ ఆయువు లేదు. ఆమె జీవితం ఎలా మార్చినా దుఃఖం, బాధ, ఆకలి, అవమానం తప్పవు. కావాలంటే ఒకపని చేస్తాను. ఇంకొకమూడు నిమిషాల్లో ఆమె భవిష్యత్తు మార్చటానికి వీలున్నది. మార్చమంటారా?" అని అడిగాడు. ఏమనటానికీ తోచలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాము. సైతాను

గడియారం తీసి "ఉ. త్వరగా చెప్పండి. టైము లేదు." అన్నాడు. "మార్గ్రెట్," అన్నాము.

"ఆ. మార్గ్రెట్. ఇప్పుడామె ఒక సందు మలుపు తిరుగుతున్నది. ఆమె ముందుకు వెళ్లకుండా వెనక్కి వచ్చేట్టు చేశాను. దీనివల్ల ఆమె జీవితం మారిపోతుంది."

"అంటే?"

"ఇదిగో ఇప్పుడే జరుగుతోంది ఆమె ఫిషర్ అనే సాలెవాణ్ణి కలుసుకుంది. అతణ్ణి బూతులు తిట్టింది. అతడు కోపం పట్టలేక ఆమెకు హానిచేయ నిశ్చయించుకున్నాడు. ఆమె సందుమలుపు తిరిగి ముందుకు పోతే ఇదంతా జరిగేది కాదు. వెనక్కి రావటం మూలానే ఇది జరుగుతోంది."

"ఫిషర్ ఏం చేస్తాడు?"

"అతడు ఆమె రోజూ దేవుణ్ణి, చర్చినీ తిట్టడం వింటున్నాడు. ఈసంగతి మతాధికారులకు ఫిర్యాదు చేస్తాడు. చేస్తాడేమిటి, అదుగో, వెళ్ళి అధికారులతో చెప్పతున్నాడు. దీని ఫలితంగా లిజా బ్రాంట్ తల్లి మరి మూడు రోజుల్లో సజీవంగా కాల్చివేయబడు తుంది."

ఇది విని మాకు భయంతో నోటమాట రాలేదు. ఆమె జీవితంలో జోక్యంకలిగించుకోకుండా ఉంటే బాగుండేదనుకున్నాము. మా ఆలోచన సైతాను కనిపెట్టాడు.

మీరు సరిగ్గా మానవులనుల్లేనే, అంటే పరమ మూర్ఖంగా ఆలోచిస్తున్నారు. నేను ఆస్త్రీకి ఉపకారం చేస్తే అపకారం అనుకుంటున్నారు. ఇంకా 29 ఏళ్ల పాటు ఆమె భూలోకంలో యాతనామయ జీవితం గడపటం మంచిదా? లేక మూడు రోజుల్లో స్వర్గానికి వెళ్ళి 29 ఏళ్లు ఎక్కువగా స్వర్గ జీవితం గడపటం మంచిదా?" అన్నాడు.

అంతకు ముందు నిమిషంవరకూ, సైతాన్ని ఇకమీదట ఏమీ అడగకూడదని, ఎవరి జీవితం బాగు చెయ్యాలన్నా చంపటమొక్కటే అతనికి చేతనైనపని అనీ మేము అనుకుంటున్నాము. కాని లిజా బ్రాంట్ తల్లి ఇప్పుడు చనిపోవటం మూలంగా 29 ఏళ్లు ఎక్కువ స్వర్గజీవితం పొందుతుందనేసరికి మాకు ఆనందం కలిగింది. మేము సైతాన్ని ఆవిధంగా కోరటం మంచిదే అయిందనుకున్నాము.

తరవాత ఫిషర్‌ను గూర్చి ఆలోచన కలిగింది. సైతాన్ని అడిగాను: "ఈ సంఘటనవల్ల ఫిషర్ జీవితం కూడా మారుతుందా?"

"ఓ. పూర్తిగా మారిపోతుంది. ఇందాక లిజా తల్లి నతడు కలుసుకుని ఉండకపోతే వచ్చే సంవత్సరమే చనిపోయి ఉండేవాడు. ఇప్పుడు తొంభైఏళ్ల దాకా బతుకుతాడు. బాగా డబ్బు గడించి, దర్జాగా బతుకుతాడు."

కనీసం ఫిషర్ కయినా మంచి జీవితం లభించి నందుకు సంతోషించాము. సైతాను మాత్రం మా సంతోషం చూసి నవ్వుకున్నాడు. మా కనుమానం కలిగింది. కాస్సేపాగి అడిగాను: "ఎందుకు నవ్వతావు సైతాన్! ఫిషర్ అదృష్టంలో ఏమైనా లోపం ఉంటుందా?"

"పెద్ద లోపమేమీ కాదనుకో. అతడు మామూలుగా అయితే స్వర్గానికి వెళ్లేవాడు—"

"ఇప్పుడో?"

"గాబరా పడకండి. ఇప్పుడు నరకమే అతనికి గతి. భూలోకంలో సుఖాలనుభవిస్తాడు గనుక, మీరాట్టే భయపడవలసిన అవసరం లేదు."

"అయ్యయ్యో! ఇలా ఎందుకు చేశావు సైతాన్? మాకు ముందే చెబితే మేము అసలు ఎవరి జీవితాలూ మార్చమని కోరేవాళ్లమే కాదే? పాపం, ఫిషర్ శాశ్వత నరకం పొందటానికి మేమే కారకుల మాతా మన్న మాట" అని గోల చేశాము.

సైతాను మాగోల వినిపించుకోలేదు. అతనికి సుఖమంటే ఏమిటో, దుఃఖమంటే ఏమిటో తెలియదు. తెలియదంటే బొత్తిగా తెలియదని కాదు. సూత్రప్రాయంగా తెలుసు. అనుభవంరీత్యా తెలియదు. సుఖం గాని దుఃఖంగాని అనుభవించకుండా, సూత్రప్రాయంగా తెలుసుకోవటం అంటే తెలియనితనంలోనే లెక్క. మేము ఎంత బోధపరిచినా అతడు మానవుల

సుఖదుఃఖాలను తృణసమానంగానే పరిగణించాడు. ఫిషర్ స్వర్గంపొందినా, నరకం పొందినా తనకొకటే నన్నాడు. అతడు స్వర్గానికి వెళ్ళినంతమాత్రాన స్వర్గానికివచ్చిన లోటేమీ లేదన్నాడు. స్వర్గంలో జనాభా ఇప్పటికే ఎక్కువగా ఉందన్నాడు. అసలు ఫిషర్ నశించినంత మాత్రాన వచ్చేనష్టం లేదనీ, ఇంకా బోలెడుమంది ఫిషర్‌లు వస్తారనీ అన్నాడు.

మేము ఇలా మాట్లాడుతుండగానే ఫిషర్ ఆ దారిని వస్తున్నాడు. అతన్ని చూసేసరికి మాకు చాలా విచారం కలిగింది. తనకు మరణానంతరం కలగబోయే ఘోరవిపత్తు అతనికి తెలియనే తెలియదు. తెలిస్తే అంత సంతోషంగా చిరునవ్వులు నవ్వుకుంటూ, తను లిజాబ్రాంట్ తల్లికి చేసిన హానికి మురిసిపోతూ ఉండడు. అతడు వెళ్ళిన కొద్దిసేపటికే లిజాబ్రాంట్ తల్లివచ్చింది. ఆమెను రక్షకభటులు బంధించి తీసుకువస్తున్నారు. ఆమెవెనక ఒక పెద్దగుంపు గోలగా అరుచుకుంటూ ఊరేగింపులాగా వస్తోంది. "మంత్రగత్తె", "మతద్రోహి", "దైవద్రోహి", అని జనం తిడుతూ కేకలువేస్తున్నారు. మరీ కసిగా ఉన్న కొందరు ఆమెను కొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఆమెను జనం కొడుతుంటే రక్షకభటులు చూసీచూడ నట్టు ఊరుకుంటున్నారు. ఈజనంలో చాలమంది ఆమె మంచి రోజుల్లో ఉన్నప్పుడు మిత్రవర్గానికి చెందినవారే.

"సైతాన్! పాపం ఆమెను ఒక్కదాన్నీ చేసి వీళ్లు బాధిస్తున్నారు. వాళ్ళనాపు," అని అరిచాను. వెంటనే జ్ఞాపకం వచ్చింది. సైతాన్ వారి పనులకు అడ్డం వచ్చాడూ అంటే, వారి జీవితాలన్నీ ఆ క్షణంనుంచే మారిపోతాయి.

నేను కోరడం తడవుగా సైతాను జనంకేసి మెల్లిగా ఊదాడు. వెంటనే గ్రామస్థులు పొట్టలు చేత్తో పట్టుకుని "బాబోయ్" అని అరుచుకుంటూ దిక్కుకొక పిట్టగా చెల్లాచెదరై పోయారు. సైతాను అలా ఊదగానే ఆగాలికి వారి ఎముకలు పటపటమని విరిగినట్ట యినాయి. దాంతో పారిపోయారు.

ఈ చిన్నపనివల్ల వారి జీవితాలన్నీ మారినట్లేనా అని అడిగాము.

"పూర్తిగా మారిపోయాయి. కొందరికి ఆయువు పెరిగింది; కొందరికి తరిగింది. ఈమార్పువల్ల కొందరు సుఖపడతారు; కొందరు దుఃఖపడతారు. కాని సుఖపడేవాళ్ళు బహు కొద్దిమంది."

ఫిషర్‌కు పట్టినగతి వీరిలో ఎవరికైనా పట్టిందా అని అడుగుదామనుకున్నాము గాని, అది తెలుసుకున్న కొద్దీ మాకు బాధేతప్ప సంతోషం వుండదు; కనుక అడగలేదు. నిజానికి సైతాను మానవులకు హాని చెయ్యాలనే వుద్దేశ్యంలేకపోయినా, అతడు చేసేదంతా హానికరంగానే పరిణమిస్తోంది. అతన్ని అట్టే నమ్ముకోడం మంచిది కాదనిపించింది. అంతవరకూ, మా

ఇద్దరి జీవితాలు కూడా పరిశీలించి అభివృద్ధిచేయటా నికి వీలైతే చెయ్యమని అడగాలని ఒకకోరిక మాలో గూఢంగా వుండేది. ఇప్పుడా కోరిక చచ్చిపోయింది.

తరువాత రెండుమూడు రోజులవరకూ మా వూరంతా అట్టుడికిపోయింది. లిజాబ్రాంట్ తల్లి మంత్రగత్తెయేనని యావన్మందికీ గాఢ విశ్వాసం ఏర్ప డింది. లేకపోతే ఆ రోజున అలా అంతమంది బొమి కలు వున్నట్టుండి విరగవలసిన అవసరంలేదని అంతా అనుకున్నారు. ఆమెను విచారణ చేసేరోజున చర్చి కోర్టునిండా జనం కిటకిటలాడారు. ఆమెను ఎక్కువగా ప్రశ్నించి, పరీక్షించాల్సిన అగత్యం లేకపోయింది. ఏమంటే, ఆమె నోరు విప్పుతూనే చర్చినీ, చక్రవర్తినీ, దేవుణ్ణి బూతులు తిట్టసాగింది. "నీ ప్రాణాలు దక్కవు తెలుసా?" అని కోర్టువారు బెదిరించారు. "నా ప్రాణాలు మీ యిష్టం వచ్చినట్టు వాడుకోవచ్చు. వాటితో నాకు అవసరం తీరిపోయింది," అని ఆమె సమాధాన మిచ్చింది. "నేను నరకానికే వెళ్లదలచు కున్నాను. ఈ గ్రామంకంటె నరకం వెయ్యిరెట్లు మెరుగు. నరకంలో సిసలైన పిశాచాలుంటాయి. ఇక్కడ మానవపిశాచాలుమాత్రమే ఉన్నాయి. ఎలాగైనా అవే మెరుగు వీటికంటే." అని వెటకారం గా చెప్పి వాడించింది. అధికారులు ఆ రోజున గ్రామ స్థుల బొమికెలు మంత్రం వేసి విరగ్గొట్టినది ఈమెయే

నని నిర్ధారణచేస్తూ "నువ్వు మంత్రగత్తెవేనా?" అని ప్రశ్నించారు.

"కాను. నేనే మంత్రగత్తెనయితే దైవభక్తుల మని విర్రవీగే మిమ్మల్ని ఇంతసేపు బతకనిస్తానా? నన్నెందుకు వేధిస్తారు? మీరు వేసేశిక్ష ఏదో త్వరగా వెయ్యండి. మీ మొహాలు చూస్తూ కూచోటం అసహ్యంగా వుంది."

ఆమె దోషిఅని తీర్పు చెప్పారు. మఠం నుండి వెలివేశారు. స్వర్గానికి పోయే అర్హత తీసివేశారు. తరవాత ఆమెకు నూతకబట్టలుకట్టి సివిల్ కోర్టుకు అప్ప గించారు. రక్షకభటులు ఆమెను గ్రామమధ్యంలో సిద్ధంగావున్న చితివద్దకు తీసుకుపోయారు. చితి మధ్య వున్న స్తంభానికి ఆమెను కట్టివేశారు. తరువాత నిప్పు అంటించారు. అప్పటివరకు కఠిన దృక్కులతో వీక్షి స్తున్న ఆమె కొంచెం మెత్తబడింది. చుట్టూ మూగి వున్న గ్రామస్థుల గుంపును పరికిస్తూ, మృదుల స్వర ముతో ఇలాగంది:

"సోదరులారా! మీకు నేను కొత్తకాదు. మీరు నేనూ మన చిన్నతనంలో కలిసిమెలిసి అమా యకంగా ఆడుకున్న ఆటలు నా కింకా జ్ఞాపకం ఉన్నాయి. అందుచేత మిమ్మల్ని నేను క్షమిస్తున్నాను."

తరవాత మేము వెళ్ళిపోయాము. ఆమె చితి మీద దగ్ధంకావటం మేము చూడలేదు. ఆమె మరణ వేదనతో అరచిన అరుపులు మాత్రం మా శ్రవణేంద్రి

యాలను బద్దలు చేశాయి. కొంతసేపటికి అరుపులు ఆగిపోయాయి. ఆమె చనిపోయిందని, స్వర్గానికి పయనమై వుంటుందని అనుకున్నాము. ఆమెను చర్చి అధికారులు వెలివేసినా స్వర్గానికే వెడుతుందని సైతాను చెప్పాడుగా. అందుచేత ఆమె చనిపోయినందుకు మేము విచారించలేదు సరిగదా, చనిపోవటానికి మేమే కారకులమైనందుకు సంతోషించాము కూడా.

ఈ సంఘటన జరిగిన తరువాత ఒక రోజున సైతాను తిరిగి కనిపించాడు. అతనికోసం మేము రోజూ కనిపెట్టుకుని కూర్చునేవాళ్ళం. అతనివద్ద వున్నంతసేపూ ఎంతో హాయిగా గడిచిపోయేది. మేము మొదటిసారి అతన్ని కలిసిన చోటనే కనిపించాడు. మాకింకా కుతూహలం వదలలేదు. ఏమైనా వింతలు చేసి చూపించమన్నాము.

"మంచిది. మీ మానవజాతి ఎలా అభివృద్ధి పొందిందో, మీరు నాగరికత అని పిలిచే పదార్థం ఎలాంటిదో చూపించమంటారా?"

"ఓ. చూపించు," అన్నాము.

సైతాను క్షణంలో ఆ ప్రదేశాన్ని ఈడెన్ వనంగా మార్చాడు. ఆ వనంలో ఒకచోట ఎబెల్ దేవుణ్ణి ప్రార్థిస్తూవున్నాడు. కెయిన్ గద ధరించి అక్కడికి వచ్చాడు. ఎబెల్‌ను చూసి మాకర్థంకాని ఏదో భాషలో మాట్లాడాడు. తరవాత కెయిన్ మహాకోపముతో గద ఝుళిపించాడు. ఆ తరవాత ఏం జరుగు

తుందో మాకు తెలుసు. అందుచేత మొహాలు తిప్పేసు కున్నాము. కాని ఏదో దెబ్బలాట, అరుపులు, మూలుగు వినిపించాయి. తిరిగి చూసేసరికి ఎబెల్ రక్తపు మడుగులో పొర్లాడుతూ చనిపోతూండటం కని పించింది. కెయిన్ పక్కనే నుంచుని తీవ్రద్వేషంతో చూస్తున్నాడు.

ఈ దృశ్యం మారిపోయింది. ఏవేవో యుద్ధాలు, హత్యలు, హింసాకాండలు కనిపించాయి. తరువాత ప్రపంచ ప్రళయం వచ్చింది. మళ్ళీ సృష్టి జరిగింది. హీబ్రూ యుద్ధాలు, ఈజిప్షన్ యుద్ధాలు, గ్రీకు యుద్ధాలు, రోమన్ యుద్ధాలు వరసగా కనిపించాయి. ఈ యుద్ధాలలో రక్తం వరదలు వరదలైపారి ఆ ప్రదేశ మంతా మునిగిపోయింది. సీజర్ కనిపించాడు. అతడు బ్రిటన్‌పై దండెత్తటం కనిపించింది. సైతాను ఇలాగ న్నాడు: "బ్రిటన్ దేశీయులు సీజరుకు ఏమీ అపకా రము చెయ్యలేదు. అయితే వారిపై సీజరు ఎందుకు దండెత్తాడు? వారి దేశం జయించాలని, ఆ అనాగ రికులను చంపి వారి అనాధ భార్యలమీద, శిశువుల మీద రోమన్ నాగరికతను రుద్దాలని—

తరువాత క్రైస్తవమతజననం చూశాం. ఆ పిమ్మట కొన్ని శతాబ్దాల యూరప్ చరిత్ర చకచక మా కళ్ళఎదుట కనిపిస్తూపోయింది. క్రైస్తవ మతమూ, నాగరికతా, ఈరెండు చెట్టా పట్టా వేసు కుని యూరప్ అంతటా విహారం చేశాయి. ఆ

రెండూ అడుగుపెట్టిన చోటల్లా క్షామాలు, యుద్ధాలు, హత్యలు, శ్మశానాలూ సైతాను అన్నట్లు "తదితర మానవాభ్యుదయ కార్యక్రమాలూ" విలయతాండవం చేశాయి.

ఎంత సేపుచూసినా యుద్ధాలే. యూరప్‌లోనూ, ప్రపంచమంతటా ప్రతిచోటా, ప్రతిఏటా యుద్ధాలు, యుద్ధాలు, ఎడతెగని యుద్ధాలు. సైతాను అన్నట్టు ఈ యుద్ధాలకు ఒక్కొక్కసారి రాజుల్లో రాజులకు వచ్చే వ్యక్తిగత వైరాలూ, మరొక్కసారి బలహీన దేశాలను అనుభవించాలనే దురాశా కారణం. ధర్మ సంస్థాపనార్థం జరిగిన యుద్ధం అంటూ ఇంతవరకూ చరిత్రలో లేనేలేదని సైతాను అన్నాడు.

"సరే. ఇంతవరకూ మీ నరజాతి గతంలో సాధించిన మహత్తర అభ్యుదయంయొక్క చరిత్ర చూశారు. ఇక భవిష్యత్తులో సాధించే అభ్యుదయం ఎలా వుంటుందో చూపిస్తాను."

మానవుని భవిష్యచ్చరిత్ర మరీ భయంకరంగా వుంది. ఎక్కడా కని విని ఎరగని మారణాయుధాలు చూశాం. ప్రళయంతో సమానమైన యుద్ధాలు చూశాం. సైతాను తిరిగి ఉపన్యాసం ప్రారంభించాడు :

"చూశారా? మీ మానవజాతి ఎప్పటికప్పుడు అభ్యుదయం సాధిస్తూనే వుంది. కెయిన్ గదతో హత్యచేశాడు. యూదులు కత్తులతో, బల్లెములతో

హత్యలు చేశారు. గ్రీకులు, రోమన్లు కవచాలు, శిర స్త్రాణాలు ధరించి యుద్ధాలు చేశారు. వారు యుద్ధాలను కళగా పెంపొందించారు కూడాను. క్రైస్తవులు వచ్చి తుపాకులు కనిపెట్టారు. ఇంకా కొన్ని శతాబ్దాలు జరిగితే, అత్యంత భయంకరమైన, మారణాయుధాలు, వేలకొలది జనులను త్వరలో పరిమార్చగల దారుణాయుధాలు కనిపెట్టబడతాయి."

అని సైతాను మానవజాతిని హేళన చేస్తూ నవ్వసాగాడు. ఆ నవ్వు మాకు ఎంతైనా అవమానకరంగా తోచింది. కాని అతడు దేవత. మానవుల మానావమానాలతో అతనికి నిమిత్తం లేదు.

నవ్వటం పూర్తయ్యాక సైతాను తిరిగి మొదలెట్టాడు: "చాలా బావుందికదూ మీ అభ్యుదయం? అయిదారు వేల ఏళ్ళలో అయిదారు నాగరికతలు తలెత్తి, ఒక వెలుగు వెలిగి ఆరిపోయాయి. వాటిని పరిశీలించితే ఒక విషయం స్పష్టమవుతుంది. ఒక నాగరికత కంటె మరొక నాగరికత మారణాయుధాల ఉత్పత్తిలో అభివృద్ధి చూపించింది. తోడి మానవుణ్ణి చంపటమే మానవుడి ఏకైకాశయం. ఈ ఆశయసిద్ధికోసం మీ జాతి తనకున్న తెలివితేటలన్నీ మారణాయుధాలు తయారుచెయ్యటంలో వినియోగించింది. ఒకసారికంటే మరొకసారి శక్తివంతమైన, అపూర్వమైన ఆయుధాలు తయారు చేసింది. అయితే క్రైస్తవ నాగరికత పూర్వ నాగరికత

లన్నింటికంటే ఈ విషయంలో గొప్పదనిపించుకుంది. మీ మతస్థులు ఇందుకు నిస్సందేహంగా గర్వపడచ్చు. ఇంకా రెండు మూడు శతాబ్దాలు పోతే ప్రపంచంలో కల్లా నిపుణులైన హంతకులు క్రైస్తవులే నన్న విషయం నగ్నసత్యమై పూరుకుంటుంది. అప్పుడు క్రైస్తవులు కాని మిగతా ప్రపంచజనులు క్రైస్తవుల వద్దకు పోయి పాఠాలు నేర్చుకుంటారు. మత సంబంధమైన పాఠాలు కాదు; మారణాయుధాల ఉత్పత్తిని గూర్చి పాఠాలు నేర్చుకుంటారు. అరబ్బులు, చైనీయులు మీవద్ద కొనుక్కున్న ఆయుధాలతో మీ మిషనరీలనే చంపుతారు."

మళ్ళీ కొంతసేపు వివిధ దేశాలను, యుద్ధ దృశ్యాలను, ప్రజలమర్భరయాతనలను సైతాను ప్రదర్శించాడు. ఫిరంగుల మోతలతో, చనిపోయే సైనికుల అరుపులతో మా చెవులు గళ్లుపడిపోయాయి.

"ఇదంతా ఏమిటి? ఎందుకు? ఈ యుద్ధాలవల్ల మీ జాతికి ఒరిగే లాభమేమిటి? ఇన్నివేల సంవత్సరాలు హత్యలుచేసి మీరు ఏమిసాధించారు? ఎవరూ చెప్పలేరు. ఈ హత్యలవల్ల మీకు కాదు లాభించేది. మిమ్మల్ని పరిపాలించే రాజులకు, సార్వభౌములకు. ఆ రాజులకి, సార్వభౌములకి ప్రజలంటే ప్రేమనుకున్నారా? ఊహూ; ద్వేషం. మీరు నుట్టుకుంటే మైలపడ్డామని భావిస్తారు వారు. ఎవరికి సుఖం చేకూర్చటం కోసం మీరు రాత్రింబగళ్ళు చెమటోడ్చి పనిచేస్తారో,

ఎవరికోసం మీరు యుద్ధాలుచేస్తారో, యుద్ధాల్లో ప్రాణాలుత్యాగంచేస్తారో, ఎవరు మీరుపెట్టిన భిక్షతిని మిమ్మల్ని భిక్షుకులుగా పరిగణిస్తారో, ఎవరు మిమ్మల్ని నిరంతరం అణగదొక్కుతూ, అవమానిస్తూ, హింసిస్తూ మళ్లీ మీచేత స్తోత్రాలు చేయించుకుంటారో-ఆ రాజులకి చక్రవర్తులకీ మీరంటే గౌరవాభిమానాలుఉన్నాయను కుంటారా? ఉహు. మీరువారిదృష్టిలో గడ్డిపోచలకంటే చులకన. మొట్టమొదటిమానవుడు కపటబుద్ధిగలవాడు; పిరికిపంద. ఈగుణాలే అతని సంతతివారికి సంక్రమించాయి. ఈ గుణాల పునాది రాళ్ళమీదనే మానవ నాగరికతాసౌధం నిర్మించబడింది. మానవ నాగరికతకూ జై! కపటబుద్ధికీ, పిరికితనానికీ జై! ఈ గుణాలు శాశ్వతంగా ఉండాలని కోరుతూ మధువుసేవిద్దాం——" అంటూ సైతాను మా మొహాలకేసి చూశాడు. మానవులను అంతహేయంగా తిడుతున్నందుకు మా ముఖాలు లజ్జావమానాలతో ఎర్రబడినై. మేము అతని దూషణకు బాధపడుతున్నామని గ్రహించి అతడు స్వరంమార్చి అన్నాడు: "వద్దులే. నాగరికత ఎల్లాపోతే మనకేం? పరస్పర ఆయురారోగ్యాలు కోరుతూ మధువు తాగుదాం ఇప్పుడు మీ చేతుల్లోవున్న మధువు ఆకాశంలోంచి వచ్చినా భూలోకానికి చెందిన మధువే. అది ఇందాకటి కోరికకు మాత్రమే తగినది. అందుచేత ఈ పాత్రలు పారవేద్దాం. మీ ఆయురారోగ్యాలకోసం దేవలోకంలోని మధువు తెప్పిస్తాను.

ఏ మానవుడూ తాగని కొత్తరకం మధువు తాగుడురు గాని."

మేము చేతులు జాచాము. దూరంనుంచి ఆకాశంలో వాయ్యారంగా గిరగిర తిరుగుతూ మూడు మధుపాత్రలు మా చేతుల్లోకి వచ్చివాలాయి. ఆ పాత్రలు అతిలోకసుందరంగా వున్నాయి. వాటిని దేంతో చేశారో తెలియలేదు. ఆ పదార్థం ఏమిటో గాని మే మెన్నడూ చూసిందికాదు. మామూలు పాత్రలు గట్టిగా, నిశ్చలంగా ఉంటాయి. ఈ కొత్త పాత్రలు నీళ్ళలాగ ప్రవహిస్తున్నట్టు కనిపించాయి. ఆ కదిలేది పాత్రలో కాదో తెలియదు గాని ఆ పాత్రల రంగులుమాత్రం క్షణక్షణానికీ ప్రవహిస్తున్నట్టు కనిపించాయి. పాత్రల రంగులు రకరకాలుగా, చిక్కగా తళతళ మెరుస్తున్నాయి. ఒకచోట నిలకడగా ఉండకుండా ఒక రంగులోకి ఇంకొక రంగు ప్రవహిస్తూ, చిన్నచిన్న అలలుగా లేస్తూ, ఒకదానొ్నకటి ఢీకొని చిన్నచిన్న శబ్దాలతో విరిగిపడుతూ, ఎంతసేపు చూసినా తనివితీరని తన్మయత్వం కలిగించాయి. మధువు రుచి చూశాము. ఎంత అదృష్టం వుంటేనో ఆ మధువు తాగగలిగేది. నిస్సందేహంగా అది దేవతలు తాగే అమృతమే. తాగుతున్నంతసేపూ మాలోంచి స్వర్గమే ప్రవహిస్తున్నట్టు తోచింది. సెప్పీ కళ్ళు దివ్యానుభవంతో మెరిశాయి.

"మేము కూడా స్వర్గానికెప్పుడో వెడతాం కదూ?" అన్నాడు.

అని సైతానుకేసి ఓరగా చూశాడు. "అవును వెడతారు," అని సైతాను అంటాడేమోనని ఆశించాడు. కాని సైతాను వినిపించుకోనట్టు ఇంకేదో ఆలోచిస్తున్నాడు. అతడు సెప్పీ అన్నది వినే వుంటాడు. వినికూడా మాట్లాడకపోవడంతో మేము బేజారెత్తిపోయాము. సెప్పీ ఇంకా ఏదో అనబోతున్నవాడల్లా బిక్క మొహంవేసి చటుక్కున ఆగిపోయాడు. అయితే మాకు స్వర్గార్హత లేదేమోనన్న భావం ఇద్దరికి కలిగి చెప్పరాని భయం కలిగింది.

ఇంతలో మా చేతుల్లోని మధుపాత్రలు వాటంతట అవే గిరగిర తిరుగుతూ పైకెగిరిపోసాగాయి. కొంతదూరంపోయి మాయమయ్యాయి. అవి ఎందుకు వెళ్ళిపోయాయి ? అవి అలా వెళ్ళిపోవటం దుశ్శకునం అనిపించింది. మళ్లీ నా పాత్ర నాకూ, సెప్పీ పాత్ర సెప్పీకీ ఎప్పుడైనా కనిపిస్తాయా?

# 9

సైతానుతో మాకు పరిచయమై చాల రోజులైనా కాలంమీద, దూరంమీద అతనికి గల అధికారం మాకు ఎప్పటికి కప్పుడు కొత్తగా, వింతగా కనిపిస్తూనే వుంది. అసలు అతనికి కాల దూరాలనేవి

లేవేమోనని కూడా అనిపించేది. కాల దూరాలు మానవకల్పితాలనీ, అవి నిజంగా లేవనీ అతనొక సారి చెప్పాడు. భూగోళంలోని దూర దూర ప్రాంతాలకు అనేకసార్లు అతనితో కలిసి వెళ్లాము. వారాలు, నెలలుతరబడి ఆ ప్రదేశాల్లో సంచరించాము. అయినా నేను నిజానికి సెకండులో అర్ధభాగం కంటె ఎన్నడూ మాగ్రామం విడిచి వుండలేదు. ఈ సంగతి మావూరు తిరిగి రాగానే గడియారం చూస్తే స్పష్టపడేది.

మావూళ్లో మంత్రగత్తెల విచారణసంఘం ఒకటి ఏర్పడివుందని ఇదివరకే చెప్పాను. ఈ సంఘం వారికి మంత్రగత్తెలంటే ఎక్కడలేని భయం పట్టుకుంది. ఇదివరకటిలాగా యథేచ్ఛగా విచారణ చేయటానికి జంకుతున్నారు. మాయలూ, మంత్రాలు నేర్పాడని ప్రతీతి పడిన జ్యోతిష్కుణ్ణిగాని, ఇంద్రజాలాలు చేశారని దేశమంతా మారుమోగిన మార్గెట్, ఉర్సులాలను గాని విచారణ చెయ్యటానికి వారికి ధైర్యం చాలలేదు. అందుచేత గ్రామస్థులు అధికారులతో నిమిత్తం లేకుండా తమంతట తామే మంత్రగత్తెలను శిక్షించటానికి పూనుకున్నారు. ఒకరోజున ఒక మధ్యవయస్కురాలిని పట్టుకున్నారు. ఆమె సైతాను సహాయంతో రోగాలు నివారణ చేస్తోందని అపవాదు బయల్దేరింది. ఆరోజుల్లో వైద్యశాస్త్రం చిత్రహింసలతో కూడివుండేది. కత్తి పుచ్చుకుని పరపర

కోసెయ్యటం, గ్లాసులకొద్దీ రక్తం లాగెయ్యటం మొదలైన మోట పద్ధతుల్లో వైద్యం జరిగేది. ఈ మధ్య వయస్కురాలు అవేమీ లేకుండా రోగులను శుభ్రంగా స్నానం చేయించి, శుభ్రమైన ఆహారం ఇప్పించటంద్వారా రోగాలు నయంచేసేది. రోగాలు ఇంత సులభంగా నయమవటానికి సైతానుతో సంబంధంతప్ప మరేకారణం వుంటుంది? పట్టుకోండంటే పట్టుకోమన్నారు. ఆమె పరిగెత్తసాగింది. జనం గ్రామవీధులవెంట ఆమెని తరమసాగారు. ఆమె ఎవరింట్లో జొరబడి తల దాచుకోబోయినా ఆయింటి తలుపులు భళ్లున మూసుకునేవి. చివరి కిలాగయితేనేం పట్టుకున్నారు. గ్రామమధ్యంలో ఉరికొయ్య, ఉరితాడు సిద్ధం చేశారు. పాపం ఆమె ఏడుస్తూ, తానే పాపం ఎరగనని మొత్తుకుంది. ఆమె కూతురు నిస్సహాయంగా నుంచుని చూస్తూ ఏడ్చింది. అప్పుడు నేనూ సైతాను కూడా అక్కడే వున్నాము.

యథావిధిగా ఆస్త్రీ ఉరితీయుబడింది. అందరూ ఆమె శవంమీద రాళ్లు విసురుతున్నారు. ప్రతివాడూ తన పక్కమనిషి రాయి విసిరాడో లేదో ఓరకంటితో గమనిస్తున్నాడు. అందుచేత నేను కూడా లాంఛనంగా ఒకరాయి విసిరాను. అదిచూసి సైతాను పక పక నవ్వసాగాడు.

నవ్వు విని దగ్గిరగావున్నవారంతా నిర్ఘాంత పోయారు. సైతానుమీద (మావూళ్లో అతనిపేరు

ఫిలిప్ (టామ్) అదివరకే అందరికీ అనుమానంగా వుంది. ఎవరికీ గౌరవం చూపించకపోవటం, ఊరికి కొత్తవాడైనా అందరితో నిర్లక్ష్యంగా సంచరించటం, అతని అలౌకిక సంగీతం, మొదలైనవన్నీ చూసి గ్రామస్థులు అదివరకే గుసగుస లాడటం సాగించారు. ఇప్పుడు బహిరంగంగా, ఇంతమంది గ్రామస్థులను వెక్కిరిస్తున్నట్టు నవ్వటంతో వారికి మరీ ఒళ్లు మండి పోయింది. గుంపులో ఒక వడ్రంగి వున్నాడు; మదించిన ఏనుగుపిల్లలా గుంటాడు. అతడు సైతానుకేసి చూసి—

"ఏమిటయ్యా నవ్వుతున్నావు? ఎందుకు నవ్వుతున్నావో చెప్పు అసలు నువ్వు శవంమీద రాయి ఎందుకు విసరలేదో ముందు చెప్పు," అని గర్జించాడు.

సైతాను నిశ్చలంగా "నేను రాయి విసరలేదని నీకు నమ్మకమేనా?" అని అడిగాడు.

"నమ్మకమేమిటి? ఇందాకట్నించీ నినొ్నక కంట కనిపెట్టడంలేదనుకున్నావా?" అన్నాడు వడ్రంగి.

"అవును, నువ్వు రాయి. విసరలేదు. మేమూ చూశాం," అని మరి ఇద్దరు అరిచారు.

"ముగ్గురు సాక్షులు," అన్నాడు సైతాను. "మ్యూలర్ అనే పేరుగల వడ్రంగి, క్లీన్ అనే కసాయి దుకాణందారు, ఫీఫర్ అనే సాలెవాడు, ఈ

ముగ్గురూ ఇందుకు సాక్షులు. ముగ్గురూ అబద్ధాలకోర్లు. ఇంకా ఎవరైనా వున్నారా సాక్షులు?"

"ఉన్నారో లేదో తరవాత చూద్దాంలే. మేము అబద్ధాలకోర్ల మో కాదో తరవాత తేలుస్తాం. మేము ముగ్గురం చాలదూ నీ ప్రాణాలికి? ముందు, నువ్వు రాయి విసిరావని ఋజువు చెయ్యి."

"అవును, ఋజువు చెయ్యి," అని మిగతా జనం మీదికి తోసుకొచ్చారు.

తనకి ఇంతమంది జనం సహాయంగా రావటం చూసి వడ్రంగికి మరీ ధైర్యం కలిగింది. "అసలు నువ్వెందుకు నవ్వావో ముందు చెప్పు," అన్నాడు.

సైతాను చిరునవ్వు నవ్వి మృదుస్వరంతో సమాధాన మిచ్చాడు: "చావటానికి సిద్ధంగా వున్న ముగ్గురు పిరికి దద్దమ్మలు చనిపోయిన స్త్రీమీద కసితో రాళ్లు విసరటం చూసి నవ్వాను."

ఈమాటకు జనం హఠాత్తుగా ఎంత భయ కంపితులైందీ వర్ణించలేం. వడ్రంగి గుండె ఝల్లు మన్నా, మేకపోతు గాంభీర్యం తెచ్చుకుని అన్నాడు:

"మేము చస్తామని నీకు తెలుసా?"

"నాకా? అన్నీ తెలుసు. అసలు నేను జ్యోతి ష్కుణ్ణి. మీరు ముగ్గురూ రాళ్లు విసరటానికి చేతు లెత్తినప్పుడే, ముగ్గురి చేతులూ చూశాను. మీలో ఒకడు వచ్చేవారం చస్తాడు. మరొకడు ఈ రాత్రికి చస్తాడు. ఇంకొకడు ఇంకో అయిదు నిమిషాల్లో

గుటుక్కుమంటాడు. కావలిస్తే, అదిగో గోపుర గడియారం వుంది. చూడండి."

గుంపులో పెద్ద సంచలనం కలిగింది. అందరూ అప్రయత్నంగా గడియారం కేసి తిరిగారు. కసాయివాడు, సాలెవాడు భయంతో పారిపోయారు. వడ్రంగి మాత్రం ఇంకా ధైర్యంగానే వున్నాడు.

"చూద్దాం, నీ జోశ్యం ఎంత రైటో. ఇంక అయిదు నిమిషాల్లో నీమాట నిజం కాకపోతే, ఆతరవాత నువ్వు ఒక్క నిమిషం కూడా బతకవు, తెలుసా?" అన్నాడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. ఊపిరి బిగపట్టి గడియారం కేసి చూస్తూ నిమిషాలు లెక్క పెడుతున్నారు. నాలుగున్నర నిమిషాలు దాటింది. హఠాత్తుగా వడ్రంగి గుండె పట్టుకుని "బాబోయ్, నాకు చోటివ్వండి, ఊపిరాట్టం లేదు," అని అరుస్తూ, కిందపడి అరనిమిషం సేపు గిలగిల కొట్టుకుని చనిపోయాడు. జనం ఒక్కసారిగా వెనక్కి తగ్గారు. శవంవంకా, సైతాను వంకా నిర్ఘాంతపోయి చూశారు. అంతా నిశ్శబ్దంగా వుంది.

"నేను రాయి విసరలేదని ముగ్గురు సాక్ష్యం పలికారు. ఇంకా ఎవరన్నా వున్నారా? ఉంటే చెప్పండి," అన్నాడు సైతాను.

భయంతో వెర్రెత్తిపోయారు జనం. ఎవరూ అతనికి సమాధానం ఇవ్వలేదు కాని ఒకరి నొకరు తిట్టుకో సాగారు. "నువ్వే అన్నావు, అతడు రాయి విసరలేదని" "కాదు నువ్వే అన్నావు. "నువ్వూ అన్నావుగా." "నువ్వు ముందన్నావు." జాగ్రత్త నోర్మూయ్," "నేనన లేదు." "తంతాను దొంగ..." మరుక్షణంలో జనం ఒకర్నొకరు కొట్టుకుంటూ గలభా మొదలెట్టారు. ఈ గలభాతో నిమిత్తం లేకుండా, ఉరితీయబడిన స్త్రీ ఉరికొయ్యనుంచి గిర గిర వేళ్లాడుతూ, ప్రాణంలేని కళ్లతో అందర్నీ చూస్తోంది.

తరవాత మేము అక్కణ్ణించి వెళ్లిపోయాము. "సైతాను అబద్ధం ఆడడు. అతడు నవ్వింది వాళ్లని చూసి కాదు; నన్ను చూసి," అని లోపల అనుకున్నాను.

సైతాను మళ్లీ నవ్వాడు. "అవును నిజంగా నిన్ను చూసి నవ్వాను. నువ్వు ఆస్త్రీ శవంమీద రాయి విసిరావు. విసరకపోతే నీమీద ఎవరన్నా పితీలు చెబుతారేమో నని భయపడి విసిరావు. అంతేగాని నిజంగా యిష్టమై విసరలేదు. అందుకని నవ్వాను. అయితే నిన్నొక్కణ్ణే కాదు, మిగతావార్ని చూసి కూడా నవ్వాను."

"ఎందుకూ?"

"వాళ్లూ నీలాగానే రాళ్లు విసిరారు."

"అంటే?"

"అక్కడ అరవై ఎనిమిది మంది మనుష్యులున్నారు. వారిలో కనీసం అరవై ఇద్దరికైనా, రాళ్లు విసరాలనే కుతూహలం ఎంత మాత్రమూ లేదు. అయినా నీలాగానే భయపడి విసిరారు."

"నిజంగానా, సైతాన్?"

"అవును, నిజం. మీజాతి నాకు బాగా తెలుసు. వట్టి గొర్రెలమంద. మీజాతిని ఎప్పుడు చూసినా అల్పసంఖ్యాకులే పరిపాలిస్తూ వుంటారు. అధిక సంఖ్యాకులు తమ భావాలు, విశ్వాసాలు మనస్సులోనే దాచుకుంటారు. అల్పసంఖ్యాకులు నోరు పెట్టుకుని అరుస్తారు. అందుచేత అధికసంఖ్యాకులు తలకాయలు వంచుకొని అల్ప సంఖ్యాకులనే అనుసరిస్తారు. నోరుపెట్టుకుని అరిచే కొద్దిమంది ఒక్కొక్కసారి నిజమే అరుస్తారు; ఒక్కొక్కసారి అబద్ధం అరుస్తారు. వాళ్లు చెప్పింది నిజమైనా, అబద్ధమైనా గుంపు మాత్రం వారినే అనుసరిస్తుంది.

మీ జాతిలో, నాగరికసంఘంలో వారైనా, అనాగరికసంఘంలో వారైనా, అధిక సంఖ్యాకులు దయాహృదయులే; ఇతరులకు హానికలగటం, కలిగించటం సహించలేనివారే. అయినా దౌర్జన్య పరులైన అల్పసంఖ్యాకుల ముందు తమ దయాహృదయం విప్పి, తమ అభిప్రాయం వెల్లడించటానికి జంకుతారు. ఎంత చిత్రమో చూశావా? మీలో

నూటికి తొంభైతొమ్మిదిమందికి మంత్రగత్తెలను చంపటం ఇష్టంలేదని నాకు తెలుసు. అయినా ప్రతి వాడూ "మంత్రగత్తెలని చంపండి" అని బైటి కరుస్తాడు. బహుశా రాబోయే శతాబ్దాలలో ఎవరో కొందరు అల్పసంఖ్యాకులు మంత్రగత్తెల్ని చంప కూడదని నోరు పెట్టుకుని అగుస్తారేమో. బహుశా ఎవడో ఒకడే ధైర్యశాలి అలా అరవ్వొచ్చు. ఇహ వెంటనే మిగతా గుంపంతా అతనిమాట శాసనంగా భావించి అతని ననుసరించ ప్రారంభిస్తారు.

మీజాతి చరిత్రలో ఇన్ని సామ్రాజ్యాలు, నియం తృత్వాలూ, మతాలు సంభవించాయంటే దానికి ఒకటే కారణం. ప్రతివ్యక్తికీ పొరుగువాడిమీద అప నమ్మకం. ప్రతివ్యక్తీ పొరుగువాడికి తనమీద సదభి ప్రాయం ఉండాలనీ, లేకపోతే తను దుంపనాశనమై పోతాననీ భావిస్తాడు. ఇలా భావించటంవల్లనే, ఇది ఆధారం చేసుకుని ఇన్ని రాజ్యాలూ, మతాలూ వెలి శాయి. ఇంకా వెలుస్తాయి; మిమ్మల్ని ఇంకా అణగ దొక్కుతాయి; ఇంకా అధోగతికి లాక్కుపోతాయి. ఎందుకంటే మీరు అల్పసంఖ్యాకులకు బానిసలు. ఈ బానిసతనం మీకు పోదు. మీజాతి గొర్రెలమంద—"

మానవ జాతిని గొర్రెలమంద అనటం బాగులే దనుకున్నాను.

"నేనన్నది అబద్ధం కాదు. యుద్ధ సమయంలో చూడరాదూ?"

"ఏమిటి?"

"ఇంతవరకూ జరిగిన యుద్ధాల్లో న్యాయంకోసం ఎవడూ యుద్ధం ప్రారంభించలేదు. మరొక పదిలక్షల ఏళ్లు గడిచినా న్యాయయుద్ధం అంటూ ఉండదని హామీ యివ్వగలను. నోరుగల అల్ప సంఖ్యాకులే ఎప్పుడూ "యుద్ధం, యుద్ధం" అని అరుస్తారు. చర్చి అధికారులు ముందు కొంచెం సందేహిస్తూ "యుద్ధం ఏమంత మంచిది కాదు," అని నసుగుతారు. అసంఖ్యాక ప్రజలు నిద్రకళ్లు తుడుచుకుంటూ, ఈ యుద్ధం ఎందుకో తెలియక ఆలోచిస్తారు; "ఇది అన్యాయం; అపకీర్తికరం; యుద్ధావసరం లేనేలేదు," అని వాదిస్తారు. అప్పుడు యుద్ధం కావాలనే అల్ప సంఖ్యాకులు ఇంకా బిగ్గరిగా అరుస్తారు. అధిక సంఖ్యాకుల్లో కొద్దిమంది ఆలోచించగలిగినవారుంటే, వారు "యుద్ధం వద్దు. యుద్ధాన్ని త్యజించండి," అని ఉపన్యాసాలిస్తారు; పుస్తకాలు రాస్తారు. వీరిని మొదట్లో అంతా ప్రశంసిస్తారు. కాని యుద్ధకాములు వీరికంటే బిగ్గరిగా అరిచి వీరి మాట ప్రజలకి వినబడకుండా చేస్తారు. యుద్ధ వ్యతిరేకులు క్రమంగా పల్చబడి పోతారు. వారిమాట ఎవరూ వినిపించుకోరు. మరికొద్ది కాలానికి యుద్ధ వ్యతిరేకులను ఇదివరకు పొగడినవారే ఇప్పుడు రాళ్లు రువ్వుతారు; గొంతు నొక్కేస్తారు, లోపల యుద్ధం వద్దనుకుంటున్నవారే ఇదంతా చేసేది. చివరికి వాక్స్వాతంత్ర్యం మచ్చుకైనా వుండదు. ఎవడైనా

నోరు తెరిచినా నోట్లో కత్తులు దూర్చబడతాయి. దేశం దేశమంతా, చర్చితో సహా "యుద్ధం కావాలి" అని అరవటం మొదలెడుతుంది. తరవాత అధ్యక్షులు, ప్రధాన మంత్రులు మొదలైన బిరుదులు తగిలించుకున్న రాజకీయ నేతలు కొన్ని అబద్ధాలు కల్పిస్తారు. తాము ఏ దేశంమీద యుద్ధం చెయ్యబోతున్నారో ఆ దేశంమీద అబద్ధ నేరాలు బోలెడు మోపుతారు. ఈ నేరాలు నిజమైన వేనని ప్రజలు నమ్మి "ఆ, మనం తప్పుపని చెయ్యటం లేదు. తప్పంతా ఆ దేశానిదే" అని తమ్ముకి తాము నమ్మించుకుంటారు. కాదని ఎవడన్నా అంటే నోరు నొక్కేస్తారు. ఈవిధంగా ఆత్మవంచన చేసుకొని తృప్తిపడి యుద్ధానికి ఆయత్తమవుతారు. ఇదీ మీజాతి గొప్పదనం!"

# 10

రోజులకి రోజులు గడిచిపోతున్నాయి. కాని సైతాను జాడ ఎక్కడా లేదు. సైతాను సాన్నిధ్యానికి అలవాటయిన తరవాత అతడు లేని క్షణాలు ఎంత నిర్జీవంగా, నిరుత్సాహంగా ఉంటాయో చెప్పనక్కరలేదు.

జ్యోతిష్కుడు యథా ప్రకారంగా గ్రామంలో విశృంఖల విహారం చేస్తూనే వున్నాడు. అతడు మంత్రగాడనే అభిప్రాయం ప్రబలి వున్నందున ఎవ్వరూ

అతని చాయలకు పోవటంలేదు. కాని అడపా దడపా ఎవడో ఒకడు భయపడుతూ భయపడుతూ రాయి విసిరి పారిపోవటం కూడా జరుగుతోంది.

సైతాన్ను చూసినప్పటి నుండీ మార్గరెట్ అతనిమీద శ్రద్ధ పెట్టుకున్న మాట వాస్తవం. అయితే సైతాను ఒకటి రెండుసార్ల కంటె ఎక్కువ ఆమె ఇంటికి వెళ్లలేదు. తనకోసం ఊళ్లో పడుచువాళ్లు అంత మోజుపడుతుండగా, సైతాను తన్ను నిర్లక్ష్యం చెయ్యటం, ఆమెకు ఒకింత గర్వభంగమే అయింది. ఆ కారణంచేత మార్గరెట్ సైతాను మీద మోజు క్రమంగా తగ్గించివేసుకోసాగింది. అటు విల్హెల్మ్ మీడ్లింగ్ పరిస్థితి కూడా మొదట్లో అలాగే అయింది. తన ప్రియురాలు మార్గరెట్ సైతాను మీద మరులు కొన్నదని అతడు దిగులు పెట్టుకున్నాడు. విరక్తితో పొద్దస్తమానమూ మద్యం తాగుతూ గడపసాగాడు. రోజు రోజుకీ విల్హెల్మ్ చెడిపోతున్నాడని వృద్ధదాసి ఉర్సులా మార్గరెట్ చెవిలో ఇల్లుకట్టుకుని నూరేది. విల్హెల్మ్ ఇలా పాడైపోవటానికి తన చపల చిత్తమే కారణం గదా అని మార్గరెట్ ఎంతో పశ్చాత్తాపపడి ఏడ్చింది. చివరికొకరోజున అతనికి కబురు చేసింది; తన పినతండ్రి కేసు త్వరలో విచారణకు రాబోతోంది కనుక ఆయన పక్షాన వకాల్తా పుచ్చుకుని వాదించవలసిందని కోరింది. మార్గరెట్ నుంచి ఇన్నాళ్లకు కబురందగానే విల్హెల్మ్ విరక్తి పటాపంచలై పూర్వపు

ఉత్సాహం తిరిగి వచ్చింది. తాగుడు వదిలి వేశాడు. ఫాదర్ పీటర్ కేసుమీద శ్రద్ధవహించాడు. తరుచు, పెప్పీని చాలాసార్లు తన ఆఫీసుగదిలో కూర్చుండ బెట్టుకుని కేసు వివరాలన్నీ మళ్లీ మళ్లీ చెప్పించు కున్నాడు. ఎంత చేసినా అతనికి ఈ కేసు గెలుస్తుందనే నమ్మకం ఏర్పడ లేదు. ఫాదర్ పీటర్ మీద, మార్గరెట్ మీద అభిమానం కొద్దీ పనిచేయ నిశ్చయించు కున్నాడే గాని కేసు మాత్రం బహు బలహీనంగా వుందని అతడెరుగును.

"ఇప్పుడు గనక సైతాను వస్తే!" అని నిరం తరమూ అనుకునేవాణ్ణి. ఏదో చేసి కేసు గెలిపిస్తాడు. కేసు గెలుస్తుందని అతడు చెప్పనే చెప్పాడు. అందు చేత గెలిచే విధానం కూడా అతనికి తెలిసి వుంటుంది.

కాని ఎన్ని రోజులైనా సైతాను రానే లేదు. కేసు గెలుస్తుందని, ఆ నిమ్మట ఫాదర్ పీటర్ కష్టా లన్నీ తొలగి పోతాయని, ఆయనకి మంచి రోజులు వస్తాయనీ, నాకు ధైర్యం వున్నప్పటికీ, అదెల్లా జరుగు తుందో తెలియనందున, అదేపనిగా తహతహ లాడి పోయాను. నిజానికి ఫాదర్ పీటర్ ఇక ముందైనా సుఖపడితే గాని లాభం లేదు. ఇప్పటివరకూ ఆయనకి కష్టాలమీద కష్టాలే. అందులో జైలు జీవితం మూలం గానూ, అవమాన భారం వల్లనూ ఆయన మరీ క్రుంగి, కృశించి పోయాడని విన్నాను. త్వరలో విడు దల కాకపోతే ఇంకెన్నాళ్లు బతుకుతాడు!

ఎలాగైతే నేం విచారణ దినం వచ్చింది. విచారణ చూట్టానికి ఎక్కడెక్కడి జనం వచ్చారు. దూరపు గ్రామాలనుండి కూడా వచ్చారు. కోర్టు మందిరం కిటకిట లాడింది. అందరూ అక్కడవున్నారు గాని నిందితుడు మాత్రం లేడు. ఆయన మరీ బలహీనంగా వున్నందున కోర్టులోకి తీసుకు రావటానికి వీల్లేక పోయింది. మార్గరెట్ వచ్చింది. లేని ధైర్యం తెచ్చుకుని ఒక చోట కూర్చుంది. కేసుకు మూల కారణమైన డబ్బు కూడా అక్కడ హాజరుపరచ బడింది. ఒకబల్లమీద సంచీ గుమ్మరించారు. గుప్పిళ్లతో నాణాలు తీసుకుని, దుందవెట్టే వేళ్లతో ముద్దులాడి, జేబులో వేసుకోటానికి వీల్లేనందుకు లోపల్లోపల ఏడ్చే మహాభాగ్యం కొంతసేపుంది కోర్టు అధికారులకే దక్కింది. మిగతా ప్రేక్షకులంతా అంత డబ్బు చూసి లొట్టలు వెయ్యటం తప్ప ఇంకేం చెయ్యలేక వూరుకున్నారు.

జ్యోతిష్కుడు బోనులో నుంచున్నాడు ఈ సందర్భానికిగాను అతడు తనకున్న దుస్తుల్లోకల్లా మంచి ఖరీదైనవి ధరించి వచ్చాడు.

ప్రశ్న:—ఈ డబ్బు నీదని వాదిస్తున్నావు కదూ?

జవాబు:—అవును.

ప్ర:—ఇంతడబ్బు నీకెక్కడిది?

జ:—నేను ఒకసారి పొరుగూరి నుంచి మన వూరు తిరిగి వస్తుండగా రోడ్డుమీద దొరికింది.

ప్ర:—ఎంతకాల మైంది?

జ:—రెండేళ్లు దాటింది.

ప్ర:—తరవాత ఏం చేశావు?

జ:—ఇంటికి తీసుకొచ్చి నాగోపురంలో ఒక రహస్య స్థలంలో దాచాను. ఆడబ్బెవరిదో కనుక్కొని వారికి తిరిగి ఇచ్చి వేయాలను కున్నాను.

ప్ర:—మరి కనుక్కొన్నావా?

జ:—చాల నెలలపాటు అతి శ్రద్ధగా వాకబు చేశాను. కాని ఆ పోగొట్టుకున్న మనిషెవరో తెలియ లేదు.

ప్ర:—తరవాత?

జ:—ఇక వాకబు చెయ్యటం అనవసరమను కున్నాను. మనవూళ్లో వున్న అనాథశరణాలయం తాలూకు భవనం పూర్తి చెయ్యటానికి ఈ డబ్బు వినియోగిద్దామను కున్నాను. అప్పుడు రహస్యస్థలం నుంచి డబ్బు ఇవతలకు తీసి అంతా ఉందో లేదో లెక్క బెడుతున్నాను. అప్పుడు—

ప్ర:—చెప్పు. ఆగావేం?

జ:—క్షమించాలి, నిజం చెప్పవలసి వస్తున్నందుకు. డబ్బు లెక్కపెట్టి యథాస్థానంలో దాచి, లేచి నుంచుని చూస్తే నా వెనకాలే ఫాదర్ పీటర్ ఉన్నాడు.

ప్ర:—అప్పుడు నువ్వు కంగారు పడ్డావా?

జ:—ఊహూ. అప్పుడు ఆవిషయమై నేనేమీ అనుకోలేదు. అలా అప్పుడప్పుడు ఒకటీ అరా అవసమైతే నాదగ్గిరికి రావటం ఫాదర్ పీటర్‌కి అలవాటే.

ఈమాటక్కూడా విని మార్గరెట్ అవమానంగా భావించింది. తనపినతండ్రి సచ్ఛుడైన జ్యోతిష్కుని వద్దకు వెళ్లి చేబదుళ్లు తెచ్చుకుంటాడన్నమాట అబద్ధమని చెప్పేద్దామని లేవబోయింది. కాని మళ్లీ తమాయించుకుని ఆగింది.

ప్ర:—ఊఁ. తరవాత?

జ:—చివరికి ఆధనం అనాథశరణాలయానికివ్వటానికి జంకాను. మరొక ఏడాదిపాటు ఆగి చూద్దామనుకున్నాను. ఫాదర్ పీటర్‌కి డబ్బుదొరికిందనే కబురువిని నేనేమీ అనుమానించకపోగా సంతోషించాను. రెండురోజులతరవాత నా వద్ద డబ్బుచూసుకుంటే, లేదు. అప్పుడు కూడా ఫాదర్ పీటర్‌మీద అనుమానం కలగలేదు. కాని మూడు కారణాలుబట్టి ఆయనే దొంగిలించి వుంటాడని అభిప్రాయపడ్డాను.

ప్ర:—ఏమిటవి?

జ:—ఫాదర్‌పీటర్‌కు కాలిబాటమీద డబ్బు దొరికింది; నాకు రోడ్డుమీద దొరికింది. ఫాదర్ పీటర్ డబ్బు అచ్చగా బంగారపు డకట్లే తప్ప మరొక లోహంకాదు; నాడబ్బూ అంతే. ఇహ డకట్ల సంఖ్య

కూడా సరిపోయింది; సరిగా పదకొండువందల ఏడు డకట్లు.

అక్కడితో జ్యోతిష్కుని సాక్ష్యం ముగిసింది. కోర్టువారు, మిగతావారూ కూడా అతని సాక్ష్యం బలంగా ఉందని భావించారు.

పిల్లైల్మమిూడ్లింగ్ జ్యోతిష్కుణ్ణి కొన్ని ప్రశ్న లడిగాడు. తరవాత మమ్మల్ని పిలిచాడు. మేము బోనులో కెక్కి మాకథ అంతా చెప్పాము. జనం వేళా కోళంగా నవ్వారు. మేముచాలా సిగ్గుపడ్డాము. పిల్లైల్మ మిూడ్లింగ్ కూడా పైకి నిబ్బరంగా ఉన్నా, లోపల నిరాశచేసుకునే వున్నాడు. జ్యోతిష్కుడు వట్టి నీచు డని ఊళ్లో అందరికీ తెలుసు; అయినా అతడు చెప్పింది అంతా కాకపోతే కొంతైనా నమ్మటానికి వీలుగా వుంది; ఫాదర్ పీటర్ వైపు సాక్ష్యం బొత్తిగా నమ్మవీలుగాకుండా వుంది.

మాసాక్ష్యం అయిన తరవాత జ్యోతిష్కుని తరఫు న్యాయవాది లేచి మమ్మల్ని ప్రాసుపరీక్ష చెయ్యననీ, చేస్తే మమ్మల్ని మరీ అవమానించినట్టవు తుందనీ అన్నాడు. ఈమాటలకి జనం మళ్ళీ నవ్వారు. తరవాత అతడు మా కథమిూద వ్యంగ్యంగా, హేళ నగా చిన్న ఉపన్యాసం ఇచ్చి ప్రేక్షకులను తిరిగి నవ్వించాడు. నాకూ, సెప్పీకి ముఖాలు రామ్ము లక్కాయల్లాగ ఎర్రబడిపోయినయ్; కళ్లనీళ్ల పర్యంతం అయింది. మార్గెట్ ఇక ఆపుకోలేక ఒక్కసారిగా

ఏడుపు మొదలెట్టింది. ఆమెను చూస్తే నాకెంతో జాలి వేసింది.

ఇంతలో నా వొళ్లు ఝల్లుమని పులకరించింది. హెల్మ్ మిాడ్లింగ్ పక్కన సైతాను నిలుచుని వున్నాడు. సైతానుకూ మిాడ్లింగ్‌కూ ఎక్కడా పోలికే లేదు. సైతాను ఠీవిగా, నిర్భయంగా, ప్రకాశ వంతంగా ఉన్నాడు. మిాడ్లింగ్ నిరుత్సాహంగా సిగ్గు కారుతున్నాడు. సైతాన్ని చూసేసరికి మాకు ధైర్యం కలిగింది అతడు వచ్చాడుగనక మా పక్షం నెగ్గు తుంది; తెలుపునలుపు, నలుపు తెలుపు అని, లేక అసలు ఇష్టంవచ్చిన రంగు అని నమ్మించగలడు. సైతాన్ని చూసి జనం ఏమనుకుంటున్నారోనని చుట్టూరా చూశాము. కాని ఎవరూ అతనివంక చూడ టమే లేదు. అందుచేత అతడు మిగతా వారికి అగోచ రుడై వున్నాడని గ్రహించాము.

జ్యోతిష్కుని తరఫు న్యాయవాది తన ఉపన్యా సము ముగించబోతున్నాడు. ఆ సమయంలో సైతాను నెమ్మదిగా విల్హెల్మ్‌లో ఐక్యంకావటం మొదలెట్టాడు. విల్హెల్మ్‌లో హఠాత్తుగా మార్పువచ్చింది. అతని కళ్లు, ముఖం తేజస్వంతమైనాయి.

న్యాయవాది ఈ విధంగా ముగించాడు.

"అదుగో చూడండి, బంగారం! ఇదే సమస్త పాపాలకు కారణభూతమైనది. ఇదే యుగయుగాల నుంచి మానవమాత్రులను పాపపంకంలోకి ఈడుస్తు

న్నది. ఆఖరికి భగవంతుని అర్చకుడైన ఈ మతగురువును, ముక్కుపచ్చలారని ఈ ఇద్దరు పసిగండాలను కూడా ప్రలోభపరచింది. ఈ బంగారు నాణాలకే గనక నోరుంటే తాము ఒక మత గురువును కూడా లొంగదీసుకున్నందుకు గర్విస్తున్నామని తప్పక చెప్పగలవు."

న్యాయవాది కూర్చున్నాడు. విహ్లెల్మ్ లేచాడు.

"ఈ డబ్బు రెండేళ్ల కిందట రోడ్డుమీద తనకు దొరికిందని ఫిర్యాది చెబుతున్నాడు. అంతేగదండీ?" అని విహ్లెల్మ్ జ్యోతిష్కుని కేసి తిరిగి అడిగాడు. జ్యోతిష్కుడు అవునన్నాడు.

"ఆవిధంగా దొరికిన ధనం ఒకానొక దినం వరకూ అంటే గత డిసెంబరు మాసం ఆఖరు తేదీ వరకూ తనవద్దనే ఉందనికూడా ఫిర్యాది చెప్పాడు. అంతేకదండీ?" అని మళ్ళీ అడిగాడు. జ్యోతిష్కుడు మళ్లీ తల ఊగించాడు. విహ్లెల్మ్ జడ్జీలకేసి తిరిగి "కోర్టులో హాజరు పరచబడిన ధనమున్నూ, ఫిర్యాదికి దొరికిన ధనమున్నూ ఒకటి కాదని నేను నిరూపిస్తే ఈ ధనం ఫిర్యాది ధనం కాదని ఋజువైనట్లే కదా ?" అన్నాడు.

"అవును. కాని అదెలా కుదురుతుంది? మీకు కొత్తసాక్షు లెవరైనావుంటే ముందుగానే మాకు తెలియపరచవలసివుంది," అని ఒక జడ్జీ అని మిగతా

జడ్జీలతో ఏదో సంప్రదించసాగాడు. ఈ లోగా ప్రతి పక్షపు న్యాయవాది కోపంతెచ్చుకుని లేచి, ఇప్పుడు కొత్త సాక్షులను ప్రవేశపెట్టడం అన్యాయమని వాదించాడు.

"నేను ప్రవేశపెట్టబోయేది కొత్త సాక్షి కాదు, పాత సాక్షినే. ఆ సాక్షిని కోర్టువారు కొంతవరకూ పరీక్షించారు కూడాను," అన్నాడు షిల్లాల్మ్.

"ఎవరది?"

"ఈ ధనమే."

"ఈ ధనమా? ఈ ధనం ఏమి చెబుతుంది?"

"ఏమి చెబుతుందా? ఏదైనా చెబుతుంది. జ్యోతిష్కుడికి దొరికిన డబ్బు తనుకాదనీ, జ్యోతిష్కుని వద్ద నుంచి డబ్బుపోయిన తర్వాతే తను పుట్టానని చెబుతుంది. మాటల్లో చెప్పలేకపోయినా, తనమీద గల సంవత్సరం సంఖ్య ద్వారా సాక్ష్యం చెప్పగలదు."

కోర్టులో పెద్ద అలజడి చెలరేగింది. ప్రతి పక్ష న్యాయవాది, జడ్జీలు కంగారుపడి గబగబ నాణాలుతీసి పరిశీలించారు. "అరె! అరె." అని విస్తుపోయారు. "నిజమే, నిజమే" అన్నారు. అందరూ షిల్లాల్మ్‌ను ఒకటే మెచ్చుకోవటం మొదలెట్టారు. అతనికి అంత మంచి ఆలోచన, ఎవరికీ తట్టనిది తట్టినందుకు ఆశ్చర్యపడ్డారు. చివరికి న్యాయమూర్తులు ఇలా తీర్పు ఇచ్చారు.

"ఈ బంగారు నాణాల్లో నాలుగు తప్ప మిగతా వన్నీ కొత్త సంవత్సరంలో ముద్రించబడినవే. కనుక కోర్టువారు, అమాయకుడు, నిర్దోషి అయిన ముద్దాయికి తమ హృదయపూర్వక సానుభూతి తెలుపుతున్నారు. దురదృష్టవశాత్తు జరిగిన పొరపాటువల్ల ఆయనకి కష్టం కలిగించినందుకు విచారిస్తున్నారు. కేసు కొట్టివేయడమైనది."

జనం అంతా లేచి ఇవతలకొచ్చారు. మార్గరెట్‌ను అభినందించారు. తరువాత విల్హెల్మ్‌ను అభినందించారు. ఈలోగా సైతాను విల్హెల్మ్‌లోనుంచి ఇవతలికొచ్చి నుంచున్నాడు. జనం అతనిగుండా నడిచి పోతున్నారు, అక్కడ ఏమీ లేనట్టే.

విల్హెల్మ్ తనకు నాణాలమీద అంకె సంగతి ఎలా తట్టిందో తనకే తెలియటం లేదన్నాడు. తనకు ఆ నాణాలు ఏ సంవత్సరానివో అదివరకు తెలియక పోయినా, ఆక్షణంలో తెలిసినట్టు అనిపించిందన్నాడు. విల్హెల్మ్ మంచివాడు గనక ఆమాట అన్నాడు. ఇంకోడైతే తనకు మొదటినుంచీ తెలుసుననీ, గమ్మత్తు చేద్దామని చివరిదాకా బయటపెట్టలేదని కోతలుకోసేవాడే.

సైతాను ఇవతలకు రాగానే విల్హెల్మ్ తేజస్సు తరిగి మామూలు మనిషి అయ్యాడు. మార్గరెట్ అతన్ని మెచ్చుకుని 'నిన్ను చూసి గర్విస్తున్నాను,' అన్నది. ఆముక్క విని మళ్లీ అతనికళ్లలోకి ఇందాకటి తేజస్సు వచ్చింది జ్యోతిష్కుడు నేల మట్టానికి కుంగి

పోయి, తనలో తను తిట్టుకుంటూ వెళ్లిపోయాడు. సాలమన్ ఐజాక్స్ డబ్బు తీసుకుని వెళ్లిపోయాడు. ఇప్పుడా డబ్బు ఫాదర్ పీటర్ దే ననటంలో సందేహం లేదు.

సైతాను మాయమయ్యాడు. బహుశా ఫాదర్‌కి విడుదల వార్త చెప్పటానికి జైలుకి వెళ్లివుంటాడను కున్నాను. మార్గరెట్, మిగతా వాళ్లం అందరం కలిసి జైలుకి వెళ్లాము.

ఈలోగా సైతాను అక్కడ చేసింది ఇది; ఫాదర్ పీటర్‌కు కనిపించి "విచారణ పూర్తయింది. నువ్వు దొంగవని తీర్పు చెప్పారు," అన్నాడు. ఇది వినగానే పాపం ఫాదర్ పీటర్ మతి చలించింది. మేము వెళ్లేటప్పటికి పూర్తిగా పిచ్చివాడై పోయాడు. జైలు గదిలోనే అటూ ఇటూ పచార్లు చేస్తూన్నాడు. తానొక సార్వభౌముడినని భావించుకున్నాడు. కాపలా వాణ్ణి ద్వారపాలకుడుగాను, జైలుఅధికారిని మంత్రిగాను, భావించుకుని వారికి ఏవేవో ఆజ్ఞలిస్తున్నాడు. అతని ముఖంలో అదివరకెప్పుడూ కనబడని ఆనందం వెల్లివిరుస్తోంది. భూలోకంలో తనంత గొప్పవాడు, భాగ్యశాలి లేడని గర్వంగా ఉన్నాడు.

మార్గరెట్ పిన తండ్రిపై పడి ఏడవ నారంభించింది. ఫాదర్ పీటర్ పరిస్థితి చూస్తే అందరి హృదయాలూ ద్రవించాయి. ఆయన మార్గరెట్‌ను గుర్తుపట్టాడు; కాని ఆమె ఏడవటానికి కారణమేమిటో

తెలియలేదు. బుజంమీద తట్టి అన్నాడు: "ఏడుస్తా వేమిటి? యువరాణివై వుండి ఇంతమంది ముందు ఏడుస్తావా? తప్పుకాదూ! ఛా, ఏడవబోకు. అసలు నీ కష్టమేమిటో చెప్పు. నేను నిమిషంలో తీరుస్తాను. చక్రవర్తినైన నేను చేయలేని దేముంది!" వెనక్కి తిరిగాడు. వృద్ధదాసి ఉర్సులా కళ్లుతుడుచు కోవటం చూశాడు. "అరెరె! నువ్వు కూడా ఏడుస్తున్నావే? ఎందుకూ?" అన్నాడు.

ఉర్సులా ఏడూస్తూనే "మీరిలా అయిపోయినందుకు" అని సమాధాన మిచ్చింది. ఫాదర్ పీటర్ విల్హెల్మ్‌ను చూసి "ఓహో! భారత దేశ యువరాజుగారా? మిమ్మల్ని గూర్చే మా యువరాణి విచారిస్తోందను కుంటాను. ఆమెకు సౌఖ్యం చేకూర్చటం నావిధి. కనుక మీ కిద్దరికీ నే నడ్డంరాను. ఇకమీద ఆమె మీదే. మీకు నా రాజ్యం కూడా అప్పగిస్తాను ఏం యువరాణీ! నే చెప్పింది బాగుందా? బావుంది కదూ? మరి ఇప్పుడు నవ్వు. ఒక్కసారి నవ్వు."

మార్గరెట్‌ను ప్రేమతో నిమిరి ముద్దు పెట్టుకున్నాడు. ఫాదర్ పీటర్ అమిత సంతోషంగా ఉన్నాడు. ఆయన మనస్సులో ఏ విధమైన చీకూ, చింతా, అసంతృప్తి లేవు. మమ్మందరినీ చూస్తుంటే ఆయనకు ఊరికే ప్రేమ పుట్టుకొస్తున్నట్టుంది. కనిపించిన ప్రతివాడికీ ఒక రాజ్యమో, పరగణాయో ఏదో ఒకటి బహూకరించటం మొదలెట్టాడు. మార్గరెట్ 'ఇక ఇంటికి

పోదాము' అని ఎంతోసేపు బ్రతిమలాడిన పిదప ఆయన ఇంటికి రాజుగారిలాగ బయలుదేరాడు. దోవ పొడుగునా జనం ఆయన్ని చూసి పిచ్చుడల అయినందుకు హర్షధ్వానాలు చేశారు. అవన్నీ తను చక్రవర్తి అయినందుకు ప్రజలు చేసే జయజయ శబ్దాలుగా భావించి ఆయన తలవంచి కృతజ్ఞత తెలిపాడు. ఆదృశ్యం హృదయ విదారకంగా వుంది.

దోవలో నాకు సైతాను కనిపించాడు. "నాతో దొంగమాట లెందుకు చెప్పావని" అడిగాను. అతడు చలించలేదు. ఇలా అన్నాడు:

"నువ్వు పొరపడ్డావు మిత్రమా! నేను చెప్పింది అబద్ధం కాదు; అక్షరాలా నిజం. జీవితాంతం వరకూ ఫాదర్ పీటర్ ఆనందంలో మునిగి తేలుతూ వుంటాడని చెప్పాను. అలాగే వుంటాడు కూడాను. ఎందుకంటే తను చక్రవర్తిననే నిశ్చయమూ భావిస్తూ వుంటాడు. ఈభావం జీవితాంతంవరకూ ఉంటుంది. అందుచేత అతని కంటె గొప్ప సంతోషవంతుడు ఈ దేశంలో మరొకడుండడు."

"అతనికి సంతోషం ఉన్నమాట నిజమే, కాని ఆసంతోషం ఉన్మాదంవల్ల వచ్చినది. ఉన్మాదంతో తప్ప మరొక విధంగా ఆయనకు సంతోషం కలిగించలేవా?" అని అడిగాను.

సాధారణంగా సైతానుకు చిరాకు పుట్టించటం కష్టం. కాని నా ప్రశ్నతో అతనికి కొంచెం చిరాకు కలిగింది.

“రాజమ్మ లాగా మాట్లాడకోకు. నీకింత మాత్రం తెలియదూ? మతి సరిగ్గా వున్న వాడెవడూ సంతోషంగా ఉండలేడు మతికీ సంతోషానికీ విరోధం. ఎందుకంటే మతి వున్న వాడు జీవిత యథార్థస్వరూపం చూడగలడు; చూసి, జీవితం ఎంత భయంకరమైనదో గ్రహించగలడు. పిచ్చివాళ్లు మాత్రమే సంతోషం పొందగలరు అదైనా, అందరు పిచ్చివాళ్లూ కాదు; రాజులమనో, దేవతలమనో ఊహించుకునే కొద్దిమంది పిచ్చివాళ్లు మాత్రమే సంతోషంగా వుంటారు. మిగతా పిచ్చివాళ్లు మంచివాళ్ల మాదిరిగానే బాధ అనుభవిస్తారు. అంటే, మంచివాళ్లనబడే వాళ్లకి ఎప్పుడూ పూర్తి మతి ఉంటుందని కాదు నేననేది. అయితే వాళ్ళు పిచ్చివాళ్ళంత అన్యాయం కాదు గనక మంచి వాళ్లంటున్నాను.

మానవజాతి ‘మనస్సు’ అని గొప్పగా చెప్పుకునే ఆ పదార్థాన్ని ఫాదర్ పీటర్ నుండి లాగేసుకున్నాను. దాని ఫలితం చూసి నువ్వు విమర్శిస్తున్నావు. అతనికి ఎడతెగని సంతోషం ఇస్తానని అన్నాను. అట్లాగే ఇచ్చాను. మీజాతికి సంతోషం కలిగించేందు కొకటే విధానం ఉంది; ఆ విధానంతోనే

అతనికి సంతోషం కలిగించాను. అయినా నువ్వు విమర్శిస్తున్నావు."

సైతాను కొంచెం ఆగి నిస్పృహగా నిట్టూర్పు విడిచి "ఈజాతిని తృప్తిపరచడమంత కష్టం మరోటి లేదు," అన్నాడు.

మానవజాతి దుర్లక్షణాలన్నిటిలోకీ ముఖ్యమైనది ఆత్మవంచన అని సైతాను చెప్పాడు: "శైశవం నుంచి వృద్ధాప్యంవరకూ మానవుడు తన్ను తాను మోసం చేసుకుంటూ తాను నిజమైన జీవితము గడుపుతున్నానను కుంటాడు. తనకు ఉన్నాయని మానవుడూహించుకునే మంచి గుణాల్లో ఒక్కటీ అతనికి లేదు. తను బంగారమని అనుకుంటాడు గాని అతడు వట్టి ఇత్తడి సరుకు. ఉదాహరణకి హాస్యం తీసుకో—"

"ఆ, అది మాకున్నది. మా తత్వంలోనే హాస్యం ఉన్నది—" అన్నాను నేను.

"ఆమాట అంటావో అనవో నని చూస్తున్నాను. అనేశావు. తనకు లేని ప్రతి సద్గుణమూ తన కున్నదని భావిస్తాడు మానవుడు. మీకు హాస్యం ఉన్నదంటావా? లేదు. మీకు ఉన్న ఆకొద్ది హాస్యమూ చాలా తక్కువ తరగతికి చెందినది. నేను చెప్పేది ఉత్తమమైన, ఉదాత్తమైన హాస్యం."

మేము ఆ సమయంలో ఆకాశంలో ప్రయాణం చేస్తున్నాము. ఇండియాలో ఒక చిన్న పట్టణం వద్ద ఆగాము. గారడీవాడొకడు తన విద్య ప్రదర్శిస్తు

న్నాడు. చాలమంది జనులు అతని చుట్టూ మూగి గారడీ చూస్తున్నారు. గారడీ చాల బాగుంది. కాని సైతాను ఇంతకంటె అద్భుతమైన పనులు చెయ్య గలడని నాకు తెలుసు. కొన్ని తమాషాలు చేసి ఈ జనులకి చూపించమని అడిగాను. సైతాను చేస్తానన్నాడు. భారతీయుడుగా మారిపోయాడు. పంచ, తలపాగా ధరించాడు. నాకు కూడా తాత్కాలికంగా భారతీయుల భాష తెలిసేటట్టు చేశాడు.

గారడీ వాడు ప్రేక్షకులకు ఒక విత్తు చూపించాడు నిండా మట్టిగల ఒక కుండీలో దాన్ని పాతిపెట్టాడు కుండీమీద గుడ్డ కప్పాడు. ఒక నిమిషం అయిన తర్వాత గుడ్డ మెల్లిగా లేవ నారంభించింది. పది నిమిషాల్లో ఒక అడుగెత్తున లేచింది. తరవాత గారడీ వాడు గుడ్డ తీసివేసి ఒక చిన్న చెట్టు, ఆకులు, ఒక పండు ప్రదర్శించాడు. మేము పండు తిన్నాము. తియ్యగా వుంది. సైతాను గారడీవాణ్ణి అడిగాడు:

"కుండీమీద గుడ్డ కప్పుతా వెందుకు? అది లేకుండా చెట్టు మొలిపించ లేవా?"

"ఉహు" అన్నాడు గారడీ వాడు. "ఎవ్వడూ చెయ్యలేడది."

"అబ్బే, నీకేమీ తెలియదు. నువ్వు నేర్చుకోవలసింది చాలా వుంది. ఆవిత్తు ఇలాగియ్యి. నేను చూపిస్తాను," అని విత్తు తీసుకున్నాడు. "ఈవిత్తులోంచి ఏం మొలిపించ మంటావు?"

"అది మామిడి విత్తనం. అందులోంచి మామిడి మొక్క గాక ఇంకేమి మొలుస్తుంది?"

"అబ్బే. అది ఎవడుపడితే వాడే చెయ్యగలడు. ఈవిత్తులోంచి నారింజచెట్టు మొలిపించనా?"

"మొలిపించు చూద్దాం," అని గారడీ వాడు నవ్వాడు.

"దానికి నారింజ పళ్లే కాక ఇతరచెట్ల పళ్లు కూడా కాయించనా?"

"ఆ, ఆ, అలాగే, దేవుడి దయవల్ల—" అని అంతా నవ్వారు.

సైతాను విత్తు నేలలో పాతిపెట్టి చెయ్యెత్తి "లే!" అన్నాడు.

ఒక చిన్న మొలక భూమిలోంచి తొంగి చూసింది. మెల్లిగా పాము పాకినట్టు ఆకాశంలోకి పాకుతూ పెరిగి పోసాగింది. అయిదు నిమిషాల్లో అదొక మహా వృక్షమైంది. మేమంతా దాని నీడలో ఉన్నాం. "అద్భుతం, పరమాద్భుతం," అని గుసగుసలు బయల్దేరాయి. జనం తలలు పైకెత్తి చూశారు. నారింజ చెట్టుకు రకరకాల, రంగు రంగుల పళ్లు—నారింజ, ద్రాక్ష, అరటి, మామిడి, పనస, మొదలైనపళ్లు కాశాయి. చేతుల్లో తట్టలు ఉన్న వారు తట్టల్లోకి పళ్లు దింపుకున్నారు. అంతా సైతానుకు దండాలు పెడుతూ మహేంద్ర జాలికుడని పొగుడు తున్నారు. ఈవిచిత్ర వార్త ఊరంతటా నిమిషంలో

వ్యాపించింది. గ్రామస్థులు తండోప తండాలుగా ఈ అద్భుతచర్య చూడటానికి రాసాగారు. వట్టి చేతుల్తో రాకుండా బుట్టలు, తట్టలు వెంటపట్టుకు మరీ వచ్చారు. కొద్ది నిముషాల్లో బుట్టలు, తట్టలు నిండిపోయాయి. కాని చెట్టుమీద ఒక్క పండు కూడా తరగలేదు. కోసిన కొద్దీ ఎక్కువగా పెరుగుతున్నాయి పళ్లు. చివరికొక తెల్లజాతివాడు యూరపియన్ దుస్తుల్లో వచ్చాడు.

"పొండి, పొండి, కుక్కల్లారా! ఈస్థలం నాది. ఈ చెట్టు నాది. చెట్టు ముట్టుకున్నారంటే చంపేస్తాను" అని గర్జించాడు.

భారతీయులు తట్టలు కిందపెట్టి నమస్కారం చేశారు. సైతాను కూడా భారతీయుల పద్ధతిలోనే దణ్ణంపెట్టి ఇలా అన్నాడు:

"అయ్యా! పాపం ఈబీద వారిని పళ్లు తీసుకో నివ్వండి. ఒక గంటసేపు వారిని తీసుకో నివ్వండి. ఆతరవాత, మీరూ మీ దేశంవారు ఒక ఏడాదిలో తినగలిగి నన్ని పళ్లకంటే ఎక్కువే మిగుల్తాయి చెట్టుమీద."

విదేశీయుడు మండి పడ్డాడు: "నువ్వెవడివిరా, చెప్పటానికి? దొంగ వెధవ!"అని చేతి బెత్తంతో సైతాన్ని కొట్టాడు. అక్కడితో ఆగక తన్నాడు

వెంటనే చెట్టుమీద పళ్లు చెట్టుమీదే కుళ్లి పోయాయి. ఆకులు రాలి పోయాయి. విదేశీయుడు

మోడు చెట్టు చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు. సైతాను విదేశీయునితో ఇలా అన్నాడు:

"ఈ చెట్టును జాగ్రత్తగా పోషించు. ఎందుకంటే నీ ఆరోగ్యానికి ఈ చెట్టు ఆరోగ్యానికీ అవినాభావ సంబంధం వుంది. ఈ చెట్టు ఇక పళ్లు కాయదు. కాని నువ్వు జాగ్రత్తగా నీళ్లు పోస్తుంటే చాల కాలం బతుకుతుంది. ప్రతిరాత్రీ గంటకొకసారి ఈ చెట్టు మొదట్లో నీళ్లు పోస్తూండాలి. నువ్వే పొయ్యాలి; సేవకుల చేత పోయిస్తే లాభం లేదు. రాత్రిళ్లే పొయ్యాలి; పగలు పోస్తే లాభం లేదు. ఏ రాత్రైనా, ఏ గంట అయినా పొయ్యకుండ మానేశావా, చెట్టు చచ్చి పోతుంది; నువ్వు కూడ వెంటనే చచ్చిపోతావు. మీ దేశానికి తిరిగి వెడదామని అనుకుంటున్నావేమో. ఆ ఆలోచన విరమించు. నువ్వక్కడికి వెళ్లకముందే ఈ చెట్టు చచ్చిపోతుంది; నువ్వూ చచ్చిపోతావు! రాత్రిళ్లు విలాసంగా గడపటం నీకు అలవాటుందేమో. లాభం లేదు, మానెయ్. విలాసాల్లో పడితే నీళ్లు పొయ్యటానికి వీలుండదు; నిష్కారణంగా చచ్చి పోతావు. ఈ స్థలం అమ్మేద్దామనుకుంటావేమో. అలాంటి పిచ్చిపని చెయ్యకు; చచ్చిపోతావు."

ఈ శాపం వింటూ విదేశీయుడు ఇంకా గర్వంగానే నిలబడ్డాడు. కాళ్లమీద పడి ప్రాధేయపడదామా అని భావిస్తున్నట్టు కనిపించాడు. ఇంతలో మేము

వ్యాపించింది. గ్రామస్థులు తండోప తండాలుగా ఈ అద్భుతాన్ని చూడటానికి రాసాగారు. వట్టి చేతుల్తో రాకుండా బుట్టలు, తట్టలు వెంటపట్టుకు మరీ వచ్చారు. కొద్ది నిముషాల్లో బుట్టలు, తట్టలు నిండిపోయాయి. కాని చెట్టుమీద ఒక్క పండు కూడా తరగలేదు. కోసిన కొద్దీ ఎక్కువగా పెరుగుతున్నాయి పళ్లు. చివరికొక తెల్లజాతివాడు యూరపియన్ దుస్తుల్లో వచ్చాడు.

"పొండి, పొండి, కుక్కల్లారా! ఈస్థలం నాది. ఈ చెట్టు నాది. చెట్టు ముట్టుకున్నారంటే చంపేస్తాను" అని గర్జించాడు.

భారతీయులు తట్టలు కిందపెట్టి నమస్కారం చేశారు. సైతాను కూడా భారతీయుల పద్ధతిలోనే దణ్ణంపెట్టి ఇలా అన్నాడు:

"అయ్యా! పాపం ఈ బీద వారిని పళ్లు తీసుకో నివ్వండి. ఒక గంటసేపు వారిని తీసుకో నివ్వండి. ఆతరవాత, మీరూ మీ దేశంవారు ఒక ఏడాదిలో తినగలిగి నన్ని పళ్లకంటే ఎక్కువే మిగుల్తాయి చెట్టుమీద."

విదేశీయుడు మండి పడ్డాడు: "నువ్వెవడివిరా, చెప్పటానికి? దొంగ వెధవ!" అని చేతి బెత్తంతో సైతాన్ని కొట్టాడు. అక్కడితో ఆగక తన్నాడు

వెంటనే చెట్టుమీద పళ్లు చెట్టుమీదే కుళ్లి పోయాయి. ఆకులు రాలి పోయాయి. విదేశీయుడు

మోదుచెట్టు చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు. సైతాను విదేశీయునితో ఇలా అన్నాడు:

"ఈ చెట్టును జాగ్రత్తగా పోషించు. ఎందుకంటే నీ ఆరోగ్యానికి ఈ చెట్టు ఆరోగ్యానికీ అవినాభావ సంబంధం వుంది. ఈ చెట్టు ఇక పళ్లు కాయదు. కాని నువ్వు జాగ్రత్తగా నీళ్లు పోస్తుంటే చాల కాలం బతుకుతుంది. ప్రతిరాత్రీ గంటకొకసారి ఈ చెట్టు మొదట్లో నీళ్లు పోస్తూండాలి. నువ్వే పొయ్యాలి; సేవకులచేత పోయిస్తే లాభంలేదు. రాత్రిళ్లేపొయ్యాలి; పగలు పోస్తే లాభంలేదు. ఏ రాత్రైనా, ఏ గంట అయినా పొయ్యకుండ మానేశావా, చెట్టు చచ్చి పోతుంది; నువ్వు కూడ వెంటనే చచ్చిపోతావు. మీ దేశానికి తిరిగి వెడదామని అనుకుంటున్నావేమో. ఆ ఆలోచన విరమించు. నువ్వక్కడికి వెళ్లకముందే ఈ చెట్టు చచ్చిపోతుంది; నువ్వూ చచ్చిపోతావు! రాత్రిళ్లు విలాసంగా గడపటం నీకు అలవాటుందేమో. లాభం లేదు, మానెయ్. విలాసాల్లో పడితే నీళ్లు పొయ్యటానికి వీలుండదు; నిష్కారణంగా చచ్చి పోతావు. ఈ స్థలం అమ్మేద్దామనుకుంటావేమో. అలాంటి పిచ్చిపని చెయ్యకు; చచ్చిపోతావు."

ఈ శాపం వింటూ విదేశీయుడు ఇంకా గర్వంగానే నిలబడ్డాడు. కాళ్లమీద పడి ప్రాధేయపడదామా అని భావిస్తున్నట్టు కనిపించాడు. ఇంతలో మేము

క్రమంగా అంతర్హితులమై పోయి సింహాళ దేశంలో తేలాము.

ఆ విదేశీయునిపై నాకు జాలి కలిగింది. సైతాను ఇంత క్రూరమైన శాపం ఇచ్చినందుకు, మామూలుగా చేసినట్లు చంపెయ్యటమో, పిచ్చివాడుగా మార్చటమో చెయ్యనందుకు విచారం కలిగింది. నా ఆలోచన సైతాను విన్నాడు. విని అన్నాడు:

"చంపేసే వాణ్ణేగాని అతని భార్యమీద దయ తలచి ఊరుకున్నాను. ఆమె ఇప్పుడు వాళ్ల స్వదేశమైన పోర్చుగల్ నుంచి బయలుదేరి వస్తోంది. ఆమె నాకేమీ అవమానం చెయ్యలేదు కనుక ఆమెకు నేను బాధకలిగించను. ఆమె ఇప్పుడు ఆరోగ్యంగానే వుంది గాని త్వరలో మరణించబోతున్నది. భర్తను చూసి చాలా ఏళ్లయినందున ఎంతో ఆత్రంగా ఆమె వస్తున్నది. వచ్చేపడు పోర్చుగల్ వెళ్లిపోదామని ఆమె ఇతన్ని బలవంతం చేస్తుంది. భర్త ఇక్కణ్ణించి కదలటానికి వీల్లేదని తెలియకుండానే ఆమె చనిపోతుంది."

"ఇతడు భార్యతో ఈ విషయం చెప్పడా?"

"ఉహు. చెప్పడు. ఇదంతా రహస్యంగా ఉంచుతాడు. భార్యకు కూడా చెప్పటానికి జడుస్తాడు"

"ఈ భారతీయులెవరికీ ని శాప వాక్కులు అర్థం కాలేదా?"

"ఉహు. ఎవరికీ అర్థంకాలేదు. కాని కొందరికి అర్థమైందని అతడు అనుమానిస్తాడు. ఆ అనుమానం

అతన్ని నిరంతరం పీక్కు తింటూంది. ఎందుకంటే అతనికి భాగస్థులయిన వాళ్ళ క్రూరంగా ప్రవర్తించే అలవాటున్నది. అందుకు ప్రతిక్రియగా వాళ్ళు ఈ చెట్టు నరికి వేస్తున్నట్టు అతను కలలు కంటాడు. ఈ కలలతో అతని నిద్ర నాశన మవుతుంది; మనశ్శాంతి ఉండదు. రాత్రిళ్లు శాంతిలేకుండా నేను ఏర్పాటు చెయ్యనే చేశాను గదా."

పోర్చుగీసు వాణ్ణి హింసించి సైతాను ఆనందం పొందుతున్నందుకు నాకు విచారం కలిగింది.

"సైతాన్! నువ్వు చెప్పింది అతను నమ్ముతాడా?"

"నమ్మకూడదని మొదట అనుకున్నాడు గాని మనం అంతర్థానులం కావటంతో నమ్మక తప్పలేదు. అదీగాక అదివరకు ఏమీ లేనిచోట చెట్టు మొలవటం, దానికి వివిధ ఫలాలు కాయటం, తరవాత చెట్టు మాయమైపోవటం, ఇవన్నీ చూసి నమ్మక తప్పలేదు. నమ్మినా, నమ్మకపోయినా, అతను ప్రతిరాత్రీ విధిగా చెట్టుకు నీళ్లుపోసి తీరుతాడు. అంతేగాదు, అతను నీళ్లుపోసే కార్యక్రమం ప్రారంభించబోయే ముందు మరొక చిన్నపని కూడా చేస్తాడు."

"ఏమిటది?"

"ఒక మతగురువును పిలిపించి చెట్టును పవిత్రం చెయ్యమని కోరుతాడు."

"మతగురువుకు మరి ఈ రహస్యం చెబుతాడా?"

"ఊహూ. చెప్పడు. బొంబాయి నుంచి ఒక గారడీ వాడొచ్చి ఈ చెట్టు మొలిపించాడనీ, ఆ గారడీ వాడు ఈ చెట్టులో ఒక పిశాచాన్ని ప్రవేశ పెట్టాడనీ, ఆ పిశాచాన్ని పోగొడితే చెట్టు తిరిగి కాయలూ, పళ్లూ కాస్తుందనీ అబద్ధం ఆడతాడు. మతగురువు పిశాచాన్ని వెళ్లగొట్టటానికి ప్రయత్నించి విఫలుడవుతాడు. అప్పుడు పోర్చుగీసు వాడు సిల్లబిండె పుచ్చుకుని తయారవుతాడు."

"కాని మతగురువు ఊరుకుంటాడా? చెట్టును కాల్చి వేయించడూ?"

"అవును. యూరప్‌లో అయితే చెట్టునే కాక ఆమనిషిని కూడా కాల్చివేస్తారు. కాని ఇండియాలో ప్రజలు నాగరికులు. అందుచేత యూరప్‌లో జరిగే దారుణాలు ఇక్కడ జరగవు. పోర్చుగీసు దొర మతగురువును పొమ్మని చెట్టును ప్రాణ సమానంగా కాపాడు కుంటాడు."

కొంతసేపు మౌనంగా ఉన్నాము. "సైతాన్! పాపం అతని జీవితం చాలా కఠినం చేశావు," అన్నాను.

"అవును కొంచెం కఠినమే. జీవితం అంటే ఆట విడుపులాటిది కాదు."

మేము ప్రపంచంలో ఇంకా అనేక చిత్ర విచి

త్రాలు దర్శించాము. సైతాను ఎన్నో వింతలు చూపించాడు. ఏమింత చూపించినా ప్రతిదీ మానవ జాతి దౌర్బల్యాలను ఎత్తిచూపేదిగానే వుంది

# 11

సైతాను మరొక సంవత్సరం పాటు ఇలాగే అప్పు డప్పుడు నన్ను చూట్టానికి వచ్చేవాడు. నెమ్మది నెమ్మదిగా రావటం తగ్గించాడు. తరవాత ఒకసారి చాలాకాలం వరకూ రానేలేదు. అతడు రానప్పుడు ఏమీతోచక దిగులు పెట్టుకునే వాణ్ణి. విశాల విశ్వం ఎరిగిన సైతానుకు భూలోకం సైకత రేణువు లాంటిది. అందుచేత నామీద అతనికి క్రమంగా కౌతుకం తగ్గి పోయిందేమో నని అనుమానించాను. చివరి కొక రోజున అతడు ప్రత్యక్షమయ్యాడు. సంతోషంతో పరవశించి పోయాను. కాని ఆ సంతోషం క్షణ భంగురం లాగా మరుక్షణంలోనే మాయమైంది. శాశ్వతంగా వీడుకోలివ్వటానికి వచ్చాడు. తనకు ఖగోళంలోని ఇతర ప్రాంతాల్లో పరిశోధనలు సాగించ వలసిన పని వున్నదనీ, ఆ పరిశోధనలు నేను వేచి వుండగల కాలంకంటే ఎక్కువ కాలమే పడతాయనీ, అందుచేత తుది వీడ్కోలిస్తున్నాననీ సైతాను చెప్పాడు.

"మళ్లీ ఎన్నటికీ రావా? అసగద్గదంగా అడిగాను.

"రాను," అన్నాడు. "మనం చాలరోజులు స్నేహం చేశాము. ఈస్నేహం ఉభయులకూ సంతోష ప్రదమే అయినప్పటికి నేను వెళ్లక తప్పదు."

"ఈజీవితంలో కాకపోయినా మరొక జీవితాలో నైనా నిన్ను చూడలేనా?"

నాప్రశ్నకు సైతాను మేఘ గంభీర స్వరంతో సమాధాన మిచ్చాడు: "ఉన్నది ఈఒక్క జీవితమే. మరొక జీవితం లేదు."

విద్యుత్తరంగం సోకినట్టయి క్షణంసేపు స్తంభించాను. నెమ్మదిగా అవ్యక్తమైన, ఆనంద తరళితమైన ఆశా తేజస్సు మనస్సులో విస్తరించుకో సాగింది. సైతాను వాక్కులు నిజం కావచ్చుననీ, నిజమే నేమోననీ అనిపించింది.

"థియొడోర్! అలా ఆశ్చర్యపడతా వేం? ఈసంగతి నీకిదివరకు తెలియదా?"

"నాకా? ఎలా తెలుస్తుంది? అదే నిజమైతే—"

"ముమ్మాటికీ నిజం నేను చెప్పింది."

ఒక్కసారిగా ఇంత మనశ్శాంతి ప్రసాదించినందుకు సైతానుపట్ల కృతజ్ఞతా భావంతో నిండి పోయాను. కాని ఎక్కడో ఒకమూల సందేహ రేఖ తోచింది. "కాని—కాని—నువ్వే ఒకసారి చూపించావు గదా అనంతర జీవితక్రమం? అది యథార్థం కాదా?"

"కాదు. అది కేవలం మాయ. దానికి అస్తిత్వం లేదు," అన్నాడు సైతాను.

"మాయ—మాయ—మా—" చంద్ర దర్శనంతో ఉప్పొంగిన సముద్రంవలె ఉవ్వెత్తున లేచి ఉక్కిరి బిక్కిరైంది నా హృదయం.

"అవును. జీవితం మాయ. స్వప్నాలవల."

ఆ! జ్ఞాపకం వచ్చింది. ఇదే భావం ఎన్నివేల సార్లు నామానసిక పథంలో తొంగిచూసి తొలిగి పోయింది!

"ఏదీ లేదు. అంతా మాయ. రంగు రంగుల కలలవల. ఏదీ లేదు. దేవుడు—మానవుడు—భూమి—సూర్యుడు—చంద్రుడు—నక్షత్రాలు —ఆకాశం—అన్నీ, అంతా మాయ, భ్రాంతి; నువ్వూ, నీచుట్టూ నిన్నావరించుకుని, అగాధం, అనంతం, అమేయం అయిన ఈమహా శూన్యమూ తప్ప మిగతాదంతా అస్తిత్వ రహితం."

"నేనా? నేను ఉన్నానా?"

"అవును. నువ్వంటే నువ్వు కాదు. నీకు శరీరం లేదు, రక్తంలేదు, ఎముకలు లేవు—నువ్వు కేవల భావానివి. నాకు కూడా అస్తిత్వంలేదు. నేను స్వప్నాన్ని; నీ స్వప్నాన్ని; నువ్వే నన్ను సృష్టించావు. మరి కాసేపటిలో ఇది నువ్వు గ్రహిస్తావు. గ్రహించి నన్ను నీమనస్సు నుంచి తొలగిస్తావు.

అప్పుడు నేను ఏశూన్యంనుంచి నువ్వు సృష్టించావో ఆశూన్యంలోకి కరిగిపోతాను......

అప్పుడే కరిగిపోతున్నాను, కలిసిపోతున్నాను... ఇంకాసేపట్లో నువ్వు తీరంలేని శూన్యతా సముద్ర మధ్యంలో స్నేహితులూ, సన్నిహితులూ, నా అనే వారూ లేక, ఏకాకివై సంచరిస్తూ, భావంగా సంభ్రమిస్తూ—ఒక్కడివే, ఒంటరిగా యుగాలదాకా మిగిలిపోతావు. నువ్వు భావానివి. నీకు చావులేదు, తుది లేదు, మొదలు లేదు. కాని నేను నీ సేవకుణ్ణి. నిన్ను నీకు తెలియజేశాను; నిన్ను విముక్తుణ్ణి చేశాను. నాపని అయిపోయింది, వెళ్లిపోతున్నాను. మళ్లీ కలలు కను. ఇంతకంటె మంచి కలలు కను.

ఈవిషయం నీకింత కాలంవరకూ తెలియక పోవటం వింతగావుంది. సంవత్సరాలు, శతాబ్దాలు, యుగాలు, కల్పాలు, మహాకల్పాలు నీ కళ్లముందే గడిచిపోయినా ఈవిషయం తెలుసుకోలేక పోయావు. ఈ ప్రపంచం, అందులోని వస్తుకోటి, అన్నీ స్వప్నాలనీ, అబద్ధాలనీ తెలుసుకోలేక పోయావు. ఆ స్వప్నాలైనా అర్థం లేని, ఉన్మాదయుతమైన స్వప్నాలు. దేవుడట దేవుడు! సుజనులను సృష్టించ గలిగివుండి కూడా దుర్జనులను సృష్టించాడు. తన పుత్రులైన మానవుల నందరినీ సౌఖ్యవంతులుగా చేయగలిగి కూడా దుఃఖితులను చేశాడు. ఈదుఃఖ జీవితాన్నే ప్రేమించేట్టు చేసి, మధ్యలోనే దాన్ని

తుంచివేశాడు. దేవతలకు అడక్కుండా ఆనందం ఇచ్చి, తన మిగతా సంతానాన్ని అది కష్టపడి సంపాదించుకో మన్నాడు. దేవతలకు బాధారహిత జీవితం ఇచ్చి, మిగతా సంతానానికి లక్ష మానసిక బాధలు లక్ష శారీరక వ్యాధులు తగిలించాడు. దేవుడట దేవుడు! లక్ష ధర్మపన్నాలు చెబుతూ నరకలోకం సృష్టించాడు. దయగా వుండాలని చెబుతూ నరకలోకం సృష్టించాడు. ఇతరులకు నీతి అవినీతులు అంటగడుతూ తనకేమీ లేకుండా చేసుకున్నాడు. ఇతరులు నేరం చేస్తే శిక్షిస్తూ తను అన్ని నేరాలూ చేశాడు. అడక్కుండా, పెట్ట కుండా మనిషిని సృజించి మనిషి చేసే చర్యల బాధ్యత తనపై వేసుకోవలసిందిపోయి, మనిషిపైకే నెట్టివేశాడు. ఇంత అన్యాయం చేసి పైగా దుఃఖ భాజనుడైన మానవుడు తన్ను భక్తితో కీర్తించాలని శాసించాడు. దేవుడట దేవుడు.

చూశావా థియొడోర్! ఈపిచ్చి తనమంతా స్వప్నంలో కాకపోతే వాస్తవంగా జరగటానికి వీలుం దంటావా? ఇదంతా పిచ్చితనం కాకపోతే మరేమిటి? ఈపిచ్చి తనం తన్నుతాను తెలుసుకోలేని నీ మనస్సు తప్ప మరెవరు సృష్టిస్తారు? ఒక్కమాటలో చెప్పా లంటే ఇందతా మిథ్య, స్వప్నం. నువ్వే దీనికి కర్త.

నేను చెప్పింది నిజం. దేవుడు లేడు, ప్రపంచం లేదు, మానవజాతి లేదు; జీవితం లేదు, స్వర్గం లేదు, నరకం లేదు. ఇదంతా అర్థం పర్థం లేని స్వాప్నిక భ్రాంతి.

నువ్వుతప్ప మిగతాదంతా అసత్యం. నువ్వెవరివి? భావానివి, ఉపయోగం లేని భావానివి. నిలకడ లేని, నిలవనీడ లేని భావానివి. పరిధి లేని శూన్యపథంలో, యుగాల రథంలో నిస్సహాయంగా ప్రయాణం చేసే భావానివి."

ఈమాటలు ముగిస్తూ సైతాను అంతర్ధానుడయ్యాడు. అతడు చెప్పిన ప్రతిముక్కా నిజమనే ప్రబోధంతో అప్రతిభుణ్ణయి నిలిచిపోయాను.

# సమాప్తం



